## సచిత్ర విచిత్రం



# వింత అగ్రిమెంట్

80 ఏళ్ల వయసున్న హాలీవుడ్ మహానటుడు ఎంథోని క్విన్-34 ఏళ్ల కేథీలకు పుట్టిన పేట్రిషియాను- తాము విడాకులు తీసుకునే పక్షంలో తండ్రికే వదిలేస్తాననీ, కోర్టుకు వెళ్లననీ కేథీ లిఖితపూర్వకంగా హామీ ఇచ్చాకనే అతనామెని గర్భవతిని చేశాట్ట.

# చతురకథలు

## హవా'లా'జిక్

రిటైరయ్యి స్వగ్రామానికి తిరిగిరాగానే బాల్య మిత్రుడు లక్ష్మణరావుని కలుసుకుందామని వెళ్ళాను. మా ఇద్దరి స్వగ్రామమూ ఒకటే కావడంతో మేము ఒకే కాలువలో ఈతలు కొట్టి, ఒకే చెరువులో చేపలు పట్టేవాళ్లం. ఒకేబళ్లో చదువుకుని, ఒకే గుళ్లో ప్రసాదం పంచుకు తినేవాళ్ళం. మామధ్య ఎటువంటి అరమరికలూ లేవు. అందుకే తాను లంచాలు తీసుకుంటానన్న సంగతి నా దగ్గర దాచలేదు వాడు.

లక్ష్మణరావు ఇండస్ట్రీస్ డిపార్ట్‌మెంట్‌లో జాయింటు డైరెక్టర్‌గా పనిచేస్తున్నాడు. మరో ఏడాదిలో రిటైర్ కాబోతున్నాడు.

నన్ను చూడగానే సంబరపడిపోయి కౌగి లించుకున్నాడు వాడు. కూల్‌డ్రింక్సు తాగు తూంటే లంచాల ప్రస్తావన వచ్చింది. "ఇప్పుడు ఓ పార్టీ రాబోతోంది. పది కోట్ల ప్రాజెక్టును క్లియర్ చేసేందుకు లంచం ఇవ్వ బోతోంది నాకు" అన్నాడు నవ్వుతూ.

నేనసలే భయస్థుణ్ణి. వెళ్లొస్తానని లేవ బోతే కదలనివ్వలేదు వాడు.

"ఒరేయ్! వాడు ఏ ఎసిబి వాళ్లనో వెంట బెట్టుకు రాగలడు, జాగ్రత్త" అని నేను హెచ్చరిస్తే, పెద్దగా నవ్వి, "ఎసిబిలకు, సిబి ఐలకు జడిసే ఘటం కాదిది. ఎప్పుడు ఎలా తప్పించుకోవాలో నాకు బాగా తెలుసు" అన్నాడు గొప్ప ఆత్మవిశ్వాసం వుట్టిపడు తుంటే.

కాసేపట్లో ఆ పార్టీ రానేవచ్చాడు, ఇద్దరిని వెంటబెట్టుకుని మరీ. ఎందుకైనా మంచిదని మావాడి చెవిలో హెచ్చరించానుగాని, విని పించుకోలేదు వాడు. ఆ పార్టీ బ్రీఫ్‌కేస్ తెరిచి మావాడి ముందుంచాడు. దానినిండా నోట్ల కట్టలున్నాయి. "అయిదు లక్షలు" అన్నాడు. ఆ బ్రీఫ్‌కేసుని నిర్లక్ష్యంగా అందు కుని పక్కకు పెట్టుకున్నాడు మావాడు.

"మీ మేలు మరవను సాబ్! కాగితాల మీద సంతకాలు పెట్టేశారంటే ప్రాసెస్‌కి స్తాను" అంటూ తన బ్రీఫ్‌కేస్ తెరిచి అందు లోంచి ఏవో ఫారాలు బయటకు తీశాడు పార్టీ.

అదేక్షణంలో- పిచ్చెక్కినవాడిలా అరిచాడు మావాడు- "స్టాపిట్! నాకు లంచమిచ్చి పని చేయించుకోవాలనుకుంటున్నావా? గెటౌట్ బిఫోర్ ఐ కాల్ ద పోలీస్!" అంతకు ముందు తాను తీసుకున్న క్యాష్ వున్న బ్రీఫ్ కేసుని ఆ పార్టీ ముందుకు తోసేశాడు.

వచ్చిన వాళ్లు తెల్లబోయి ఏదో అనబోయా రుగాని, వాడి వాలకం చూసి భయపడి క్యాషూ, కాగితాలూ పట్టుకుని బయటకు పరుగెత్తారు.

వాడి ప్రవర్తనకు మతిపోయిన నేను, "అతనితో వచ్చినవాళ్లు ఎసిబి వాళ్లని గుర్తిం చావా ఏమిటి? " అనడిగాను.

"ఛఛ! వాళ్లకు నేను భయపడనని ముందే చెప్పానుగదా? " అన్నాడు.

"మరి? " నేను తెల్లముఖం వేశాను.

"కాగితాల కోసం వాడు తన బ్రీఫ్‌కేస్ తెరి చాడు చూశావా? " అనడిగాడు.

"ఔను"

"అందులోనే వుంది డేంజర్!" అన్నాడు.



"లోపల వాడి డైరీ కనిపించింది. డైరీ మెయిన్‌టెయిన్ చేసేవాడంటే చాలా డేంజర్. అందులో వాడు ఏ కోడ్‌తో ఏం గిలుకుతాడో మనకు తెలీదు. అందుకే రిస్కు తీసుకోదలచుకోలేదు నేను..."

వాడి పలుకులు వింటుంటే, హఠాత్తుగా జైన్‌డైరీ, 'హవాలా' కేసు గుర్తుకొచ్చాయి నాకు.

'హౌరా, డైరీ!' అనుకున్నాను విస్తుపోతూ.

-తిరుమలశ్రీ

---

## సారె- 2000

న్యూస్ పేపర్ తెరవాలంటేనే భయమేస్తోంది సుందరికి ఈమధ్య. ఎందులో చూసినా కట్నాల చావులే. కోడలు కట్నం తేలేదనో, తెచ్చిన కట్నం చాల్లేదనో అత్తమామలో, ఆడపడుచులో, మొగుడన్న మగాడో- అమాయక యువతుల్ని కిరసనాయిలు పోసి కాల్చిచంపడాలు చదువుతుంటే పీడకలలు వస్తున్నాయి ఆ పిల్లకు.

అందుక్కారణం ఆమధ్యే కృష్ణమూర్తిని ప్రేమించి పెళ్లాడిందామె. పైసా కట్నంతేని ఆ పెళ్లి సుతరామూ ఇష్టంలేదు కృష్ణమూర్తి తల్లిదండ్రులకు. తెల్లతోలు చూపించి, వగలు వొలికించి అమాయకుడైన కొడుకుని సుందరి వలలో పడేసుకుందనీ, రావలసిన లక్షల కట్నానికి ఆనకట్టవేసిందనీ అక్కసుతో దుమ్మెత్తిపోసింది రక్కసిలాంటి సుందరి అత్తగారు. కొడుకు ఎదురు తిరిగిన కారణంగా తప్పనిసరిగా ఆ పెళ్లి జరిపించినా, ఆ పిల్ల తన (కట్నపు) కోరలనుంచి ఎలా తప్పించుకుంటుందిలే, కాపురానికి రానీ చూద్దాం అనుకుంది.

సుందరి తల్లిదండ్రులు కట్నం ఇవ్వకపోయినా కూతురికి సారె మాత్రం ఘనంగానే పెట్టారు.

కొత్తకోడలు సారె, చీరతో అడుగుపెట్టిన క్షణంనుంచీ పక్షవాతం వచ్చినట్లు సుందరి అత్తగారికీ, ఆడపడుచుకూ మూతులు వంకర్లు తిరిగిపోతూనే వున్నాయి.

దుర్గమ్మ కోడలు సారెతో వచ్చిందన్న కబురు లోకల్ కాకి ద్వారా అందడంతో



పొలోమని వచ్చేశారు చుట్టుపక్కలనున్న అమ్మలక్కలంతా. సుందరి ఏమేం తెచ్చిందో ఆరాతీస్తూ వస్తువులన్నీ అడిగి మరీ చూసారు కుతూహలంతో.

అయితే-

సారెలోని రెండు కొత్త వస్తువుల్ని చూసి ముక్కున వేలేసుకున్నారంతా. బుగ్గలు నొక్కుకున్నారు. సారెలో వాటి స్థానమేమిటో వూహకందక చెవులు కొరుక్కున్నారు. ఓ ముసలమ్మ మాత్రం ముఖంమీదే అడిగేసింది సుందరిని- "సారెలో ఈ కిరసనాయిలు డబ్బా, అగ్గిపెట్టే ఎందుకే పిల్లా?" అని.

సుందరి జవాబిచ్చేలోపునే ఆడపడుచు అందుకుని, "ఈవిడగారు మా అన్నయ్యను వల్లో వేసుకుని కట్నం ఎగ్గొట్టిందిగా? అవసరమైతే తగలబెట్టించుకోవడానికి పనికొస్తాయని తెచ్చుకునుంటుంది" అంటూ పెద్దగా నవ్వింది. ఆమెతో శ్రుతి కలిపారంతా అదేదో పెద్దజోక్ అయినట్టు.

సుందరి అందుకుంది, "నిజమేనండీ, మా ఆడపడుచు చెప్పింది నిజమే. కట్నం తేలేదని నన్ను వేధించేట్లయితే ఆ బాపతువాళ్లని తగలెట్టమని మా అన్నయ్య ఇచ్చిపంపాడివి. ఆయన పోలీసాఫీసరులెండి" అంది తాపీగా.

అంతే! పిన్‌డ్రాప్ సైలెన్స్ ఆవరించుకుందక్కడ!!

-పి.వి.వి.సత్యన్నారాయణ

---

## కవితా- కాలర్

'లావణ్య' బిడియంగా ఆఫీసురూంలోకి అడుగుపెట్టింది. 'డిప్యుటేషన్' మీద ఈ ఆఫీసుకి వచ్చిందావిడ. అందరూ తమని తాము పరిచయం చేసుకున్నాక కాసేపటికి ఎవరి పనుల్లో వాళ్లు నిమగ్నులయ్యారు.

యు.డి.సి. క్లర్క్ 'మనోరంజన్' ఆమె అందానికి ముగ్ధుడై కొడ్తున్న టైపు మాని తదేకంగా చూస్తూండిపోయాడు.

తన సీట్లో కూచొని రెస్ట్ తీసుకుంటున్న లావణ్యకు గిల్టీగా అన్పించింది. పలకరింపుగా నవ్విందిగానీ ఆయన నవ్వలేదు. పైగా చూడటమూ మానలేదు.

మనోరంజన్ ఒకప్పుడు కవి. వయస్సు మీద పడటంతో సంపాదనమీద ధ్యాస పెరిగి... కళాపోషణ తగ్గించాడు. తను పోగొట్టు



కున్న కవితా సుందరికోసం ఎదురు చూసీ చూసీ ఆయన కళ్లకు కాయలు కాయలేదు కాని పువ్వులు వేశాయి. మొన్నే 'కాటరాక్ట్ ఆపరేషన్ చేయించుకొన్నాడు.

అలా రోజూ కవితా సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ... లావణ్యవంకే మిడిగుడ్లు వేసుకొని చూస్తుండటంతో ఆమెకు ఈ ఆపదను ఎలా తప్పించుకోవాలో అర్థం గాలేదు. ఇంకొక్క నెలరోజులు ఓపిక పడితే మళ్లీ తను తన స్వస్థానానికి వెళ్ళిపోతుంది.

ఒకనాడు ఆమెనే తదేకంగా చూస్తున్న మనోరంజన్‌కు కలుక్కుమని మెడ పట్టేసింది. దాంతో ఆ సాయంత్రమే ఎముకల డాక్టర్‌ని కలిశారాయన.

ఆయన బాధ అంతా విని ట్రీట్‌మెంట్ రాయబోయేటంతలో లోపల్నించి ఓ తియ్యటిగొంతు వినిపించింది. మనోరంజన్ ఆ పిలుపు సరిగా వినివుంటే ఆ గొంతు లావణ్యదిలా గుర్తుపట్టేవాడే. కానీ మెడ బాధ విపరీతంగా వుంది.

కాసేపటికి బయటికొచ్చిన డాక్టర్ ధుమధుమలాడుతూ "ఇంత సీరియస్ కండిషన్‌ని ఇంత అశ్రద్ధచేసి ఆలస్యంగా వస్తే ఎలా?" అని... "ఈ జబ్బు ఇలానే వుంటే కొంతకాలానికి మీ మెదడు కూడ పుచ్చిపోతుంది'' అని సెలవిచ్చాడు.

ఆ వెంటనే సర్వైకల్ కాలర్ తెప్పించి మెడచుట్టూ వేశాడు.

దాని ఖరీదుతోపాటు ఫీజూ దండిగా వసూలు చేశాడు డాక్టర్.

ఇక మనోరంజన్ మెడ ఎటూ తిప్పలేని స్థితిలో ఆ మర్నాడు ఆఫీసులో పక్కనే కూచొని వున్నా లావణ్య అందాన్ని చూడటానికి కాలర్ సైంధవుడిలా అడ్డుపడింది.

లావణ్య తనలోతాను ముసిముసి నవ్వులు నవ్వుకుందిగానీ, ఆ డాక్టర్ లావణ్య కజిన్ అనీ, అతని ఇంట్లోనే ఆమె బస చేసిందనీ, ఆ కాలర్ ఆమె ఉన్నన్నాళ్లూ ఆ మెడ చుట్టూ అంటిపెట్టుకొని వుంటుందనీ పాపం, అతనికి తెలీదు.

— డా॥కె. శివసుబ్బారావు

## చందా

**గుం**పుగా వస్తున్న పదిమంది కుర్రాళ్లను చూడగానే గుర్నాధం గుండె దడదడలాడింది. కుర్రాళ్ల చేతుల్లోని డబ్బాలు గలగలమన్నాయి.



"డబ్బులు తియ్యి త్వరగా..." అంటూ జబర్దస్తీగా ఉన్న కుర్రాడు గుర్నాధం కిళ్లీకొట్టు లోని కాష్‌బాక్స్‌మీద దబదబ బాదాడు.

"వరుసగా కృష్ణాష్టమి, వినాయకచవితి, దసరా అంటూ చందాలు వసూలు చేశారుగా! మళ్లీ దేనికి?" బెదురుతూనే అడిగాడు గుర్నాధం.

"దీపావళికి నరకాసురుడి బొమ్మ తగలేస్తున్నాం. నరకాసురుడి వధకు చందా ఇవ్వకపోతే నరకానికి పోతావు జాగ్రత్త!" కోపంగా అన్నాడు జబర్దస్తీ కుర్రాడు.

వాదించే ఓపికలేక మౌనంగా ఇరవై రూపాయలనోటు అందించాడు గుర్నాధం.

షాపు మూసేసి ఎటైనా పారిపోవాలనిపించింది అతనికి. పనీపాటులేని ఈ కుర్రకుంకలు చందాలు వసూలు చేసి, ఓ పందిరి వేసి దేవుడి బొమ్మలు ఓ మూల పెట్టేస్తారు. ప్రతిరోజు వీలైనంత అశ్లీలపు, ద్వంద్వార్థపు సినిమా పాటలు వేసి లౌడ్‌స్పీకరుతో వాయిస్తుంటారు. రాత్రిపూట బూతుపాటలు, రోత కూతలు నిండిన తెలుగు సినిమాలు తెచ్చి వీడియోలో ప్రదర్శిస్తారు. అంతకుమించి నలుగురికీ పనికొచ్చే ప్రోగ్రామ్స్ ఏవీ ఏర్పాటు చేయరు.

అకస్మాత్తుగా గుర్నాధంకు ఒక అయిడియా వచ్చింది. వెంటనే కొట్లో తగిలించిన దేవుడి పటాన్ని తీసి గల్లాపెట్టెలో దాచేశాడు.

డిసెంబరు చివర్లో మళ్లీ చందాలు వసూలు చేసే గుంపు తయారైంది.

వాళ్లొచ్చి చందా అడగగానే ధీమాగా అన్నాడు గుర్నాధం.

"దేవుడా? ఎవరాయన? నాకు దేవుళ్లతో పనేమీ లేదే?"

చందాల గుంపు పగలబడి నవ్వింది.

జబర్దస్తీ శాల్తీ డబ్బా గలగలాడిస్తూ చెప్పాడు, "నువ్వు చాలా తెలివైన వాడినను కుంటున్నావు కాబోలు, నాస్తికుల పండుగలూ ఉన్నాయిలే. ఇప్పుడు మేము వచ్చింది న్యూఇయర్‌డే చందాకు. ఇంకా రిపబ్లిక్‌డే, హోళి, అంబేద్కర్ జయంతి, మేడే, స్వాతంత్ర్య దినోత్సవం, గాంధీ జయంతి, ఆంధ్రరాష్ట్రావతరణ దినోత్సవం ఇలా చాలా ఉన్నాయి. వాటన్నిటికీ కాదుగానీ కొన్నింటినైనా ఘనంగా జరుపుతాం"

చందా రాక్షసుల వివరణతో గుర్నాధంకు మూర్ఛ వచ్చేసింది.

—బి. అనూరాధాప్రసాద్

# పరిమళ ముత్యాలు

☆ మంచి పనులు చేసే వత్తిడిలో వుండే వ్యక్తికి సుఖంగా జీవించడానికి కాలం దొరకదు.

-ఠాగూర్

☆ ఒక క్రొత్త సమాజమనే క్రొత్త మందిరాన్ని నిర్మించడానికి క్రొత్త మానవుడనే క్రొత్త ఇటుక కావాలి.

-టాల్‌స్టాయ్

☆ కడుపు కాలుతున్న నిరుద్యోగికి వ్యక్తి స్వతంత్రం గురించి చెప్పడం వ్యర్థమూ, అర్థరహితమూ కూడా.

-స్టాలిన్

☆ శుభ్రంగా పెళ్ళి చేసుకో, పెళ్ళాం అనుకూలవతి అయిందా సుఖపడతావు. కాదూ- వేదాంతివి అవుతావు.

-సోక్రటీస్

☆ చిన్న కొవ్వొత్తి తన కాంతి కిరణాలతో ఎలా వెలుగు నివ్వగలదో, ఈ ప్రపంచంలో ఒక మంచి పని కూడా ఆ విధంగానే ప్రకాశించగలదు.

-షేక్స్‌పియర్

☆ చట్టాలు పేదవారిని రాసి రంపాన పెడతాయి. ధనవంతులు చట్టాలను శాసిస్తారు.

-గోల్డుస్మిత్

☆ విజయాన్ని ఎలా సాధించగలమో ఓటమి బోధిస్తుంది

-జార్జి డిమిట్రావ్

☆ శాంతి రాయబారం బలహీనతకాదు, మారణహోమం రాజనీతి కాదు.

-సర్వేపల్లి రాధాకృష్ణ

☆ చిత్రాలు మాటలు లేని కవితలు

-హోరేస్

☆ జీవితంలో బాల్యదశ ఉషోదయం వంటిది

-మిల్టన్

☆ ప్రతి వంటగత్తే ఒక రాజీయవేత్త కావాలి.

-లెనిన్

సేకరణ: ఆముదాల అజయ్‌బాబు

# చతుర

సంపుటి: 19 సంచిక: 8 సెప్టెంబర్ 1996

"చూడుబాబూ! నీకిష్టంలేకపోతే నా దగ్గరనుంచి మారిపో. అంతేగానీ ఇలాంటి బిహేవియర్‌ని నేను చస్తే సహించను. నా దగ్గర రీసెర్చి బాగుండలేదట బాబుగారికి..." అంటూ ఆ ప్రొఫెసరుగారు ఆవేశంగా ఏదో అనబోతుండగానే...

"మీ గైడెన్స్ నాకు ఎంతమాత్రం నచ్చలేదు. ప్రతి క్షణం చంపుకుతినే మీలాంటి గైడ్‌లను నమ్ముకున్న మా స్కాలర్లపని ఇంతే... ఈరోజే మీ నుండి మారిపోతాను" అని మరింత ఆవేశంగా కేకలేశాడు ఆ రీసెర్చి స్టూడెంట్.

ఆ కేకలకి అందరూ పరుగెత్తుకొచ్చారు. ఈ పరిస్థితికి కారణాలేమిటి? వారిద్దరూ పరస్పరం ఆరోపించుకున్న అభియోగాలు నిజమా? యూనివర్సిటీలలో రీసెర్చి విద్యార్థుల సాధకబాధకాలను, వారిపట్ల గైడ్‌ల తీరుతెన్నులను విపులంగా విశ్లేషించిన అయ్యగారి సీతారత్నం నవల 'స్కాలర్' ఈ నెల 'చతుర' సమగ్రనవల.



# స్కాలర్

—అయ్యగారి సీతారత్నం

"చూడూ, ఆ మాసిన పేంట్...

ఇస్త్రీ మడతతో ఉన్న చొక్కా...

భుజాన వేలాడుతున్న బేగ్... పెరిగిన గెడ్డం, దాన్నే చిరుగెడ్డం అంటార్లే వాళ్లు ముద్దుగా.

సరిగ్గా దువ్వుకోని క్రాఫ్... అన్నింటికన్నా ముఖ్యంగా కళ్లల్లో తెలివితేటలని కనబడ కుండా చేసే నిరాశ, నిరుత్సాహం, లేదా స్తబ్ధత, చిరాకు... ఇలాంటివన్నీ ఉన్న వ్యక్తిని చూడగానే ఎవరూ చెప్పకుండానే స్కాలర్ అని చెప్పొచ్చు సుమీ"

టీ తాగుతూ, లౌడ్‌స్పీకర్‌లా మాట్లాడు తున్న ఆ అమ్మాయి మాటలు వినకతప్ప లేదు రాజు, నిశాంత్‌లకి.

వింటూనే గడ్డం చుట్టూ చేత్తో తడుము కుంటూ 'ప్చ్' అన్నాడు నిశాంత్. ఆ వెంటనే రాజువైపు తిరిగి-

"ఫ్రెషర్‌లాగే ఉందికదూ! జంకులేకుండా ఎలా వాగుతోందో? " అన్నాడు ఆమె మాట లకి రియాక్టవుతూ.

"కరక్ట్‌గానే చెప్పింది కదా"

"ఆ! అలా ఉండడానికి కారణం ఆలోచిం చగలరా వీళ్లు? అమ్మా, బాబూ శుభ్రంగా సంపాదించిపెడుతూ ఉంటే ఊసుపోకకి చదువుకొందుకి వచ్చేవాళ్లు అలాగే అంటారు"

"అందరి గురించీ అలాగే అనుకుంటే ఎలా? పోనీ ఆమెని పరిచయం చేసుకొం దామా? "

వద్దంటున్న నిశాంత్ మాటలు పట్టించు కోకుండా, ఆమె దగ్గరికి వెళ్లి "హలో" అన్నాడు రాజు- నిశాంత్ కూడా అతన్ని అనుసరించాడు.

వెంటనే "నమస్తే" అందామె గౌరవంగా.

"ఫ్రెషర్‌వేనా? " అడిగాడు నిశాంత్.

"అవునండీ"

"మరి ఏమిటా స్టేట్‌మెంట్స్, గట్టిగా గొంతు పెట్టుకొని"

"ఫ్రెషర్ అయితే మాట్లాడకూడదా? యూనివర్శిటీకి ఫ్రెష్‌గా వచ్చాగానీ, ఈ భూమిమీదకి ఏనాడో వచ్చాను. ఎనిమిది నెలల వయసునుండి నేర్చుకొన్న మాటలు అలా... అలా ఈ స్థాయికి వచ్చాయి"

"సంతోషించాం తెలివితేటలకి" అన్నాడు నిశాంత్.

"థేంక్యూ సార్"

"చూడు తల్లీ! మొన్నటిదాకా మీకన్నా తుళ్లుతూ, పేలుతూ ఉత్సాహంగా ఉన్నవా ళ్లమే"

"అదేమరి ఎందుకు ఇలా తయార య్యారు? "

కొరకొరా చూస్తూ పళ్లబిగువున ఆవేశాన్ని ఆపుకొంటున్న నిశాంత్‌కి మాట పెగల్లేదు.

"ఏమిటలా ఉండిపోయారు? " అంది ఆ అమ్మాయి.

"మీకు ఎలా చెప్పాలా, అని ఆలోచి స్తున్నా"

"ఓహో! అలా ఆలోచిస్తూ ఉండండి. మేము క్లాస్‌కి వెళ్లాలి, వస్తాము" అంటూ రాజుతో,

"వెళ్లొస్తామండీ, మళ్లీ కలుద్దాం" అని మిగిలినవాళ్ళతో కలిసి వెళ్ళిపోబోతూ-

"మీరు స్కాలర్స్‌కదా" అడిగింది నిశాం త్‌ని.

అతను ఊ కొట్టగానే-

"మీ చిరాకు, వేషం, ముఖం చూడగానే పోల్చేశా, చూశారా!" అంటూ వెళ్ళిపోయింది సమీర.

★ ★ ★

ఎత్తయిన ఆ బిల్డింగ్‌ని, ఆశ్చర్యంగా, అమితమైన గౌరవంతో చూస్తూ ఉండిపో యింది సమీర.

పది నిముషాలనుండీ లోపలకి వెళ్ళా లన్న తాపత్రయం, ఏదో జంకు.

లోపలినుండి చాలా పుస్తకాలు, పడిపో కుండా జాగ్రత్తగా పట్టుకొని, వస్తున్న రాజు కన్పించాడు.

రాజు చాలా పొడవుగా, లావుగా, కొద్దిగా మోటుగా ఉంటాడు. మనిషిని చూసి సాధారణంగా అతని మాట తీరుని కూడా మనకు తెలియకుండానే బ్రెయిన్ కొంత ఊహిస్తుంది. కానీ, ఇతని విషయంలో అంచనా తప్పవుతోంది.

ఎంతో సౌమ్యంగా మాట్లాడుతాడు రాజు.

"హలో!" అనే పలకరింపు పక్కనే విన్పించింది సమీరకి.

"నమస్తే"

"ఏమిటలా నిల్చున్నారు? బుక్స్ తీసుకొన్నారా? క్లాసెస్ అవుతున్నాయా? " అంటూ రాజు ఆదరంగా అడిగేసరికి, అంతసేపూ ఒంటరిగా, బెదురు బెదురుగా ఉన్న ఆమె మనసుకి హాయిగా అన్పించింది.

"లైబ్రరీ బుక్స్ కోసమేవచ్చాను. కానీ లోపలికి వెళ్ళాలంటే ఏదోలా ఉంది"

"ఫ్రెండ్స్ ఎవరూ లేరా? "

"మా వాళ్ళంతా హాస్టలర్స్. ఆలస్యమైతే భోజనం ఉండదని వెళ్ళిపోయారు. మా ఇల్లేమో దూరం. మళ్ళీ రావడం కష్టం" అంది సమీర.

"టికెట్స్ తీసుకొన్నారా? "

"లేదు"

"ఎన్నాళ్ళయింది? మీరుజాయన్ అయి'

"సుమారు నెల"

"ఇన్నాళ్లయి మీరు లోపలకి వెళ్ళలేదూ? ' అన్నాడు ఆశ్చర్యంగా.

"కేంటీన్ పరిచయాలేగానీ ఇలాంటివాళ్ళకు లైబ్రరీలు ఎందుకు? " అంటూ వచ్చాడు నిశాంత్.

"కేంటిన్‌కయితే రండి రండని పిలుస్తారు. ఏం కావాలని అడుగుతారు. ఇక్కడ అలా కాదే! లోపలకి ఎలా వెళ్ళాలో? ఎక్కడ ఏ పుస్తకాలు ఉంటాయో కూడా చెప్పేవారే లేరు. ఎలా తెలుస్తుంది? " అంది సమీర.

"నిరక్షరకుక్షిలా ఉన్నారే! పైన బోర్డులున్నాయి. అదీ తెలియకపోతే ఎవడినైనా అడిగితే తెలుస్తుందిగదా! వచ్చినరోజే పెద్ద గొంతు పెట్టుకొని, అడ్డమైన వాగుడూ వాగగలరుగానీ..."

"ఎవడు సరిగా చెబుతాడో, ఎవడు చెప్పడో ఎలా తెలుస్తుంది. మొన్న బస్ పాస్‌కోసం చలానా కట్టాలని, బ్యాంక్ ఎక్కడని అడిగా. అంతే, వెధవ జులపాల జుట్టువాడూ జలగలాగ పట్టుకొన్నాడు. బోటనీ డిపార్ట్‌మెంట్ నుండి తీసుకెళ్లాడు వెధవవాగుడు వాగుతూ. మా తాతల వివరాలు కూడా వాడికే కావాలి. వాడ్ని వదిలించుకునేందుకు అష్టకష్టాలు పడ్డాను.

"ఆ హడావుడిలో ప్రిన్సిపాల్ ఆఫీస్‌తోవ మరచిపోయి ఎంతసేపు తిరిగానో! అబ్బాయిల నడిగితే, ఏమి తంటా వస్తుందో అని అమ్మాయిలనడిగితే- చూపుడువేలు పూర్తిగా కూడా జాపకుండా అటే అని స్టైల్‌గా వెళ్ళిపోయారు. అలా ఎంతసేపు తిరిగానో! ఈ ఎత్తయిన రాతిగోడలు చూస్తే, ఔన్నత్యానికి చిహ్నంగా, ఎంతో గౌరవం కలగవలసిన దానికి బదులు, ఆరోజు వాటిని చూస్తే భయంవేసింది. ఆఖరికి వర్కర్స్‌ని అడిగివెళ్లాను. వెధవ యూనివర్శిటీ" అని గభాల్న నాలిక కొరుక్కొని.

"ఐయామ్ వెరీసారీ, నేను తిట్టాలని తిట్ట లేదండీ. గభాల్న ఆరోజు నా ఒంటరితనం, భయం, వాళ్ల ప్రవర్తన గుర్తొచ్చి.." అని చాలా సిగ్గుపడింది.

"మేము ఏమీ అనలేదుగా" అన్నాడు రాజు.

"నిజానికి ఇంతమంది మేధావులున్న ఒక సంస్థని అంత తేలికగా, నాకొచ్చిన అతిచిన్న ప్రోబ్లమ్ కోసం నిందించడం న్యాయం కాదు కదా! మీరేమీ అనకపోయినా మీ ఫ్రెండ్ చదువు విలువ, యూనివర్శిటీ విలువ నీకేం

సచిత్ర విచిత్రం



# కాలని నాలుక

అమెరికాలోని శాన్‌ఫ్రాన్సిస్కోలో ఉండే డేవిడ్‌వారెన్ చిత్రమైన మనిషి. నాలుకమీద కాస్త కిరోసిన్ వేసి ఇలా వెలిగిస్తాడు. మరుక్షణం అతని అసిస్టెంట్ సిగరెట్ ముట్టించుకుని ఆ మంట ఆర్పేస్తుంది. ఈ ప్రదర్శన అతనికి నిత్యకృత్యం.



తెలుసు? అని తిట్టేస్తారు"

నిశాంత్ ఆమె మాటలు పట్టించుకోలేదు.

"ఇలా నిల్చుని కబుర్లు చెప్పుకొంటుంటే పుణ్యకాలం దాటిపోతుంది. పదండి" అన్నాడు రాజు.

"అసలు కొత్తగా వచ్చినవాళ్లకు ఒకగంట లైబ్రరీ చూపించి, అన్ని సెక్షన్స్ పరిచయం చేయాలి" అంది సమీర.

"మంచి సలహా, వెళ్దామా? " అని లోప లకి తీసుకువెళ్ళాడు రాజు.

ఓపిగ్గా, ఒక్కొక్క సెక్షనే చూపిస్తూ ఉంటే అద్భుతంగా అన్పించిందామెకి.

పుస్తకాలు చూసి మురిసిపోతున్న ఆమెతో-

"ఒకరకంగా మనం చాలా అదృష్టవం తులం. ఇంత పెద్ద లైబ్రరీ, మంచి కలక్షన్ అందరికీ దొరకవు" అంటూనే "ఇక మేము వెళ్తాం" అన్నాడు రాజు.

టైమ్ చూసి "అరె, మీ భోజనం" అంది సమీర.

"ఫరవాలేదు. ఏభైపైసలు ఇస్తే మాకు ఎప్పుడైనా పెడతారు. మాకు రోజూ అదే అలవాటు" అని నిశాంత్‌తో కలిసి వెళ్ళిపో యాడు రాజు.



నిశాంత్, రాజు మౌనంగా నడుస్తున్నారు.

"ఎండ చాలా ఎక్కువగా ఉంది" అన్నాడు నిశాంత్. ఆమాట చాలా నీరసంగా విన్పించి, అతని ముఖంలోకి చూశాడు రాజు.

ముఖం అంతా పీక్కుపోయి, కళ్ళు లోప లకి వెళ్ళిపోయి, ముఖంమీద పడ్డ జుత్తంతా చెమటకి తడిసిపోయి, బుగ్గలకి, నుదుటికి అంటుకుపోయి, నడవలేక, నడవలేక నడు స్తున్నాడన్పించింది-

"ఏం! వంట్లో బాగులేదా? "

"ఏంటో, చాలా నీరసంగా ఉంది. ఎండ భరించలేకపోతున్నా. మెస్ భోజనం అసలు పడడంలేదు. తప్పనిసరై తినడమే"

"అసలు నాన్‌వెజ్ తింటే ఈ నీరసం తగ్గుతుంది. తినకూడదూ! రామానుజమ్ చనిపోవడానికి కారణం తెలుసా? బీఫ్ తింటే బ్రతుకుతాడని డాక్టర్స్ చెప్పినా మొండిగా తినలేదుట"

"సర్లే, అలా అనుకొనే ఆ మధ్యంతా తిన్నాను. నాకు అది అసలు పడలేదు. కడుపులో మంట, విపరీతంగా. ఈ హాస్ట ల్‌కి వచ్చిన దగ్గరనుండీ 'అమీబియాసిస్' వచ్చింది. కడుపులో నెప్పి, కాళ్ళు పీకుడు, చాలా ఇబ్బందిగా ఉంది" అంటూ పక్కను న్నవాళ్లని చూశాడు నిశాంత్.

వాళ్లు చాలా ఆనందంగా, హాయిగా కబుర్లు చెప్పుకొంటూ తింటున్నారు.

"గురూ! నీకు మొదటిసారి ఫెలోషిప్ డబ్బులు అందాయి. కనుక, సాయంత్రం దసపల్లాకి వెళ్లవలసిందే" అంటున్నారు వాళ్లు

అందులో ఒకర్ని చూసి. అతను, "సరే" అన్నాడు ఆనందంగా.

అది చూసేసరికి, తన చుట్టూ చేరి తన ఫ్రెండ్స్ అలాగే అన్నరోజు గుర్తొచ్చింది.

అప్పుడు ప్రపంచంలో తనంత ఆనం దంగా ఎవరూ ఉండరేమో అన్పించింది.

కానీ సంవత్సరం తిరక్కుండానే ఆ ఆనందం ఆవిరైపోయిందగదా అని నిట్టూ ర్చేసరికి-

"ఏమిటి? ఆలోచిస్తున్నావు? " అన్నాడు

రాజు.
"అబ్బే, ఏమీలేదు. వస్తాను" అని చకచకా రూమ్‌కి వెళ్ళిపోయాడు నిశాంత్.
కానీ, రూమ్ తన మనసుకన్నా గజిబిజిగా ఉందన్పించింది.
ఎక్కడపడితే అక్కడ పుస్తకాలు, బూజు.
ఎవరో తిన్న టిఫిన్ ఆకులు.
మడవని దుప్పట్లు-
చీదరగా అన్పించిందొక్కసారి.
సర్దుదామా! అనుకున్నాడు. మళ్ళీ ఇదో టైమ్ వేస్ట్ అనుకొని మంచంమీద ఉన్నవాటినన్నింటినీ ఒకేసారి గభాల్న ఒక మూలకి తోసేసి తను పడుకొందుకి మాత్రం చోటు చేసుకొన్నాడు.
పడుకొని దుప్పటి మెడదాకా కప్పుకొని ఉదయం చదువుతూ పడేసిన నవల కోసం చూశాడు.
చుట్టుపక్కల ఎక్కడా కన్పించలేదది. లేచి వెతకడానికి ప్రయత్నించాడు.
అలమరనిండా మేథ్స్ పుస్తకాలే, తను ఎంతో ఇష్టంగా కొనుక్కొన్నవి. అవి చూడగానే ఒక్కసారి మనసు పిండేసినట్టయింది. వెంటనే మంచంమీదకి చేరి దుప్పటి తల దాకా ముసుగేసి నిద్రలోకి జారుకొన్నాడు.
మరో నాలుగు గంటలకి మెలకువ వచ్చింది. ఎవరూ రూమ్‌కి రాలేదు. సాధారణంగా పడుకొందుకి తప్ప రూమ్‌లోకి ఎవరూ రారు.
టైమ్ ఎంతయిందో అనుకొనేసరికి తను చదువుదామనుకొన్న 'ఆఫ్‌హ్యూమన్ బ్యాండేజి' నవల కనపడలేదన్న విషయం గుర్తొచ్చింది.
ఎప్పుడు చదువుదామనుకొన్నా ఏదో ఆటంకమే.
"గురూ, మళ్ళీ ఒక్కరోజులో ఇచ్చేస్తా" అంటూ ఎవడో ఒకడు గ్రద్దలా తన్నుకుపోతాడు. ఎన్నాళ్ళకో గానీ తిరిగిరాదు.
ఇప్పుడు ఎక్కడ పడేసానో! అలా అనుకోగానే ఇలా ఆ పుస్తకం వచ్చే ఏర్పాటు ఉంటే ఎంత బాగుణ్ణు. ఒక రోబో ఉంటే బాగుణ్ణు. మనదేశంలో మనిషికో రోబోనా? బాబోయ్? అంత అభివృద్ధి! ఎందుకు జరగకూడదూ? బద్ధకంగా పనులు చేస్తారు. అందుకే జరగదు అన్పించింది.
అసలు బద్ధకం ఎందుకు వస్తుంది? ఆసక్తి లేకపోతే వస్తుంది.
ఆసక్తి ఎందుకు ఉండదు?
ప్రతి మనిషికీ దేనిమీదో ఓ దానిమీద ఇంట్రస్ట్ ఉంటుంది. అదృష్టవంతులకి ఆ ఇంట్రస్ట్ పెంచుకొని మంచి ఫలితాలు పొందే అవకాశం ఉంటుంది. తనలాటి దురదృష్టవంతునికి ఆ ఆసక్తి చంపేసే పరిస్థితులే అన్నీ.
కాదేమో!
పరిస్థితులమీదకి తోసేస్తున్నానేమో! నాకు లెక్కలు మీద ఇంట్రస్ట్ లేదేమో!
అనుకొన్నాడు.
ఇంట్రస్ట్ లేకుంటే, ఇంత కష్టపడి ఇక్కడకి ఎందుకు వచ్చాను? అని అనుకొంటుండగా, తలుపులు దడదడమని శబ్దం అయితే తుళ్ళిపడి లేచాడు నిశాంత్.
తలుపు తీయగానే తోసుకొంటూ లోపలికి వచ్చాడు అర్జున్.
"అబ్బబ్బ! ఏమి నిద్రబాబూ! ఎంతసేపు కొట్టినా విన్పించుకోవే? ఏ పుస్తకంలో మునిగిపోయావు? పుస్తకం కూడా లేదే! ఎక్కడికో వెళ్ళిపోయినట్టున్నావు. సరే, నువ్వు ఎక్కడకి వెళ్తే నాకేంగానీ, నేను మాత్రం అర్జెంటుగా వెళ్ళాలి" అంటూ-
హడావుడిగా స్నానంచేసి, బయల్దేరాడు అర్జున్. వెళ్తూ-
"ఎక్కడకి వెళ్తున్నావు? అని అడగవేం?' అన్నాడు.
"చెప్పు"
"నువ్వు మాత్రం ఉపన్యాసం మొదలెట్టకు. నేను చెప్పేది విను" అనగానే

నిశాంత్ నవ్వి- "ఊ" అన్నాడు.

"మూడురోజుల క్రితం బీచ్‌కి వెళ్లాం గుర్తుందా? "

"ఆ"

"అక్కడ నీలంజరీ చీర కట్టుకొన్నావిడని చూశామా? "

"ఊ"-

ఆమె చూడడానికి చాలా అందంగా, గౌర వభావం కలిగేటట్టుగా ఉంది. కానీ వీళ్లు- 'ఆమె చూపులో తేడా ఉంది నువ్వు వెళ్ళిపో నిశాంత్, మేము ఓ చూపు చూసివస్తాం' అన్నారు.

వెంటనే నిశాంత్ కంగారుగా, "పెద్దింటా విడలా ఉంది. ఎందుకావిడ జోలికి? " అన్నాడు గాని...

"గురూ, మాకు తెలుసుగా" అంటూ ఆమె వెనకే వెళ్ళిపోయారు వీళ్లు.

ఆ విషయం గుర్తుతెచ్చుకొని, "ఏమైంది? అని నిశాంత్ అనేసరికి-

"ఆమె ఈరోజు మా ముగ్గురితో రుషి కొండ వస్తోందిగా" అని కనుబొమ్మలు ఎగ రేశాడు అర్జున్.

"ఆ! నిజమే? " అని,

వీళ్ల అసాధ్యం కూలా! అనుకొన్నాడు, నిశాంత్.

అయితే, అది వాళ్లకి అలవాటే. కానీ ఆశ్చర్యమేమిటంటే ఏ అమ్మాయి ఎలాం టిది? లొంగేరకమా? కాదా? అని ఇట్టే పట్టేస్తారు. ఆ తెలివికి మాత్రం మెచ్చుకోవా లనుకొంటూ-

"రాత్రికి రావన్నమాట" అన్నాడు నిశాంత్!

"అబ్బే ఈ రోజే వచ్చేస్తాం" అన్నాడు అర్జున్.

ఇంకా, ఆ చర్చ పొడిగించడం ఇష్టంలేని నిశాంత్ వెనక్కి తిరిగాడు.

చెప్పులు వేసుకొని బయటకి వెళ్లబోతూ అర్జున్, "పిచ్చి పిచ్చి ఆలోచనలు పెట్టుకోకు నిశాంత్. ఇదిగో, డబ్బులు తీసుకో" అని- ఏభై రూపాయలు అతని జేబులో పెట్టబో యాడు.

"అంత వద్దు. ఇరవై రూపాయలు చాలు" అన్నాడు.

ఫరవాలేదు, అనబోయి అతనివైపు చూసి ఇరవై పెట్టి వెళ్ళిపోయాడు.

జేబులో డబ్బులున్నాయి అన్పించగానే మంచి టీ తాగాలన్పించింది నిశాంత్‌కి. గబ గబా స్నానం చేసి రాజు రూమ్‌కి వెళ్లాడు.

రాజుతో కలసి టీ తాగి, అలా బీచ్‌వైపు నడక ప్రారంభించారు. అదో అలవాటైనప నిలా ఎంత దూరమైనా అలా నడుస్తూనే ఉంటారు నెమ్మదిగా.

గమ్యంలేని నడక. ఎప్పుడో వెనక్కి వెళ్దామా అని ఎవరో ఒకరు అనడంతో వెనుదిరుగుతారు.

వాళ్ళిద్దరూ అలా నడుస్తూ అనేక విష యాలు చర్చించుకొంటారు. అసలు మాట్లా డుకొందుకే నడుస్తారు. ఆ మాటలలో సాహిత్యం గురించే ఎక్కువగా ఉంటుంది.

రాజు ఇంగ్లీష్ స్కాలర్ నిజమైన స్కాలర్.

అతడి ధ్యేయం చదవడమే.

కనిపించిన ప్రతి పుస్తకం చదువుతాడు. చదువుకి పరిధిలేదు అనుకొంటాడు. సోషి యాలజీ, సైకాలజీ, సైన్స్ ఇలా అన్నింటిలో కొంత జ్ఞానమన్నా లేనిదే రీసెర్చి చేయకూ డదనుకొంటాడు.

పుస్తక వ్యామోహం ఉన్న నిశాంత్ అంటే అతనికి చాలా ఇష్టం. అతని దగ్గర మేథ్స్ నేర్చుకొందుకి ప్రయత్నిస్తాడు. ఇంగ్లీష్ సాహిత్యం మేరకు చెప్పనక్కరలేదు. అతని దగ్గరకు అందరూ వచ్చి వాళ్ళ రీసెర్చి టాపిక్ గురించి డిస్కస్‌చేసి అతని సలహా తీసుకుంటారు.

పుస్తకాలు కూడా రాజు దగ్గర ఏవి కావ లసినా, దొరుకుతాయి. లైబ్రరీలో సుల భంగా దొరకనివి కూడా అతని దగ్గర లభి

స్తాయి. కన్పించిన పుస్తకాలన్నీ కొనేస్తాడు. రూమ్‌నిండా పుస్తకాలే.

అతనికి డబ్బుకి లోటులేదు. తండ్రి, తల్లి కూడా ఉద్యోగస్తులు. అన్నలిద్దరూ ఇంజినీర్స్. రాజు ఆఖరివాడు అవడంవలన బాధ్యతలు లేకపోవడమేగాక, వాళ్లు తరచు డబ్బులు పంపుతూ ఉంటారు. దానికితోడు యు.జి.సి. ఫెలోషిప్ వస్తుంది. అందువలన అతను పుస్తకాలు కొంటూనే ఉంటాడు. పుస్తకాలు కొనడం, చదవడం, డిస్కస్ చెయ్యడం మాత్రమే చాలు అన్నట్టు ఉంటాడు.

అందుకే అతనితో కలసి తిరగడం నిశాంత్‌కి చాలా ఇష్టం.

దానికితోడు రాజు సుతిమెత్తగా మాట్లాడతాడు. ఎక్కడా, ఎదుటివారిని నొప్పించడు. అతను మాట్లాడే భాషకి అంతలాలిత్యం ఎలా వస్తుందా అని ఆశ్చర్యపోతుంటాడు నిశాంత్.

నిశాంత్‌కి తను మాట్లాడినది నిజమా, కాదా అని తప్ప కఠినంగా చెప్పేనా? మృదువుగా చెప్పేనా? అనే ఆలోచనే రాదు. ఎంత కటువైన విషయమైనా సున్నితంగా చెప్పగలమనే విషయం అతనికి తెలియదనే చెప్పాలి. అందుకే తలపొగరు ఉన్న మనిషిలాగ కన్పిస్తాడు.

నిశాంత్ ఎలా మాట్లాడినా రాజు పట్టించుకోడు.

ఇద్దరూ నిశ్శబ్దంగా నడిచేరు కొంతసేపు. అంతలో రాజు-

"నిశాంత్, డిపార్ట్‌మెంట్‌కి వెళ్ళావా? మాస్టారిని కలిశావా? " అన్నాడు.

ఆ మాటకి తీవ్రంగా స్పందించి, చాలాకోపంగా-

"అది మీకనవసరం... నేవెళ్లను" అన్నాడు.

వెంటనే నవ్వేసి సర్లే అంటూ అతని చేతిని ఆప్యాయంగా నొక్కాడు రాజు. దాంతో నిశాంత్ మామూలుగా అయిపోయి-

"చిత్రాలయాకి వెళ్దామా? " అన్నాడు.

"నాకేమీ అభ్యంతరంలేదు. కానీ నాలుగున్నరేగా అయింది. బీచ్‌కి వెళ్ళి అక్కడనుండి వెళ్దాం" అన్నాడు రాజు.

సినిమాల గురించి మాట్లాడుకొంటూ నెమ్మదిగా బీచ్‌కి చేరుకొన్నారు.

నిశాంత్‌కి నీరసం అన్పించి "కూర్చుందాం" అన్నాడు.

"పద" అంటూ, పెద్దకెరటంవస్తే తడుస్తారేమో అనేటట్టుగా, నీటికి దగ్గరగా, ఇసుకలో కూర్చున్నారు.

ఇంతలో సమీర వస్తూ కన్పించింది.

దగ్గరగా వచ్చి "నమస్తే" అంది.

"హలో! కూర్చోండి" అన్నాడు రాజు.

తనవైపు అసలు చూడలేదన్పించింది నిశాంత్‌కి.

"సమీర అంటే పిల్లగాలి అని అర్థం కదండీ" అన్నాడు గొప్పగా.

"అబ్బే, కాదండీ పిల్లనే అర్థం"

"అదేంటీ? "

"సమీర, అని ఎవరిని అన్నారు మీరు? నన్నే కదా! నేను పిల్లనే కదా!" అనేసరికి మాటమార్చాలని-

"ఒక్కరేవచ్చారేంటి? " అన్నాడు.

"జంటలేక" అంది ఠక్కున.

ఒక్కక్షణం బిత్తరపోయారు ఆ సమాధానం విని ఇద్దరూ! వాళ్ల బిక్కముఖాలు చూస్తే సరదాగా అన్పించిదామెకి.

వెంటనే నవ్వి-

"మీరు రోజూ బీచ్‌కి వస్తారాండీ" అనగింది.

"సాధారణంగా వస్తాం"

"నాకూ సముద్రమంటే చాలా ఇష్టం మీరు హాస్టల్‌లో ఉంటారు కాబట్టి రోజు రావచ్చు"

"ఇంటిదగ్గర ఉంటే మాత్రం రాకూడదా!

' అన్నాడు రాజు.

"రోజూ వస్తే ఎవరూరుకొంటారు? ఇక్కడ నేనేదో ప్రేమాయణాలు నడిపి పాడై పోతున్నాననుకొంటారు. పోనీ, ఇంట్లోవాళ్ళ గురించి పట్టించుకోకున్నా, ఇక్కడ వెధవా యిలు నేనేదో జంటకోసం వెతుక్కుంటున్నా ననుకుంటారు. ప్రతి గాడిదా సహాయపడ దామనుకొంటాడు"

ఆమె మాటలకి ఇద్దరూ తట్టుకోలేకపో యారు. మరీ ఇన్‌హిబిషన్స్ లేకుండా మాట్లాడుతుంది. కొంచెం సున్నితంగా మాట్లాడితే ఏంపోయిందో అన్పించింది. రాజు నిశ్శబ్దంగా ఊరుకొన్నాడుగానీ నిశాంత్ అన్నాడు

"ఇలా తిరిగినంతసేపు తిరగడం, వాళ్ళ మీదా వీళ్ళమీదా అభాండాలు వేయడం"

"నేనేమీ ఒక్కర్తినీ రాలేదు. మా ఫ్రండ్స్ అంతా వస్తామన్నారు. నేను ఇంటినుండి రావడం కొంచెం ఆలస్యమయింది. వాళ్ళు కనబడలేదు"

ఇంతలో అటుపక్క నుంచి ఒకమ్మాయి వచ్చింది. ఒక పెద్ద కెరటం తాకిడికి పూర్తిగా తడిసింది. అయినా ఆ అమ్మాయి ఏమీ బాధపడలేదు. చాలా ఆనందంగా ఎలాగా పూర్తిగా తడిసా. మరోసారి తడు స్తాననుకొంటున్నట్లుగా ఉంది. వెనకాతల సినిమా పాటలు, ఈలలు, ఉత్సాహం, కేకలు కెరటం హోరులో విన్పించలేదు కాబోలు. ఒడ్డున ఉన్న మరి కొందరు అమ్మాయిలు మాత్రం భయపడుతూ,

"వచ్చేయ్, త్వరగా" అని కేకలు పెట్టారు.

ఆమె సముద్రంలో మునిగిపోతానని భయపడుతున్నారనుకొని ఫరవాలేదన్న ట్లుగా చేయి వూపింది.

కానీ వాళ్లు మాత్రం నెమ్మదిగా అక్కడకి చేరుతున్న అబ్బాయిలని చూసి భయపడు తున్నారు. నిల్చున్న అమ్మాయిలు చీర కుచ్చిళ్లు తడిసిపోకుండా కొంచెంపైకి ఎత్తి, ఆమె తొందరగా వస్తే బాగుణ్ను అనుకొ న్నారు.

వాళ్ళు భయపడుతున్నారన్పించగానే, అబ్బాయిల దృష్టి వీళ్ళమీదకి ప్రసరించి అక్కడనుండి కనీకనబడకుండా కన్పిస్తున్న వాళ్ళ పిక్కలమీద పడింది.

"పిక్కలపైదాకా..." అంటూ కోరస్‌గా మొదలెట్టారు.

అదంతా సమీర, నిశాంత్, రాజు చూస్తూనే ఉన్నారు.

"పిక్కలమీద, ఆపాత పాట తర్వాత మరేదీ ఫేమస్ అయినట్టు లేదే? " అన్నాడు నిశాంత్.

వళ్ళు మండిపోయింది సమీరకి.

"ఆ రౌడీ వెధవలు ఏడిప్స్తుంటే ఆ మాట లమీద బోడి రీసెర్చి కూడానా" అంది కసిగా.

"అదిగో అలా తడవడం, అసహ్యంగా ప్రవర్తించడం, అబ్బాయిలేదో అన్నారని వాళ్లమీద ఏడవడం బాగా అలవాటయిపో యింది" అన్నాడు నిశాంత్.

దానికి సమాధానంగా సమీర నెమ్మదిగా.

"మీరు సముద్రమంటే ఇష్టపడరా? సముద్రంలో ఎప్పుడూ స్నానం చేయ లేదా? "

"చెయ్యకేం. చాలాసార్లు చేసాను"

"ఎందుకు చేసారు? "

"భలేవారే! మొట్టమొదట వైజాగ్ వచ్చిన ప్పుడు సముద్రం చూడగానే కొత్త ప్యాంట్‌తో అంటే ఇస్త్రీ ప్యాంట్‌తో కెరటా లలో తడిసాం"

ఆనాటి సంఘటన గుర్తుచేసుకొంటూ ఉంటే... ఒక అనిర్వచనీయమైన ఆనందం అతని ముఖంలోకి వచ్చింది.

ఆ మాటకి ప్రభంజనంలా మారిన సమీర,

"మరి, ఇందాక కెరటంలో తడిసిన ఆమెని అంత తప్పుపట్టారేమి? "

"ఆమె గురించే అన్నాను. అమ్మాయికి,

అబ్బాయికి మన సొసైటీలో చాలా తేడా ఉంది. నే స్నానం చేసినపుడు నా వెనక చేరి ఎవరూ అల్లరి పెట్టలేదు. కానీ ఆమెని... చూసారుగా"

"అవును మీరే ఒప్పుకొన్నారుగా అల్లరిపెట్టేరని. మరి అల్లరిపెట్టిన వాళ్ళది తప్పా, ఆమెది తప్పా? కనీసం, మాటలో, మనసులో కూడా మీకు ఆమెమీద సానుభూతి రాలేదేం? స్కాలర్స్... చదువుకొన్నవాళ్ళు! దేనికి? మీ చదువులు- తగలెయ్యడానికి, ఛీ, మీలాంటి వాళ్లంటే నాకు మహాఅసహ్యం. అయినా మీరూ మగాళ్లే కదా! ఎంత చదివితే మాత్రం మగబుద్ధి ఎక్కడకిపోతుంది?" అంటూ ఆవేశంగా, గట్టిగా మాట్లాడటంతో అందరూ వింతగా చూడడం మొదలెట్టారు.

అది గమనించిన రాజు, "ప్లీజ్, కంట్రోల్ యువర్ సెల్ఫ్! అంత ఆవేశం మంచిది కాదు" అన్నాడు.

ఆ మాటతో ఆవేశం స్థానే దుఃఖం వచ్చింది. సమీరకు కళ్ళమ్మట నీరు ధారలుగా వచ్చేయి. అతికష్టంమీద ఏడుపు ఆపుకొంటూ-

"చూడండి, రాజుగారూ!

కెరటాలలో మునగాలని

వర్షాలలో తడవాలని

ఎవ్వరికుండదు చెప్పండి

తడిసినవాళ్ళు ఎవడికో తమకం కలిగిస్తుందని

భద్రత పేరుతో నా ఆనందాన్ని చంపుకోమనే / ఇలాంటి వాళ్ళంటే చాలా కోపం, అసహ్యం, బాధ. అసలు ఛా, నే మాట్లాడను" అని చాలా వేగంగా అక్కడనుండి వెళ్లిపోయింది.

★ ★ ★

ఎన్నికల సంరంభం ఆరంభం కావడంతో, రాజుని వాళ్ళ అసోసియేషన్ ఎస్.సి వాళ్ళు లాక్కుపోయారు. అతను ఎంత టైమ్ వేస్ట్ అన్నా విన్పించుకోరు. ప్రచారానికి కావలసిన స్లోగన్స్, ఉపన్యాసాలు, అద్భుతంగా, సునాయాసంగా తయారుచేయగలడని అతన్ని వదలరు వాళ్లు.

నిశాంత్ రూమ్‌కి కూడా వాళ్ల వాళ్ళు వస్తారు. కానీ నిశాంత్‌కి ఎలక్షన్స్ అంటే తలనొప్పి. అయినప్పటికీ వాళ్ళ డిపార్ట్‌మెంట్ స్టూడెంట్స్‌తో అతనికి పరిచయం ఎక్కువని ప్రతిసారీ 'మనవాడికి ఓటు వెయ్యమని చెప్పు' అంటూ అతని చెవి నిల్లు కట్టుకొని పోరుతూనే ఉంటారు.

'మనవాడు' అంటే మన కులంవాడు.

నిశాంత్ బ్రాహ్మణుడు. డిగ్రీలో కులం మీద అంతగా ఎవ్వరికీ దృష్టే ఉండదు. యూనివర్శిటీలో అడుగుపెట్టిన ఇరవై రోజులలో వాళ్ళ కులంతోపాటూ, అందరి కులాలూ తెలిసిపోతాయి.

ఇంక అక్కడనుండీ ఒక కులం వాళ్లంతా ఒక జట్టు. సాధ్యమయినంత వరకు ఇతర కులాలవాళ్లని తిట్టుకొంటూ ఎవరి మటుకు వాళ్లు మీసం మెలేస్తూ,

అన్యాయం చెయ్యబడ్డామని కొందరూ, మేధావి వర్గం అని కొందరూ, అసూయాద్వేషాలతో కొందరూ, వర్గపోరాటం ముసుగులో మరి కొంతమంది గ్రూపులుగా ఏర్పడతారు.

వాళ్ళ వాళ్ళ గురువర్గాల కులాలవాళ్ళతో స్నేహం చేస్తూ... అలా... అలా విస్తరిస్తాయి ఈ గ్రూపులు. ఈ నెట్‌వర్క్ అంతా ఎవరు చేస్తారంటే మాత్రం ఇదమిత్థంగా చెప్పలేము.

ఇంకో విచిత్రమైన విషయమేమిటంటే సెమినార్స్‌కి వెళ్లకపోయినా ఫరవాలేదేమోగానీ, వాళ్ళ వాళ్ల కేస్ట్ అసోసియేషన్ వాళ్ళు వేసిన పిక్‌నిక్‌లకి మాత్రం తప్పనిసరిగా వెళ్ళాలి.

ఇదంతా నిశాంత్‌కి కొత్తలో చాలా వి:

త్రంగా అన్పించేది. ప్రస్తుతం అలవాటైపో యింది. అతను మాత్రం ఎవరితోనూ కల వడు. అతనికి లాంఛనప్రాయంగా ఒకసారి చెప్పి వెళ్లిపోతారు.

ఆరోజు క్లాసెస్ అవడం లేదని, ఏవో రాని లెక్కలు చెప్పించుకొందుకి ఇద్దరు కుర్రాళ్లు నిశాంత్ రూమ్‌కి వచ్చారు.

కేన్వాసింగ్‌కి రమ్మంటే, ఆ ఇద్దరూ ఇక్కడ చేరారని తెలుసుకొని వాళ్ళు వచ్చారు.

వస్తూనే,

"నిశాంత్‌గారూ! ఇది చాలా అన్యాయం. మీరే దేనికీ కలవరనుకొంటే వీళ్లని కూడా అలాగే తయారు చేయండి. ఈ రెండు మూడు రోజులలో చదివేసి ఉద్ధరించేది ఏమీ లేదుగానీ వాళ్ళని పంపించండి. లెండయ్యా! ఏమిటి మీ ఆలస్యం? "

ఈ లెక్కలు చెప్పించుకొన్నాక వస్తే బాగుణ్ణు అన్పించింది వాళ్ళకి. ఇప్పుడు వెళ్తే తర్వాత చెప్తాడో, చెప్పడో! వెళ్లకపోతే వీళ్ళేం అంటారో- అని వాళ్ళనీ, నిశాంత్‌నీ మార్చి మార్చి చూస్తూ ఉండిపోయారు.

"వెళ్ళండి... కానీ ఇలా ఒక క్యాస్ట్ అను కొంటే ఎంతోమంది మీకు దూరమయిపో తారు. మంచి స్నేహితులని పోగొట్టుకొం టారు. అది మాత్రం గుర్తుంచుకోండి" అన్నాడు నిశాంత్.

"ఆ హితోక్తులు ఆపుదురూ... మీ డియ రెస్ట్ ఫ్రెండ్ రాజు అసోసియేషన్ తరపున వెళ్లడంలేదా? "

"అతను కల్చరల్‌గా వాళ్ల ప్రోగ్రెస్‌కోసం వాళ్ళతో కలుస్తాడు. అతని గురించి మీకు అర్థంకాదు..."

"అబ్బ! బాసూ, చాలు మళ్ళీ కలుద్దాం" అని వాళ్ళు వెళ్లిపోయారు.

ఒంటరిగా మిగిలిపోయాడు నిశాంత్. రూమ్ వదిలి దూరంగా ఎక్కడికైనా పారి పోవాలన్పించింది.

ఊళ్లో ఎవరి దగ్గరైనా నాలుగు రోజు లుంటే?

అంతపాటి వాళ్ళు ఎవరూ లేరు. పోనీ ఇంటికి వెళ్లిపోతే... తమ్ముళ్లు, నాన్నగారు, అమ్మ... అందరితో హాయిగా గడపొచ్చు అనుకొన్నాడు.

వెంటనే గబగబా పెట్టె సర్దడం మొదలె ట్టాడు.

ఇంటిగురించి ఆలోచనలు వచ్చిన కొద్దీసే పటికే నీరసం వచ్చింది. ఇంటిస్థితి తలచు కొంటే ఒక్కసారిగా మహాభయంతో ఒళ్ళు జలదరించింది. తను డబ్బు పంపి ఆరు నెలలయ్యింది. గైడ్ ధర్మమా అని స్కాలర్‌షిప్ ఆగిపోయింది. తనకే పైసా చేతిలో ఆడటంలేదు. తమ్ముళ్ల చదువులు, భోజనం ఎలాగడుపుతున్నారో! అవన్నీ తల చుకొనేసరికి మరీ భయంవేసి బాబోయ్! ఇంటికన్నా గుడే పదిలం అనుకొన్నాడు.

ఎమ్.ఎస్.సిలో ఇదే బాధ. అందరూ సెలవులు ఇస్తున్నారని సంతోషిస్తే తను మాత్రం భోజనం ఎలారా దేవుడా? అని భయపడేవాడు. ఎవరో తెలిసిన వాళ్లింట్లో లెక్కలు చెప్పి, నెమ్మదిగా సెలవులు గడిపే వాడు.

ఇప్పటికీ అప్పటికీ తేడా- యూనివర్శిటీ ధర్మమా అని, సెలవుల్లో కూడా భోజనానికి వెతుక్కోనక్కరలేదు. స్కాలర్‌షిప్ వచ్చేక డబ్బు కట్టొచ్చు.

పోన్లే, ఇంటికి వెళ్లి చేసేదేముంది? ఈ ఆలోచనలన్నీ ఎందుకు దండగ, నిద్రపోతే ఏ గొడవా ఉండదు. అనుకొని నిద్రకి ఉప క్రమించాడు నిశాంత్.

అతడికి దేవుడిచ్చిన వరం నిద్ర. ఎప్పు డంటే అప్పుడు హాయిగా నిద్రపోగలడు.

★ ★ ★

ఎలక్షన్ హడావుడి ముగిసింది. ఒక్కసా రైనా డిపార్ట్‌మెంట్‌కి వెళ్ళకపోతే బాగుండ దని అతి బలవంతాన బయల్దేరాడు

నిశాంత్.

ఏ ప్రొఫెసర్ కన్పిస్తాడో! ఎవరు కన్పిస్తారో? అని భయం భయంగా అడుగుపెట్టాడు. ఇంతలో ఎదురుగా రీడర్ శ్రీరాములు కన్పించారు. విష్ చెయ్యక తప్పదు. ఒకసారి చెయ్యి ఎత్తి దింపాడు.

"ఏంటి సంగతులు? ఎక్కడా కన్పించడం లేదు"

"వస్తున్నానండీ. మీకు కన్పించలేదంతే" అని చుట్టూ ఎవరూ లేరుగదా అనుకొన్నాడు.

"నాకు కన్పించడం ఏంటిలే? నాకెందుకు కన్పిస్తావు? మీగైడ్‌కి కన్పిస్తే చాలు" అంటూ నవ్వుతూ వెళ్ళబోయాడు.

అతను అంత గట్టిగా నవ్వడం మహాబాధగా భయంగా అన్పించింది.

భయపడ్డంతా జరిగింది.

ఆఫీస్ రూమ్ నుండి ప్రొఫెసర్ వామన రావు రావడం, ఆ మాటలు వినడం జరిగింది.

"గైడ్‌కి కన్పిస్తే చాలా? అయ్యో రామ! మాకూ బాబు గారి దర్శనాలుండవు. వీళ్లు జాయిన్ అయ్యేది కాలక్షేపానికేగాని, వీళ్లకి రీసెర్చి ఏమిటీ? ఏంటి బాబూ! ఎన్నాళ్లయింది నువ్వు వచ్చి? కనబడడానికి కూడా తీరికలేదా? దానికీ బద్ధకమే. పి. హెచ్. డిలు తేరగా వచ్చేయాలి" అంటూ గావుకేకలు మొదలెట్టాడు.

ఆ పక్క రూమ్‌లో ఉన్న ఎమ్. ఎస్‌సి స్టూడెంట్స్, స్కాలర్స్, ఆఫీస్‌స్టాఫ్ అంతా, అతడు మహాపరాధం చేసినట్లుగా చూసేసరికి అవమానంగా అన్పించింది.

నేరకపోయి వచ్చాను. ఇక్కడనుండీ ఎంత వేగం పోతానా, అసలు ఈయన్ని ఎలా వదిలించుకోవాలా? అని గిజగిజలాడిపోయాడు. ముక్కోటి దేవతలూ గుర్తొచ్చారు. ఈ పరిస్థితి నుండీ ఏదోలాగ బయటపడాలి. ఎలా? విపరీతమైన టెన్షన్.

అంతలో అతని కంఠమే మళ్ళీ ఖంగుమంది.

"దొరగారికి తీరుబాటు అయినపుడు మాకు తీరదుగదా! నాకు క్లాస్ ఉంది" అంటూ చరచరా వెళ్లిపోయాడు.

'హమ్మయ్య! దేవుడా! కాదు, దేవుళ్లారా! మెనీమెనీ థాంక్స్'. అనుకొంటూ మరొక్కక్షణంలో డిపార్ట్‌మెంట్ నుండీ బయటపడ్డాడు. ఎవరైనా ఏమైనా అడుగుతారేమోనని భయంతో బుర్రంతా బరువుగా ఉంది. ముందు అర్జెంటుగా టీ తాగాలి అనుకొని కేంటీన్ దగ్గరకి వెళ్ళేసరికి.

సమీర టీ తాగుతూ కన్పించింది.

ఆమె ఎవరో ఫ్రెండ్‌తో మాట్లాడుతోంది. ఎలాగా మాట్లాడదు. తనకీ మాట్లాడడానికి మూడ్‌లేదు అనుకొని చూడనట్లుగా మరో వైపు చూపు తిప్పుతుండగా ఆమె "హలో" అంది నవ్వుతూ.

"కోపం పోయిందా? సారీ..."

"కోపమా! నాకా?"

"ఆ రోజు బీచ్ నుండీ కోపంగా వెళ్ళిపోయారుగా!"

"అదా! కోపం కాదు, బాధ. సరేగానీ ఆ విషయం వదిలేయండి"

"కోపం లేనప్పుడు మొన్న మీ ఫేవరేట్ టెన్ బస్ దిగుతూ కన్పించారు. అప్పుడు చూడనట్టు వెళ్లిపోయారు"

"ఓహో! అదా! అపుడు మీరు దూరంగా ఉన్నారు. నవ్వినా మాట్లాడలేరు. నవ్వు ఎందుకు వేస్ట్ చేసుకోవడం? అదీగాక నవ్వే మూడ్ లేదు. అందుకే నవ్వలేదు" అని సిన్సియర్‌గా చెప్పే ఆమె మాటలకి నవ్వు వచ్చింది.

"మీరూ నవ్వుతారా?" అంటూ సమీర ఆశ్చర్యపోతే అతడు తెల్లబోయాడు.

"అబ్బే! మీరు యాంగ్రీయంగ్‌మేన్ కదా! అందుకనీ..." అంటూ గొణిగింది సమీర.

"ఏంటీ?" అన్నాడు గట్టిగా.

"యాంగ్రీయంగ్ మేన్. ఊహూ

మిమ్మల్ని అనలేదు. ఉద్యమం గురించి..."

"అబ్బబ్బ! ఉద్యమాలు, వాయింపులు-వద్దు. దయచేసి బుర్ర తినేయకండి"

ఆ మాటకి పక్కన ఉన్న జలజ,

"మీకూ ఈమె సంగతి తెలిసిందే" అంటూ మరికొంచెం ఉడికించింది.

టాపిక్ మారింది గదా అని ఆనందించింది సమీర.

"ఇంతకీ, ఈయన..." పరిచయం చేయలేదని గుర్తుచేసింది.

"చూస్తే తెలియడంలేదూ, మీ జాతే, స్కాలర్. మేథ్స్ డిపార్ట్‌మెంట్. పేరు నిశాంత్. ముఖం నిండా 'నిశి' నింపుకొని ఉంటారు" చివరిమాట మెల్లిగా అంది.

"నీకేం తెలుసు స్కాలర్ కష్టాలు. పి.జి. చేస్తున్నప్పుడు అంతా కుషీగానే ఉంటారందరూ" అంది సమీర.

"ఈమెకి పరిచయం చేయడంరాదు" అంది జలజ.

"మీరు మాట్లాడుకొంటున్నారుగానీ, మళ్లీ నేను పరిచయం చేయడం ఏంటట. వెధవ ఫార్మాలిటీస్" అంటూ గయ్‌మంది సమీర.

"తల్లీ, శాంతించు" అని "నేను ఎకనామిక్స్ స్కాలర్‌ని. పేరు జలజ" అని పరిచయం చేసుకొంది.

"ఎన్నాళ్ళయిందండీ?"

"అవడం రెండేళ్ళయింది"

"వర్క్ బాగా అవుతోందా?"

"ఆ, బానే అవుతోంది"

"మీ గైడ్ ఎవరు?"

"ప్రొ. సూర్యంగారు"

"చాలా మంచాయనగదండీ?"

"అవునండీ"

"అదృష్టవంతులు. ఏ సమస్యలూ లేవు హాయిగా"

"అంటే, మీకు సమస్యలున్నాయన్నమాట. ఏంటోనండీ చాలామంది స్కాలర్స్ ఇలాగే బాధపడుతున్నారు. పి.హెచ్.డి. అయ్యేదాకా వోపికపట్టాలి"

"మంచి గైడ్ దొరికినవారు ఇలాగే కబుర్లు చెప్తారు"

"అబ్బే! అలా కాదు. మంచి గైడ్ దొరకడం అదృష్టమే. మంచి గైడ్ దొరకడం, మంచి మొగుడు దొరకడం మన సొసైటీలో లాటరీయే. భార్యాభర్తలయ్యాక సర్దుకుపోక తప్పనట్లే గైడ్ స్కాలర్ కూడా సర్దుకుపోవాలి"

"భార్యమీద పెత్తనం చేసేభర్తలే ఎక్కువ కదండీ"

"నిజమే, భార్యలకి ఏం చెప్తారు? సర్దుకొని జాగ్రత్తగా మసులుకోమంటారు కదా!"

"మీలాంటి అమ్మమ్మలు చెప్తారు" అంది వాళ్లిద్దరి సంభాషణ వింటున్న సమీర.

"పెత్తనమేకాదు, తాగుబోతులు, శాడిస్టులు కూడా ఉంటారు. అప్పుడు కూడా సర్దుకుపోగలరా?" అన్నాడు నిశాంత్.

"కలవని మనస్తత్వంతో కలసి బతికేకన్నా హాయిగా విడిపోవడం మంచిది" అంది సమీర.

"సర్లే విడిపోవడం అంత తేలిక విషయం కాదు. మన హిందూ వ్యవస్థలో ఒకవేళ విడిపోవాలనుకొంటే కుటుంబ జీవితంమీద ఆశ వదులుకొని సిద్ధపడాలి. భర్తని వదిలేసిన స్త్రీని పెళ్లి చేసుకొందుకి మంచివాడు దొరకనట్టే ఒక గైడ్‌ని వదిలేస్తే ఆ స్కాలర్‌ని తీసుకొనే మరో గొప్పవాడుండడు"

"మొత్తానికి మీరు చెప్పేది గైడ్ దగ్గర భార్యలా ఉంటేనే గైడ్ ఆనందిస్తాడంటారు"

"అక్షరాలా" అంటూ జలజ సడన్‌గా సెలవు తీసుకొని వెళ్లిపోయింది.

"అదేంటి? అలా వెళ్లిపోయారు. నేనేమన్నా తప్పుగా మాట్లాడేనా?" అన్నాడు నిశాంత్.

"అబ్బే! అదేంలేదు. ఏదో గుర్తు వచ్చి ఉంటుంది. అర్జెంటు పని" అంది సమీర.

"మరీ అంత సడన్‌గా వెళ్లిపోతే"





“ఏదో వెళ్లిపోయింది. మీరు మరీ అంత సెన్సిటివ్ అయితే ఎలా? నాకూ క్లాస్ ఉంది, వస్తాను” అంటూ సమీరా వెళ్లిపోయింది.

నిశాంత్ హాస్టల్‌కి వెళ్లి భోజనం అయిందన్పించి యథాప్రకారం నిద్రకుపక్రమించాడు.

★ ★ ★

జలజ మాటలు విన్న దగ్గరనుండీ మళ్లీ దిగులు ఆరంభమయింది నిశాంత్‌కి.

గైడ్‌ని మార్చుకొందామనే ఆలోచనే భయంకరం అన్పించింది. దాంతో ఏదోలా మాస్టారి దగ్గరకి వెళ్లి వర్క్ చేసుకోవాలనే నిర్ణయించుకొన్నాడు. ఆ నిర్ణయం మారిపోతుందేమోననే భయంతో డిపార్ట్‌మెంట్‌కి వెంటనే వెళ్లాలనుకొన్నాడు.

ముఖం కడుక్కొందామని సబ్బునురగ ముఖానికి పట్టించేసరికి గడ్డం గరుకుగా తగిలింది. ఒక్కక్షణం చిరాకేసింది. ఇలా వెళ్తే ఏమి బాగుంటుందని గడ్డం గీసుకొన్నాడు.

అసలే ఈ సంవత్సరం అవమానం-14, రాజపూజ్యం-5 ఎలాగూ చీవాట్లు తప్పవు అనుకొంటూనే వెళ్లాడు. అదృష్టవశాత్తూ బయట ఎవరూ లేరు. క్లాస్ అవుతోంది.

నెమ్మదిగా మొరాయిస్తున్న పాదాలని బలవంతాన ఈడుస్తూ రూమ్ దగ్గరకి వెళ్లాడు.

ప్రొ. వామనరావు అనే బోర్డు చూసేస రికి గుండె దడగా అన్పించి, అసలు తను ఎందుకు వచ్చాడో కూడా మరచిపోయాడు. ఈ బోర్డ్ చూస్తేనే బుర్ర పని చేయదేం టబ్బా! అనుకొంటుండగా,

లోపలనుండి "ఎవరదీ?" అని వామన రావు కంఠం ఖంగ్‌మంది.

"నేనే... నేనేనండీ"

"ఓహో! తమరా? ఏంటీ దొరగారు ట్రిమ్‌గా తయారయి వచ్చేశారు?"

'నా మొహానికి ట్రిమ్ ఒకటి. ఉన్నది ఒకటే జత బట్టలు' అనుకొన్నాడు మన సులో. అలా ఆయన మాట్లాడినప్పుడు ఎలా మొహం పెట్టాలో తెలియదు. ఏవి మాట్లాడాలో తెలియదు. జూనియర్ స్కాలర్, సీనియర్ స్కాలర్స్ ఇద్దరూ అక్కడే ఉన్నారు. వాళ్లముందు ఇంకా ఏం తిట్లు తినాలో అనుకొంటూ అంతలోనే, 'మహా! అవి మాత్రం తిట్లు తినని మొహాలా? నాకన్నా ఘోరంగా తిని ఉంటారు' అని సరిపెట్టుకొంటుండగా,

"నాకు నెలాఖరికి బెంగుళూరులో కాన్ఫ రెన్స్ ఉంది. టికెట్ రిజర్వ్ చేయించు" అన్నాడు వామనరావు.

ఎమ్.ఎస్‌సి. నుండీ అలాంటి పనులు చేయడం అలవాటే. అప్పుడు అభిమానంతో చేస్తే ఇప్పుడు తప్పక చేస్తున్నాడు.

"వారమే ఉందిసార్, దొరుకుతుందా?" అన్నాడు గభాల్న నిశాంత్.

"నువ్వు దొరక కూడదూ అని ప్రార్థిస్తే దొరకదు. ఇంకా ఇలా మీనమేషాలు లెక్క బెడ్తే పుణ్యకాలం దాటిపోతుంది. తొందరగా కదిల్తే దొరుకుతుంది"

'అలా ఉపన్యాసం ఇస్తాడేగానీ రిజర్వేష న్‌కి డబ్బులు ఇవ్వడేం?' అనుకొంటుం డగా ప్రక్కనే ఉన్న విజయ్-

"అయిదు నిముషాలలో టికెట్ తెస్తా సర్. మీకెందుకు?" అనిపోకెట్‌లో మోటార్ బైక్ తాళాలు తీసి తిప్పుతూ చాలా స్టైలిష్‌గా అన్నాడు.

"అవును వెళ్తావు. అమ్మా బాబూ మస్తుగా సంపాదించి బైక్ కొనిపెట్టారు. నీ తిరుగుళ్లకి డబ్బులు ఇవ్వకపోయినా టికట్ తేగలవు. తెచ్చి కాకా పట్టగలవు" అని కచ్చగా మనసులో అనుకొంటూనే, హమ్మయ్య! ఎలాగయినా తప్పింది, అదే పదివేలు అనుకొన్నాడు నిశాంత్.

వామనరావుకి వామనుడికన్నా బుర్ర ఎక్కువ. "నువ్వు వెళ్తే ఎలా? నేను బండి తేలేదుగా. నన్ను దిగబెట్టాలి. మధ్యలో చిన్నచిన్న పనులు కూడా ఉన్నాయి. నిశాంత్ వెళ్తాడులే. వెళ్లవోయ్" అన్నాడు.

కానీ డబ్బులివ్వందే నిశాంత్ ఎలా వెళ్తాడు? అలా కదలకుండా నిల్చున్నాడు. 'కక్కుర్తివాడిలా నిలబడ్డాను. నిజంగా ముష్టి బ్రతుకు నాది. డబ్బులుంటే ఇలా నిలబడ నక్కరలేదుగా! చాలా అవమానకరంగా అని పించింది. అవునూ, అతని టికెట్ కోసమే గదా! డబ్బులు నేనేదో నాకోసం అడుక్కొ న్నట్టు ఎందుకు అనుకోవాలి?' అని మళ్ళీ ధైర్యం తెచ్చుకొని-

"డబ్బులు సార్"

"డబ్బులా! ఇందాకే అడగొచ్చుగా... ఇచ్చే ద్దును" అంటూ డబ్బులు లెక్కబెడ్తూ-

"చాలామందిలా నేను స్కాలర్స్ చేత డబ్బులు ఖర్చుపెట్టించాలని అనుకోను. అలా మంచిగా ఉన్నా కాబట్టే మీరు ఇలా తిక్కతిక్కగా ఉన్నారు" అంటూ అతికష్టం మీద సరిగ్గా టికట్ డబ్బులు ఇచ్చాడు.

తీసుకొంటున్న నిశాంత్ ముఖం

చూస్తూ-"అవునూ, ఇతని ముఖం చూస్తే ఆ రైల్వేవాడు అసలు టికెట్ ఇవ్వడేమో అన్పిస్తోంది" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

దాంతో చుట్టుపక్కల వాళ్లు మాస్టారు నవ్వితే మనం కూడా నవ్వాల్సిందే అన్నట్టుగా పకపకా నవ్వారు.

డబ్బులు అడిగాననే బాధ ఏదోరకంగా అవమానపరిచి తీర్చుకొంటాడు. అతని స్వభావం అంతేలే, అనుకొని బయట పడ్డాడు ప్రశాంత్.

బయట చాలా ఎండగా ఉంది. ముందు భోజనం చేసి తర్వాత స్టేషన్‌కి వెళ్లాలి. లేకపోతే ఆ క్యూలో ఎంతసేపు నిలబడాలో! అనుకొని, నిశాంత్ హాస్టల్‌కి వెళ్లాడు.

'స్టేషన్‌కి ఎలా వెళ్లాలబ్బా! స్టేషన్‌కి వెళ్లడానికి కూడా డబ్బుల్లేవు. ఒక పది రూపాయలు ఎక్కువ ఇస్తే వాళ్ల సొమ్మేం పోతుంది? అన్నేసివేలు జీతాలు వస్తాయి. కక్కుర్తి...' అని తిట్టుకోవాలన్పించినా బలవంతాన ఆపుకొన్నాడు. గైడ్‌ని కలలో తిట్టినా పిహెచ్.డి పట్టా తీసుకోవడం కలలోమాట అయిపోతుందంటారు.

తెలిసిన వ్యక్తి దగ్గర పాతిక రూపాయలు అప్పు చేయక తప్పలేదు.

డబ్బులు ఇస్తూ "నీ వర్క్ ఎలా ఉంది?' ' అని ఒక ప్రశ్న కూడా వదిలాడు.

దాంతో ఒక్కసారి చాలా బాధ, భయం వచ్చేశాయి. 'ఈరోజు నుండీ బాగా వర్క్ చెయ్యాలనుకొన్నాడు. ఇంతలో ఈయన బెంగుళూరు వెళ్లాల్సి వచ్చింది. ఈవారం ఆయన దగ్గరికి వెళ్లినా, ఇలాంటి పనులే తప్ప చదువేం ఉండదు. మళ్లీ ఎప్పుడు వస్తారో? ఎప్పుడు నా వర్క్ ఆరంభం అవుతుందో' అన్పించినా తాత్కాలికంగా చదువు, మాస్టారిని కలవడం అక్కరలేదనుకొంటే చాలా రిలీఫ్‌గా అన్పించింది.

బీచ్ అంతా కళకళలాడిపోతోంది. ఒంటరిగా కొందరు, జంటలుగా కొందరు, గుంపులుగా కొందరు-

ఎక్కడ చూసినా జనాలే. కొంతమంది విపరీతమైన ముస్తాబుతో, కొందరు సాధారణంగా, మరికొందరు అతి ఆనందంగా, కొంతమంది కాస్త విచారంతో సముద్రపు టొడ్డు చేరుకొంటున్నారు.

చక్కగా అలంకరించుకొని తీరుగా చీరలు కట్టుకొని, ఇంత కష్టపడి కట్టుకొన్న చీర ఎవరైనా చూస్తున్నారా? లేదా? అని నెమ్మదిగా చుట్టుప్రక్కల వారిని పరిశీలిస్తున్న అమ్మాయిలు...

వారు తీరుగా చీర కట్టింది తమకోసమే అనుకొని వారిని చూస్తూ ఆనందపడిపోతున్న అబ్బాయిలు....

అంత పెద్ద సముద్రాన్ని చూసి ఈ సముద్రం ఎలా పుట్టిందబ్బా అని ఆశ్చర్యపోతూ, ఒకసారి అందులోకి వెళ్లిపోతే అన్పించి, వెళ్లడానికి భయపడి, సముద్రాన్ని చూడడం వలన కలిగిన అనుభూతిని ఎలా అనుభవించాలో తెలియక తికమకపడిపోతూ నీటిని తపతపలాడిస్తున్న చిన్న పిల్లలు...

బీచ్‌కి నిశాంత్, రాజు, జగన్, పట్టాభి కలసి వచ్చారు.

నిశాంత్, రాజు నిశ్శబ్దంగా నడుస్తున్నారు. జగన్, పట్టాభి వాళ్ల అలవాటు ప్రకారం ఫిగర్స్ చూస్తున్నారు.

"ఆ బ్లూ ఫిగర్ చూడు! అబ్బ! అంతకన్నా బాగుంది... ఆ రెడ్‌శారీ..." అని అనుకొంటూ, క్షణం కళ్లు మూసినా వేస్ట్ అయిపోతుందేమోనని చాలా ఆశగా అమ్మాయిలని చూస్తున్నారు.

★ ★ ★

ఇంతలో ప్రక్కగా మొక్కజొన్న పొత్తులు అమ్మే అమ్మాయి కన్పించింది జగన్‌కి. ఈ ఫిగరూ బాగానే ఉందనుకొంటూ-

"పొత్తులు కొనుక్కొందామా?" అన్నాడు.

"నువ్వు కొంటే తినడానికి అభ్యంతరం లేదు"

"కొంటానులే" అని బేరం ఆడి కాల్పించాడు.

పక్కనే నిల్చుని చూస్తున్నారు మిగతా వాళ్లు.

"ఆ నిమ్మకారం నాకు వద్దు. రాయించకు" అన్నాడు నిశాంత్.

"అది రాస్తేనే రుచి, నేను ఇస్తున్నప్పుడు నేను ఇచ్చినట్టే తినాలి"

"అతను ఇష్టపడనప్పుడు మీరు అలా అనకూడదు" అన్నాడు రాజు.

"మీకెందుకు మధ్య" అని చాలా రఫ్‌గా అనడంతో రాజు నిశ్శబ్దంగా ఊరుకొన్నాడు.

మొత్తానికి కారం రాయించాడు. నాకు వద్దు అనేద్దామన్పించింది నిశాంత్‌కి. కానీ మళ్ళీ ఏమనుకొంటాడో? మొహమాటం. అయినా జగన్ మంచాడేకదా! అనుకొని తీసుకొని-

"నేను నిల్చోలేను. కాళ్లు పీకుతున్నాయి. అలా వెళ్లి కూర్చుంటాను. మీరూ రండి" అని చెప్పి, కొంచెం దూరం వెళ్లి ఎవరూ లేని ఓ మూలన రాజుతో కూర్చున్నాడు.

ఇక్కడ జగన్ ఎలాగా కూర్చోనివ్వడు. అతను అమ్మాయిలని చూడడానికే వస్తాడు. ఇలా మూల కూర్చుంటే ఎవరూ కనబడరు. అయినా అతను వచ్చాక చూద్దాంలే అనుకొంటూ కూర్చున్నారు.

అటుపక్క... ఎవరో కూర్చున్నారు. కొత్తగా పి.జి.లో చేరినవారు. మాస్టర్ల గురించి హుషారుగా చెప్పుకొంటున్నారు. తను ఎమ్.ఎస్‌సి. చదివే రోజులు గుర్తొచ్చాయి నిశాంత్‌కి.

★ ★ ★

ఎమ్.ఎస్‌సిలో క్లాసెస్ బాగా అయ్యేవి. మాస్టర్లు కూడా బాగా చదువుతాడని, తెలివైనవాడని, అభిమానంగా చూసేవారు. లైబ్రరీకి వెళ్లడం, హుషారుగా క్లాస్‌కి వెళ్లడం, హాస్టల్‌లో ఫ్రెండ్స్‌తో కలిసి భోజనం చేయడం, చాలా హాపీగా ఉండేది. ఎంతో కష్టమనుకొన్న ఎమ్.ఎస్‌సి. చదివేస్తున్నానని చాలా సంతోషించాడు. అలా మూడు నెలలు గడిచాయి.

"మీరు మెస్ బిల్ కట్టాలి" అని ఓరోజు వార్డెన్ పిలిచి చెప్పాడు.

"ఇ.బి.సి. రాలేదండీ" అన్నాడు తను.

అతను రెండు మూడుసార్లు చెప్పాడు. మళ్లీ అదే సమాధానం. ఇది నాలుగోసారి-

"ఇదిగో, మీ స్కాలర్‌షిప్‌ల సంగతి నాకనవసరం. నువ్వు కడితేనే భోజనం. రేపటి నుండీ మళ్లీ మళ్లీ చెప్పించుకోక అసహ్యంగా" అన్నాడు వార్డెన్.

వార్డెన్ బాధ వార్డెన్‌ది. ప్రతి సంవత్సరం తను మిగిల్చినదాంట్లో ఇంత పెరసెంటేజ్ అని పైవారికి సమర్పించాలి. ఈ సంవత్సరం నాలుగు ఎకరాల భూమి కొనడంవలన పంపలేకపోయాడు. ఏదోలాగా స్టూడెంట్స్ అందరి బాకీ వసూలుచేసి వెంటనే ఇచ్చేయాలనుకొన్నాడు. ఆ బాధతో కోపం నిశాంత్‌మీద చూపించాడు.

కళ్లనీళ్ల పర్యంతం అయింది నిశాంత్‌కి.

రాత్రంతా భయం భయంగా గడిపేడు. తెల్లారింది టిఫిన్‌కి వెళ్తే ఏమంటాడో?

నిజానికి ఆ టైమ్‌కి వార్డెన్ అక్కడ ఉండడు. వెళ్లి దర్జాగా తినొచ్చు

దశాబ్దాల కిందట చదివినవాళ్లు కూడా యూనివర్శిటీలోనే ఉద్యోగాలు సంపాదించాలని, బయట ఉద్యోగాలు రాక- రాజకీయాలు నడుపుతూ, ఏ ప్రొఫెసర్‌కో కొమ్ము కాస్తూ-

అక్కడే భోజనాలు చేసి ఆ రూమ్‌లలోనే ఉంటారు నిర్భయంగా.

కానీ, పల్లెటూరినుండి వచ్చిన నిశాంత్‌కి అంత గడుసుతనం లేదు. పైగా మొహమాటం, సిగ్గు, భయం, తప్పు చేస్తున్నానని బాధ.

అందుకనే తండ్రికి తెలిసిన రావుగారిని కలిస్తే ఏవో ఒకటి చేస్తారని సోషియాలజీ

డిపార్ట్‌మెంట్‌కి వెళ్లాడు.

ఎస్. వి. రావు బోర్డ్‌చూసి రూమ్‌లోకి వెళ్లబోయి రూమ్ ఖాళీగా ఉండడంతో-

ఎదురుగా వస్తున్న వ్యక్తిని "రావుగారు ఉన్నారాండి? " అని అడిగాడు.

"రూమ్‌లో లేరా? ఇప్పటిదాకా ఉండే వారే. ఒకవేళ వెళ్ళిపోయారేమో. అయినా తలుపు తీసే వుందిగా ఉంటారు. పక్కరూమ్‌లో చూడండి" అంటూ అతను వెళ్లిపోయాడు.

రావుగారు వెళ్లిపోయారేమో అనే సంశయంతో భయంగా అన్పించింది. భగవంతుడా! ఈయన ఉండాలి అనుకొంటూ 'కనకమహాలక్ష్మి తల్లీ! ఈ వూర్లో పవర్‌ఫుల్ గాడెస్‌వి నువ్వేకదా! ఈ ప్రాబ్లమ్ సాల్వ్ అయితే నీ దగ్గరకి వస్తా'ననుకొంటూ భయం, భయంగా నడవడంలో పక్కనే ఉన్న రూమ్‌కి వెళ్లడానికి పావుగంట పట్టింది.

రావుగారు కనబడటంతో దేవుడు నిజంగా ఉన్నాడేమో అన్పించింది. ఆయన సాదరంగా పలకరించారు.

"బాగున్నావా? నాన్నగారు రాసిన ఉత్తరం అందింది. ఎన్ని ఇబ్బందులున్నా పట్టుదలగా చదువుతున్నావు. చాలా సంతోషం. అంతా బాగానే ఉందిగా? "

'నా బొంద బాగుంది' అనుకొన్నాడు మనసులో. వెంటనే చెప్పడానికి బిడియం.

"ఏమైనా సమస్యలుంటే చెప్పు. ఏ హెల్ప్ అయినా చేస్తాను. ఇబ్బంది పడకు..." అనడంతో కొంత ధైర్యమొచ్చింది.

"అది కాదండీ..." అని ఆగాడు. పక్కన ఎవరో ఉన్నారు.

"ఫరవాలేదు చెప్పు. మన మాస్టారే" అంటూ-

"మా ఊరబ్బాయి. చాలా తెలివైనవాడు. మహా మొహమాటస్తుడు" అని పక్కనున్న తనితో చెప్పి-

"చెప్పమ్మా! ఏమిటి సమస్య? "

"మెస్ బిల్ కట్టకపోతే రావద్దన్నారు. ఇ.బి.సి. సేంక్షన్ అవలేదు" అన్నాడు గబగబా.

"ఏం ఫరవాలేదు. దానికేముంది? నేచెప్తాలే వార్డెన్‌కి. ఏ హాస్టలు? " అని ముఖం చూసి-

"ఈరోజు మెస్‌కి వెళ్లావా? " అన్నారు.

ఆకలితో ఉన్న నిశాంత్ 'వెళ్లేను' అని అబద్ధం చెప్పలేకపోయాడు. వెళ్లలేదు. అనడానికి మొహమాటం. నిశ్శబ్దంగా ఊరుకొన్నాడు. అర్థం చేసుకొన్న రావు-

"పద, ఇప్పుడే నీతో వచ్చి చెప్తాను" అని వెంటనే బయల్దేరి, మధ్యలో స్కూటర్ ఆపి మస్తుగా టిఫిన్ పెట్టించి మరీ హాస్టల్ వార్డెన్‌కి చెప్పి వెళ్లారు.

నిజంగా అప్పుడు ఎంత రిలీఫ్‌గా అన్పించిందో.



ఇలా గతం గుర్తుచేసుకొంటున్న నిశాంత్ వీపు తడుతూ, "బాగు నాయనా! బాగు, లేవయ్యా తండ్రీ! పట్టపగలే డ్రీమ్‌లాండ్‌కా!" అన్నాడు అప్పుడే అక్కడికి వచ్చిన పట్టాభి.

అది విన్న జగన్,

"ఓహో! డ్రీమ్‌లేండ్ కూడానా! అదేం కాదు. బహుశా ఫ్లాష్ బేక్‌కి వెళ్లుంటాడు" అని. "ఏమి? చిట్టితండ్రీ! ఉన్న కష్టాలు

చాలకనా? ఫ్లేష్‌బాక్‌కి వెళ్లి తవ్వుకోవడాలు దేనికి? "

"కష్టాలే అని గ్యారంటీ ఏమిటీ? " అన్నాడు రాజు.

"ముఖం చూస్తే తెలియడంలేదూ? " అన్నాడు జగన్.

"ఫ్లేష్‌బ్యాక్ అంటే గుర్తొచ్చింది గురూ! నీ ఫ్లేష్‌బ్యాక్ ఏమయ్యింది? అదే స్టీల్ ప్లాంట్ పిల్లని ప్రేమించానని, పెళ్లాడేస్తానని వెళ్లావుగదా, ఏమయిందీ? " అన్నాడు పట్టాభి.

"ప్చ్! ఏవీ క్లిక్ అవలేదు" అన్నాడు విచారంగా జగన్.

"అసలు, ఫ్లాష్‌బ్యాక్ ఏంటో చెప్పండి" అన్నాడు రాజు.

★ ★ ★

ఒకరోజు అందమైన అమ్మాయి లూనా మీద వెళ్తోంది. జగన్ దృష్టి ఆమెమీద పడింది. ఆమెని ప్రేమించేశానని అన్నాడు.

ఫిక్స్‌డ్ మేరేజి చేసుకోకూడదని ప్రేమించే చేసుకోవాలని అతని దృఢనిర్ణయం. అందుకని తన లూనా బర్‌మన్పిస్తూ ఆమె వెనకాలే బయల్దేరాడు.

పెరిగిన గెడ్డం, మాసి నలిగిన తెల్లచొక్కాతో వెంటబడ్డాడు. ఆమె వెనకాతల వస్తున్నాడనగానే స్పీడ్ పెంచింది. అయినా వదలక అతనూ స్పీడ్‌గా వెంటపడ్డాడు. ఆఖరికి ఆమె లూనా ఆపి దిగగానే వెనకాతలే అతనూ ఆపి దిగాడు.

"నేను మిమ్మల్ని పెళ్లి చేసుకొంటా" అన్నాడు గొప్పగా.

"కట్నకానుకలు ఏమీ అక్కర్లేదు" అన్నాడు మరీ దీర్ఘంగా.

ఆమె తెల్లబోయింది.

"అసలు మిమ్మల్ని పెళ్లిచేసుకొమ్మని ఎవరు అడిగారు? " అన్నది గట్టిగా.

"అబ్బే! మీరు నాకు చాలా నచ్చారండీ" అన్నాడు నెమ్మదిగా.

ఆమె చాలా ఆశ్చర్యంగా-

"మీరేం చేస్తారండీ? "

"స్కాలర్‌ని ఎ.యు.లో"

"బాబోయ్! స్కాలర్ వాసన కూడా నాకు పడదండీ" అంటూ లూనా ఎక్కేసింది.

"విన్నావు కదా రాజూ! ఎందుకు క్లిక్ అవలేదంటావు? ఎనలైజ్ చెయ్యి" అన్నాడు పట్టాభి.

నిశాంత్ అందుకొన్నాడు.

"ముందు ఇతగాడి వేషం చూసి లూనా బాగుచేసుకొనేవాడనుకొని ఉంటుంది. నాలుగు తిడదాం, అనుకొన్నదే- స్కాలర్ అనగానే పోన్లే, పాపం, అని జాలిపడి వదిలేసింది" అన్నాడు.

"క్లిక్ అవకపోవడానికి కారణం నేను చెప్తాను" అని పట్టాభి.

"స్టీల్ ప్లాంట్‌లో ఉద్యోగం సంపాదించిందంటే లోకల్ అమ్మాయి అయి ఉంటుంది. మనవాడు మెస్‌లో భోజనం చేశాడు ఈ మూడేళ్ళూ అన్పించి ఉంటుంది. అంతే! ఇంతే సంగతులు. ఈ గురుడ్ని కట్టుకొంటే ప్రేమించబడడం తప్ప ఏమి సుఖపడతాను? అనుకొందిరా..." అన్నాడు రాగయుక్తంగా.

"నిజమే! ఆ వెధవ తిండితో రెండేళ్ళలో ఉన్న శక్తులన్నీ వాళ్ళు పోగొట్టేస్తే, తర్వాత కొంతమంది గైడ్‌లు..." అని సమర్థించబోయిన నిశాంత్‌ని ఆపి,

"అదిగో, మొదలెట్టావ్, మళ్లీ. ప్రశాంత వాతావరణంలోకి గైడ్‌లని తీసుకువచ్చి కాలుష్యాన్ని పెంచకురా! చక్కగా జొన్నపొత్తుని తింటూ, సముద్రాన్ని చూస్తూ, ఏ రస్సెల్ గురించో మాట్లాడుకొంటూ రాజూ, నువ్వూ కూర్చోండి. పెద్ద సాహితీ వేత్తల్లా, భావుకుల్లా, రస్సెల్ కబుర్లు వింటూ, సముద్రాన్ని చూస్తూ టైమ్ వేస్టుచేసుకోలేము. మేం పోతాం" అని పట్టాభిని తీసుకొని జగన్ వెళ్లిపోయాడు.

# ఏరిన ముత్యాలు

★ స్వర్గం నరకం ఎక్కడోలేవు నీ మనసులోనే వున్నాయి.

-రాజ్‌పాల్

★ మన జీవితాలను ఔన్నత్యం కలవిగా చేసుకోవచ్చునని మహావ్యక్తుల జీవితాలు మనకు జ్ఞాపకం చేస్తుంటాయి.

-లాంగ్‌ఫెలో

★ గొప్ప వ్యక్తులందరూ ఏదో ఒక దశలో ఆత్మజ్ఞాన ప్రేరితులే!

-సిసిరో

★ బిడ్డలను నీతివర్తనులుగా చేయగల సామర్థ్యమే విద్యాభ్యాస ప్రారంభం.

-జాన్‌రస్కిన్

★ అన్ని సద్గుణాలలో ఔదార్యం అరుదైనది. యోగ్యతగల వ్యక్తులు వందమంది ఉన్నా మరో వ్యక్తిలోని యోగ్యతను ఒప్పుకునేవారు అతి కొద్దిమంది ఉంటారు.

-విలియం హాజ్‌లిట్

★ యజమానివి అయితే అప్పుడప్పుడు కళ్లు మూసుకుంటూండు. సేవకుడవు అయితే అప్పుడప్పుడు చెవులు మూసుకో.

-థామస్ ఫుల్లర్

★ శాంతంగా, నెమ్మదిగా స్థిరబుద్ధి కలిగివుంటే ఆరోగ్యమే నీ భాగ్యం అవుతుంది.

-బెంజిమిన్ ఫ్రాంక్లిన్

★ మానవులంతా సమానులే. పుట్టుక కాక సత్ప్రవర్తనవలన తేడా ఏర్పడుతుంది!

-వోల్టేర్

★ మరో కొవ్వొత్తిని వెలిగించినంత మాత్రాన ఒక కొవ్వొత్తికి పోయేదేమీ లేదు.

-జేమ్స్ కెల్లర్

★ నేర్చుకోకుండా ఉండటంకంటే జన్మించకపోవటమే మంచిది. జ్ఞానహీనతే దురదృష్టానికి వేరు. (ఉత్పత్తి)

-ప్లేటో

★ నీదగ్గర ఏదైనా ఉన్నంతవరకూ ఏమీ లేనివారికి నీవు ఎంతో కొంత బాకీ పడినట్టే.

-వినోభా

★ ప్రారంభంలో వస్తువులన్నీ (విషయాలన్నీ) ఉత్తమంగానే ఉంటాయి.

-లార్డ్ చెస్టర్‌ఫీల్డ్

★ చర్య (కార్యం) ఎల్లప్పుడూ సుఖాన్ని చేకూర్చలేదు. కానీ చర్య లేకుండా సుఖం ఉండదు.

-డిజ్రేలి

సేకరణ: జక్కల భరత్

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదని, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

సెప్టెంబర్ చతుర నవల స్కాలర్

.............................................

**సమీక్షకుని పేరు:** .............................................

**చిరునామా:** .............................................

.............................................

.............................................

.............................................

వాళ్ళు వెళ్ళాక,

"నిశాంత్! గైడ్‌లమీద అస్తమానం కోపం ఎందుకు ప్రదర్శిస్తావు? మీకు గైడ్‌ల అవసరం ఎక్కువ కదూ!" అన్నాడు రాజు.

"అవును... మీరు అలావొరేషియస్‌గా చదువుతూ పోతే మంచి థీసిస్ తయారుచేసుకోవచ్చు గైడ్ సహాయం ఉంటే క్వాలిటీ ఇంకా పెరగొచ్చుగానీ అసలు అవకపోవడం అంటూ ఉండదు. సైన్స్‌లో మాస్టర్ల సహాయంలేకుంటే చాలా కష్టం" అంటుండగానే రాజు క్లాస్‌మేట్ బోసు వచ్చాడు.

"ఇక్కడున్నారా మీరు? హమ్మయ్య! మిమ్మల్నే వెదుకుతున్నా. నిశాంత్‌గారి రూమ్ లాక్ చేసినపుడే అనుకొన్నాను. మీ ఇద్దరూ బీచ్‌కి వెళ్ళి ఉంటారని. అవును రాజుగారూ! మీరు నన్ను రమ్మనమన్నారు కదా! మరచిపోయారా!"

"మరచిపోలేదు. కానీ ఉదయమే చెప్పాను కదా! ఆలోచించి వ్రాయగలనంటే రూమ్‌లో ఉంటాను, లేకుంటే లేనట్టే అని"

"అలా అంటే ఎలాగండీ? నాకు మీ అంత స్టేండర్డ్ లేదు గదండీ. అందుకే మిమ్మల్ని బతిమలాడుతున్నా" అన్నాడు బోసు.

ఆ మాటలు అర్థంగాని నిశాంత్.

"ఏంటి రాయాలి? " అని అడిగాడు.

"వి.సి.గారిమీద ఓ ఆర్టికల్ రాయాలట. హిందూకి పంపిస్తారట. అదీ కేవలం రెండే రోజులు టైమ్. అంతగాభరాగా రాస్తే కంపై పోతుందేమోనని భయం. నేను రాయలేనంటే వినరు"

అప్పటికే తొంభైశాతం రాయడానికి సిద్ధపడ్డాడు. మరో రెండు నిముషాల్లో రాజుని తీసుకొని బోసు వెళ్ళిపోయాడు.

అలా... రాజుచేత రాయించి, వాళ్ల పేరుతో వేయించుకొని, ఆ క్రెడిట్ కొట్టేసి, పెద్దవాళ్ళ ప్రాపకం సంపాదిస్తారు. ఆ విషయం రాజుకీ తెలుసు. అయినా పట్టించుకోడు. సాహిత్యవ్యాసాలు కూడా మరొకరి పేరుమీద చాలా జర్నల్స్‌లో రాజు రాసినవే పడ్డాయి. నువ్వే పంపించుకోవచ్చు గదా అంటే, అబ్బే, అవి నాకు తృప్తిగాలేవు అనేస్తాడు.

రాజు గురించి ఆలోచిస్తూ రూమ్‌కి చేరుకొన్నాడు నిశాంత్.

★ ★ ★

జలజ ప్రొఫెసర్ సూర్యం రూమ్‌లోకి అడుగుపెట్టి,

"గుడ్‌మార్నింగ్ సర్" అంది.

తల ఎత్తి చూస్తూనే,

"ఏమిటి? నిన్నెందుకు రాలేదు? అసలు ఈ సెమినార్స్ గొడవంతా దగ్గరుండి చూస్తారనుకొన్నాను. కనీసం డిస్కషన్స్‌కన్నా టైమ్‌కి రావడంలేదు. అసలు నేను చెయ్యాలంటేనే రారు.

ఆ వీర్రెడ్డి ఏదైనా చేస్తే... స్కాలర్స్ అంతా రాత్రిళ్ళు కూడా ఉండి అన్ని పనులూ చేస్తారు. ఆరు గంటలయితే వెళ్ళిపోవాలంటావు. చీకటిపడితే ఇంట్లో తిడతారంటావు ఇంత వయసొచ్చినా. పోన్లే, పగలైనా చేస్తావు అనుకొంటే... ఇలా ఎగ్గొట్టేస్తున్నావు.

ఎవరెవరు ఏవి చేయాలో కూడా నిర్ణయించుకోలేదు. ప్లేన్డ్‌గా లేకుంటే ఏవైనా పొరపాట్లు జరుగుతాయి. ఆర్గనైజేషన్ బాగులేదని అతి తేలికగా అనేస్తారు. ఇంకా టెలిగ్రామ్స్ ఇవ్వడం కూడా పూర్తవలేదు" అంటూ మండిపడిపోయాడు ప్రొఫెసర్.

ఆ వెంటనే

"ఇదిగో, బండి తెచ్చావా? " అన్నాడు.

"ఆ, తెచ్చాను సర్!"

"పోన్లే, కొంతలో కొంత బెటర్. క్విక్‌గా టెలిగ్రామ్స్ ఇచ్చిరా? " అని, మేటర్ చేతిలో పెట్టారు.

బయటకి వచ్చిన జలజ పర్స్‌లో డబ్బులు చూసుకొంది 'ప్చ్ అనవసరంగా పెట్రోలు పోయించాను. ఇప్పుడు ఎవరిని డబ్బులు

అడగాలి' అనుకొంది.

కేంటీన్ దగ్గరకి వచ్చేసరికి సమీర కన్పించింది.

"సమీరా! ఒక హెల్ప్ చేయగలవా? "

"ఏమిటి? చెప్పండి'

"ఏభైరూపాయలు కావాలి. మాస్టారు టెలిగ్రామ్స్ ఇమ్మన్నారు. నాదగ్గరున్నవి చాలవు"

"ఇరవై ఉన్నాయి. చాలవా? "

"అబ్బే. ఇవి టెలిగ్రామ్స్‌లాగ లేవు. లవ్ లెటర్స్‌లాగ ఉన్నాయి. చాలవు" అంది విసుగ్గా.

"అయినా... మీరు డబ్బులు ఇవ్వమని అడగొచ్చు గదా? ఇలా గైడ్‌కి అలవాటు చేస్తారు. తరువాత ఏడుస్తారు"

"అసలే, నిన్న రాలేదని నానా చీవాట్లు పెడుతుంటే, ఇది చెయ్యడానికి డబ్బులు కావాలని అడగనా? "

"ఇంతకీ మీరు నిన్న ఎందుకు రాలేదు? మేము మీకోసం వచ్చాము. మా ఫ్రెండ్‌కి హాస్టల్‌లో రూమ్ అర్జెంటుగా కావాలి. మీరు చెప్తారన్నారని వచ్చాము. తీరా మీరు లేరు. ఎందుకు రాలేదు? "

"ఏం చెప్పను? " అంది కొద్దిగా విసుగ్గా.

"నాకు చెప్పకపోతే ఫరవాలేదు. గైడ్‌కి చెప్తే ఈ విచార వదనం ఉండకపోవును కదా!"

"గైడ్‌కా! ఏవని చెప్పను? నిన్న నా పదవ పెళ్లి చూపులనీ, ఎప్పటినుండో వస్తాము, వస్తాము, అంటూ కొన్ని నెలలు గడిపిన వాళ్ళు మొన్న అకస్మాత్తుగా, అర్ధరాత్రి- రేపు ఉదయం వచ్చేస్తున్నామని కబురు పెట్టారని చెప్పనా? ఇంట్లోవాళ్లతో, అలా డిపార్ట్‌మెంట్‌కి వెళ్ళి మాస్టారికి కన్పించివస్తానని చెప్తే అక్కడ నాకేం పనో కనుక్కోకుండానే 'అలా పెళ్లి వద్దు! అని ఏడుస్తుంటే ఏ సంబంధం నీకు కుదిరిచావదు' అని ఇంట్లో వాళ్ళు తిట్టారని చెప్పనా? అంటే అన్నారులే అని వచ్చేస్తే, ఆ సంబంధం ఎలాగా కుదరదు వీళ్ళ గీచిగీచి చేసే బేరాలకి! అయినా నేను డిపార్ట్‌మెంట్‌కి వెళ్ళనివ్వలేదని, ఏడుపు మొహం పెట్టేననీ, అందుకే వాళ్లకి నచ్చలేదనీ నోటికి వచ్చినట్లు అని వాళ్ళ బాధని కోపంగా వెళ్ళగ్రక్కుతారు. ఇవన్నీ మాస్టారికి చెప్పలేం కదా!" అంది జలజ ఆవేశంగా.

"వాళ్ళు వచ్చి వెళ్ళిన తర్వాత కన్పించ వచ్చు కదా!"

"తల్లీ! వాళ్ళు ఉదయం వస్తామన్నవాళ్ళు ఎదురు చూడగా చూడగా సాయంత్రం నాలుగు గంటలకి వచ్చారు"

"సరేగానీ రిజల్ట్స్ ఎప్పుడు వస్తాయి? "

"యూనివర్శిటీ రిజల్ట్స్‌లాగే సంవత్సరం లోపే వచ్చేస్తాయి" అని ఏడవలేక నవ్వింది.

ఆ తర్వాత

"నేవెళ్తాను. ఎవడినెత్తినో వేస్తాను" అని వెళ్ళిపోయింది జలజ.

ఆమె వెళ్ళినా క్లాస్‌కి వెళ్లబుద్ధిపుట్టక అలాగే కూర్చుంది సమీర.

"క్లాస్‌కి వెళ్ళలేదా? " అంటూ తెలుగుస్కాలర్ మత్స్యలింగం పలకరించాడు.

అతను డిగ్రీనుండీ తెలుసు.

"నాక్లాసెస్ మాట ఎందుకుగానీ, నీ రీసెర్చి ఎలా ఉందో చెప్పు? " అంది సమీర.

"రీసెర్చి రీసెర్చిలాగే ఉంది"

"అనన్వయమే! ఇంతకీ టాపిక్ డిసైడ్ అయిందా? ఇంకా డిస్కస్ చెయ్యాలనే అంటారా? "

"నిన్ననే నిర్ణయించారు"

"నువ్వు అనుకొన్న తెనుగు వ్యాకరణ మేనా? "

"కాదు, లిటరేచర్. ఒక కవిమీద"

"అదేంటి సబ్జెక్ట్ మార్చేసారు? "

"గైడ్ చెప్పినదివినడమే స్కాలర్ ధర్మం" ఇంకా మింగుడుపడని సమీర అంది.

"ఎందుకలా? "

"ఎందుకంటే మనకి కావలసింది పట్టా. లేకపోతే శ్రీహరిలా అయిపోతాం. నాకు యు.జి.సి నాలుగు సంవత్సరాలు డబ్బులు ఇస్తుంది. ఆ టైమ్‌లోనే పూర్తిచెయ్యాలి. లేకుంటే కష్టం. అందువలన త్వరగా సబ్మిట్ చెయ్యడం ఒక్కటే నాకు కావలసింది మా వాడే కాబట్టి త్వరగానే అవుతుంది" అన్నాడు మత్స్యలింగం.

'కవి కూడా మీకులం వాడేకదా? "

"అవును, మన కులంవాడిని మనం ప్రొజక్ట్ చేయకపోతే ఎవరు చేస్తారు? ఇన్నాళ్ళూ వాళ్ల కులంవాళ్ళే, వాళ్ళని సంస్కరించడానికే రాసారు. అవే వెలుగులోకి వచ్చాయి. ఇకనైనా మన కులంవాడిగురించి మనం పట్టించుకోవాలన్నారు మా గురూజీ'

అతని మాటలకి బాధనిపించింది.

"మీరు కూడా ఇలా..."

"బాబోయ్! తల్లీ! అక్కర్లేని గొప్పతనం బలవంతాన ఆపాదించి జీవితం నాశనం చేయకు. నేను కాబట్టే- ఇలా నిర్ణయించుకొన్నా. ఇప్పటికే సగం వయస్సయిపోయింది. ఇంకెప్పుడు సెటిల్ అవుతాను. అయినా స్కాలర్‌ని చూస్తే చాలు. వాళ్ళ రీసెర్చి గురించి తప్ప, ఇంకేవీ మాటలు దొరకవా? ఏవో నాలుగు కులాసా కబుర్లు చెప్తావేమో అనుకొంటే, వాయించేస్తున్నావ్. యూనివర్శిటీమీద మోజుకొద్దీ వచ్చావు. ఎలా ఉంది? " అంటూనే,

"అమ్మా, నాన్నా బాగున్నారా? " అన్నాడు.

"ఆ! మీవాళ్ళంతా ఎలా ఉన్నారు? ఏం చేస్తున్నారు? "

"తమ్ముడు పదవతరగతి రెండవసారి ఫెయిల్ అయ్యాడు. చెల్లి పెళ్లికి తొందరపడుతున్నారు. పెళ్లి చెయ్యాలంటే డబ్బులుండాలిగా. దానికోసమే ప్రయత్నం. ఏదో ఆడాళ్ళు [illegible] అన్యాయం అయిపోతున్నామని గోలపెట్టేస్తారు గానీ, నిజానికి మేము ఛస్తున్నాం"

"ఓహోహో! కబుర్లు బాగానే చెప్తున్నావు ఓ లక్ష పుచ్చుకొని, పాతికవేలు పారేస్తావు. ఒకవేళ అది కూడా చెయ్యకపోయినా, ఏవీ చెయ్యలేదుగా. నువ్వు ఎవడో బాగా స్టేటస్ ఉన్న వాళ్ళ పిల్లని పెళ్ళి చేసుకొని పోతావు. ఇంకోడి దయా దాక్షిణ్యాలమీద ఆధారపడడంకన్నా అన్యాయం ఏముంది? " అంటూ ఆవేశపడుతున్న సమీరతో,

"స్టాప్, స్టాప్, తల్లీ! ఏదో ఉడికిద్దామనుకొంటే పోట్లాటకి వచ్చేశావ్? సరే, క్లాస్‌కి వెళ్ళు. నేనూ లైబ్రరీకి వెళ్లాలి" అంటూ వెళ్లిపోయాడు.

★ ★ ★

జగన్ హడావుడిగా నిశాంత్‌రూమ్‌కి వచ్చాడు.

"రుషిపుంగవా! సాయంత్రం దసపల్లాలో పార్టీ. నాకు 'కంటెన్‌జన్సీ' వచ్చిన శుభసందర్భములో ఇస్తున్నా. నాలుగు గంటలకల్లా అక్కడ ఉండాలి. రాజు, అవధాని కూడా వస్తున్నారు" అని "ఆ గెడ్డం మాత్రం తీసేసి, రావాలి" అని చెప్పి గబగబా వెళ్లిపోయాడు.

నిశాంత్, రాజు నాలుగు గంటలకి దసపల్లా చేరుకొన్నారు. అవధాని మాత్రం రాలేదు.

జగన్‌కి నాలుగు గంటల అయిదు నిముషాలకే విసుగు ఆరంభమయింది.

"ఏ టైమ్ అంటే ఆ టైమ్‌కి రావాలిగానీ, ఇలా చేస్తాడేమిటి? ఇతనంటే అదే చిరాకు. వొట్టి పప్పుసుద్ద. మనం వెళ్లిపోదాం" అన్నాడు అసహనంగా.

"ఎందుకు లేట్ అయిందో! చూద్దాం, ఉండు" అని నిశాంత్, రాజు కాలక్షేపం చేస్తున్నారు.

మరో క్షణం తర్వాత మళ్ళీ జగన్,

"నాలుగున్నర అవుతోంది. ఇంక రాడేమో'' అన్నాడు విసుగ్గా.

"అదుగో మాటలోనే వస్తున్నాడు అవధాని. అదిసరే ఇంతకీ అసలు

మీ డిపార్ట్‌మెంట్‌లో కంటెన్‌జెన్సీ రావడమేమిటి? కంటెన్స్‌జెన్సీ గైడ్‌లే కొట్టేస్తారుట. ఏ స్కాలర్ అడగనే అడగడు కదా! నువ్వు అడిగావా? " అని అడిగాడు రాజు.

"యా, మా గురువు కూడా ప్లాన్ వేసాడు. ఈ సంవత్సరం కూడా కొట్టేద్దామనుకొన్నాడు. సంతకంపెడ్తూ 'కలర్ టి.వి. లేదోయ్! కొనాలి' అన్నాడు. తొందరగా కొనండి సర్. లేకుంటే రేట్లు పెరుగుతాయి' అన్నాను. వెంటనే పాపం! మొహం మాడిపోయింది. అంతేకాదు. మీరే కొనుక్కొంటారా? ఎవర్నైనా కొనమంటారా? అని కూడా అన్నాను. అప్పుడు చూడాలి ముఖం. మహోగ్రుగా చూశాడు" అని పకపకా నవ్వాడు జగన్.

"'డబ్బులు నీవే, కాబట్టి న్యాయంగా తీసుకోవచ్చు కానీ మాటలెందుకు? ఆ మాటలు మాత్రం బాగులేవు. కాస్త గౌరవంగా మాట్లాడాలి కదా!" అన్నాడు నిశాంత్ సీరియస్‌గా.

"నీకు తెలీదు బాసూ! అలాంటపుడు అలాగే మాట్లాడాలి"

"వాళ్లు నీకోసం అర్ధరాత్రిదాకా లేబ్‌లో ఏడుస్తారు. నువ్వుమాత్రం నోటికి వచ్చినట్లు వాగుతావు"

"ఏంటసలు నీ ఉద్దేశం? సొమ్మంతా ఆయనకి ఇచ్చేయాలా? అంతంత జీతాలు చాలవేంటి? మీలాంటి వాళ్లుండబట్టే యూనివర్శిటీ ఇలా తగలడుతోంది" అన్నాడు తీక్షణంగా జగన్.

"ఇస్తే ఇవ్వొచ్చు తప్పేంటీ? అవసరానికి అడిగారేమో? అసలు గైడ్ లేకుంటే నీ రీసెర్చి ఏమవుతుంది? అలా ఆలోచిస్తే తెలుస్తుంది"



"మా బాబే! ఎంతచక్కగా చెప్తున్నావు నీతులు, సమస్య, మనదికాకపోతే ఏదైనా చెబుతారు. పని చేయించుకొంటే చేయించుకొన్నాడు. తిడితే తిట్టాడు. గైడ్ తప్పేంటి? ఏదో... పెద్ద కష్టం వచ్చినట్టు మొహం పెట్టి, గెడ్డం పెంచి డిపార్ట్‌మెంట్‌కి వెళ్ళడం ఎందుకు మానేశావు. ఎందుకట? "

"మీ గైడ్‌లా కాదు మాగైడ్. డబ్బులూ తీసుకోడు. ప్రతిక్షణం తాను తీసుకోకుండా ఏదో చాలా గొప్పత్యాగం చేస్తున్నా, గుర్తించడంలేదంటాడు. కొందరిలా తీసుకోడు. మరికొందరిలా వాటికి, నాకు సంబంధం ఏమిటి? అనీ అనుకోడు. ద్వంద్వప్రవృత్తితో చంపుతాడు.

అంతేనా? సబ్జెక్టు రాదన్పించడానికే ప్రయత్నించి, ఎందుకూ పనికిరాని వాళ్లమని ప్రచారం చేసి అనుక్షణం అవమానించడానికే ప్రయత్నిస్తాడు. ఏడాదిన్నర అవుతోంది. అనుక్షణం టెన్షనే. నీకేం తెలుసు ఆ బాధ" అని నిశాంత్ కూడా రెచ్చిపోవడంతో రాజు, అవధాని భయపడ్డారు.

"అబ్బబ్బ! హాయిగా సాయంత్రం చక్కటి దోసె తినడానికి పెట్టావన్న సంతోషం పోగొట్టేస్తూ మీ గైడ్‌ల గోలేమిటి? ఆపండి ముందు" అన్నాడు రాజు.

నిశ్శబ్దంగా ఎవరి టిఫిన్ వారు తీసుకొంటున్నారు.

"ఐస్‌క్రీమ్ ఏది కావాలి? " అడిగాడు జగన్.

"ఐస్‌క్రీమ్ అక్కర్లేదు నాకు. టీ తెప్పించు" అన్నాడు నిశాంత్.

"అన్నీ నీ ఇష్టమే. ఇందాక ఐస్‌క్రీమ్ కావాలన్నావు. ఇప్పుడేమో టీ అంటున్నావు. ఎక్కడా మొహమాటం అనేది కాగడాపెట్టి వెదికినా దొరకదు"

నిశాంత్ మనసు బాధగా మూల్గింది.

నిజానికి నిశాంత్, చాలా బిడియం, మొహమాటాలతో విశాఖలో అడుగుపెట్టాడు. అతని మొహమాటంవలన హాస్టల్‌లో రూమ్ రావడం చాలా ఆలస్యం

అయింది. అలాగే ఎన్నోసార్లు జగన్‌లాంటి వాళ్ళు కాఫీ ఇప్పిస్తే, కాఫీ పడదని చెప్పలేక అనారోగ్యం తెచ్చుకొన్నాడు. ఆఖరికి స్పెషలైజేషన్ తీసుకొనేటప్పుడు ఓ మాస్టారు 'నా స్పెషలైజేషన్ కదూ నువ్వు' అని అనగానే కాదని చెప్పడానికి మొహమాటమేసి, అవునండీ అనేసాడు.

మొహమాటంవలన ఎన్నో రకాలుగా నష్టపోయిన నిశాంత్ బలవంతాన మొహమాటం తగ్గించుకోవడం ఆరంభించాడు. మొదటగా తిండి విషయంలో అస్సలు మొహమాటపడకూడదనుకొన్నాడు. కానీ జగన్‌లా ఎవరైనా అంటే మాత్రం అతనికి చాలా బాధనిపిస్తుంది.

అతని ముఖం చూసిన రాజు మాత్రం,

"టీయేతాగుదాం. ఐస్‌క్రీమ్‌కి బోల్డు డబ్బులు దండగ. డబ్బు కన్పిస్తే చాలు. తగలేస్తారు" అన్నాడు.

"సరే, టీయేతాగుదాం" అని టీ తెప్పించాడు.

టీ తాగుతుండగా, షిఫాన్ చీరతో చాలా చలాకీగా మాట్లాడుతూ, ఎవరితోనో కలసి లోపలకి వచ్చింది సుమబాల.

వస్తూనే నిశాంత్‌ని చూసి కళ్ళు విప్పార్చి ఆశ్చర్యంగా,

"హాయ్! నిశాంత్‌గారూ! ఇక్కడ ఉన్నారా? అవునూ, పొద్దుట రాలేదేంటి? మీకోసం మాస్టారు ఎంతసేపు చూసారో? " అన్నది చాలా ముద్దుగా.

"అన్ని విషయాలూ నీకేకావాలి. ఇప్పుడే అడగాలా? మహాతల్లీ!" అని తిట్టుకొంటూ, రాని నవ్వు పులుముకొని,

"హాలో! రండి. ఇతను జగన్ అని ఫ్రెండ్, కెమిస్ట్రీ స్కాలర్. ఇతను రాజు, ఇతను అవధాని..." అని పరిచయాలు చేసేడు నిశాంత్.

"రాజుగార్ని, అవధానిగార్ని కూడా పరిచయం చేయాలా? " అని నవ్వింది సుమబాల.

"అవధానిగారు మార్నింగ్ వచ్చారు. మీరే రాలేదు. ఇంతకీ ఎందుకు రాలేదు? " అంది మరోసారి.

నిశాంత్ మాట్లాడలేదు. మళ్లీ సుమబాలే-

"మా ఫ్రెండ్‌తో కలసి సరదాగా వచ్చాను. తన మ్యారేజ్ అయ్యాక ఇదే కలవడం మేము" అంటూ-

"ఇక వెళ్తా. రేపురండి. ఈరోజు రాకపోవడానికి కారణం ఏదో చెప్దాం" అంది.

వొళ్లు మండిపోయింది నిశాంత్‌కి. జగన్ చిరునవ్వుతో-

"ఏంటి గురూ! నీ తరపున మాట్లాడుతుందిట. గురువుకీ ఈమెకీనా? నీకూ ఈమెకీనా...? " అంటూ కన్ను గీటాడు.

"ఛా, నోర్మూయ్" అంటూ కుర్చీలోనుండీ లేచాడు నిశాంత్.

★ ★ ★

తెల్లవారకూడదని ఎన్ని ప్రార్థనలు చేసినా సూర్యుడు మహరాజులా రానేవచ్చాడు. వాడికేం, ఎవరు ఎన్ని తిట్టుకొన్నా ధైర్యంగా వస్తాడు. సూరీడు వచ్చేడనిపించేసరికి నిశాంత్‌కి గుండెల్లో దడ ఆరంభమయింది.

డిపార్ట్‌మెంట్‌కి వెళ్ళాలి. ఈరోజు ఆయన మూడ్ ఎలా ఉంటుందో అన్పించింది నిశాంత్‌కి. నాలుగురోజులు కనబడకపోతే బెంగుళూర్ పోతాడు. వచ్చాక చూసుకోవచ్చు ప్రస్తుతానికి తప్పించుకోవచ్చుకదా అనుకొన్నాడు. అంతలో సుమబాల గుర్తొచ్చింది. బాబోయ్! ఈ మహాతల్లి నిన్న దసపల్లాలో కన్పించాడండీ అంటూ వయ్యారాలు పోతుందే చచ్చేను. దేవుడా! వెళ్లక తప్పదు, అనీ అనుకొన్నాడు.

టైమ్ ఏడున్నర దాటిపోతోంది. గబగబా తెమిలి పదిగంటలలోపు వెళ్ళాలి. స్నానం చేసి వచ్చేసరికి ఎనిమిది గంటలయింది. మాస్టారి దగ్గరకి వెళ్లి, ఏం చెయ్యాలనుకొని ఆలోచనలోపడ్డాడు ఒక్క క్షణం.

అంతలోనే "మూడీఫెలో! ఏ క్షణంకి ఏమి చేస్తాడో అతనికే తెలియదు. పనిచె

ప్పేస్తున్నారనుకొంటారేమోననే భయంతో ఒకోసారి చాక్‌పీస్ ఇచ్చి బోర్డ్ దగ్గరకి పంపిస్తాడు. అలా అకస్మాత్తుగా సెమినార్ చెయ్యి అంటే... ప్రిపేర్ అవకుండా వెళ్లిన వాడు బలి అయిపోతాడు" అనుకొన్నాడు నిశాంత్.

ఇంకా గంటన్నర ఉందిగా. ఒక రెండు థీరమ్‌లు చూసి వెళ్లాలనుకొని పుస్తకం తియ్యబోతుంటే, టిఫిన్ చేసివస్తే బాగుణ్ణు అనిపించింది. టిఫిన్- గిఫిన్ అనుకొంటే టైమ్ చాలదు అనుకొని గబగబా పుస్తకం తెరిచాడు.

గంటలో ఏమైనా బుర్రలోకి ఎక్కుతుందా... అనే టెన్షన్ ఒకపక్క, నేచదివిన థీరమ్ చెప్పనిస్తాడా? ఇంకేదైనా చెప్పమంటారేమో! అనే సంశయం ఒకపక్క. ఆయన ఇది చెప్పమంటాడేమో... అని ఊహించి మరోటి చదువుదాం అనుకొన్నాడు. ఇదే అడుగుతారని గేరంటీలేదే అని మళ్లీ దిగులు.

మరీ తెల్లమొహం వేయకుండా కొంచెం కొంచెం చూద్దామనుకొన్నాడు. ఒకపక్క టెన్షన్, ఇంకోపక్క సంశయం, మరోపక్క ఆకలి...

పుస్తకం తిరగేయడమే మిగిలింది. టైమ్ మాత్రం తొమ్మిదిన్నర దాటిపోయింది. ఒక్కసారి దిగాలుగా అన్పించింది.

టైమ్ అంతా వేస్ట్ అయిపోయింది. ఒక్క పిసరు బుర్రలోకి ఎక్కింది ఏమీలేదు. ఆయన ఏది అడుగుతారో అనే దిలుగు లేకుంటే ఏదో ఒక థీరమ్ అయినా పెరఫెక్ట్‌గా చదివే వాడినేమో అన్పించింది.

అలా అన్పించగానే మళ్లీ ఆయనమీద కసి, కోపం వచ్చాయి. స్వేచ్ఛ లేకుండా చేస్తున్నాడు, అనుకొని మళ్ళీ తిట్టుకోబోయి... ఆ పాపం కూడా ఎందుకు మూట కట్టుకోవడమనుకొంటూ డిపార్ట్‌మెంట్‌కి వెళ్లాడు.

నిశాంత్ వెళ్లేసరికి, అవధాని, సుమబాల, విజయ్ ఉన్నారు. నిన్న రాలేదేం? అని అడిగితే ఏం చెప్పాలి? అనుకొంటూ, ఇది రూమ్‌లోనే ఆలోచించుకోవలసినదనుకొన్నాడు. ఒంట్లో బాగులేదనేస్తే? ... తలత్తేసరికి సుమబాల కన్పించింది. నిన్న దసపల్లాలో కన్పించిందండీ అని అప్పటికే ఊదేసిందేమో, ఆ కారణం చెప్పకూడదనుకొంటుండగానే-

"ఒహో! దొరబాబు ఈరోజు పెందలాడే వచ్చేసారే! ఏమ్మా! నిద్రపట్టలేదా?" అని వ్యంగ్యంగా వామనరావు అనగానే కిసుక్కున నవ్వేరు సుమబాల, విజయ్. అవధాని మాత్రం ఏ భావం లేకుండా నిశ్చలంగా కూర్చున్నాడు.

అవధాని నవ్వకపోవడం చూసి చాలా ఆనందించడమేగాక, ఆ క్షణంలో తనకి పరమాప్తుడు ఒక్క అవధానే అన్పించింది. ఈ ఆలోచనలతో విష్ చెయ్యడం కూడా మరిచిపోయాడు. ఈయన దగ్గర ఎలా బిహేవ్ చెయ్యాలో తెలియదు అనుకొంటూనే వెర్రి నవ్వు నవ్వి కూర్చున్నాడు.

విజయ్, నిశాంత్‌కి దొరకని రిజర్వేషన్ తనకు ఎలా దొరికినదీ, దానికోసం ఎన్ని టెక్నిక్స్ వాడినదీ, ఎంత ఇన్‌ఫ్లుయన్స్ చేసినదీ.. అలా, ఏవో గొప్పలు చెప్పుకొంటున్నాడు.

సుమబాల, "మాస్టారిపనంటే ఏదయినా అయిపోతుంది" అంటూ సాధ్యమయినంత సోప్ పూస్తోంది.

కనీసం విజయ్ రిజర్వ్ చేయించి గొప్పలు పోతున్నాడు. ఏమీ చెయ్యకుండానే సుమబాల మాటలతో కాకా పట్టేస్తోందనుకొన్నాడు అవధాని.

"మళ్లీ ఎప్పుడు వస్తారు మాస్టారు?" అంది సుమబాల.

"పదిహేనురోజుల తర్వాత"

"ఫిఫ్టీన్‌డేస్. చాలా డ్రైగా ఉంటుంది"

"నేను ఇచ్చిన రెండు పేపర్స్ బాగా స్టడీ చెయ్యి. వచ్చిన వెంటనే సెమినార్ చేద్దువు

గాని"

చక్కగా అలా వర్క్ ఇస్తే ఎంత బాగా చదవొచ్చు. నన్ను మాత్రం ఏదో బుర్రలోకి వచ్చిన థీరమ్ చెప్పమంటాడనుకొన్నాడు నిశాంత్ కచ్చగా.

తనకి చాలా జూనియర్ అయిన సుమ బాల వర్క్‌స్పీడ్ తను లేనప్పుడు కూడా తగ్గకూడదని మాస్టారు పడుతున్న తాపత్రయం చూస్తే, ఉడుకుమోత్తనంగా అన్పించింది అవధానికి. ఆడపిల్లనయినా బాగుండేది అనుకున్నాడు. ఇంతలో-

"మాస్టారూ! బెంగుళూర్‌లో చాలా చలిగా ఉంటుందేమో గదండీ" అంటూ ఆయన దృష్టిని తనవైపు మరల్చుకున్నాడు విజయ్.

"అవును, చాలా చలిగా ఉంటుంది నేను మంచి స్వెట్టర్ తెస్తానులెండి. ఈమధ్యే మావాళ్లు డార్జిలింగ్ వెళ్లివచ్చారు. అక్కడ నుండీ మంచి వెరైటీవి తెచ్చారు" అంది సుమబాల.

ఆ మాటలకి, ఉప్పొంగిపోయారు మాస్టారు.

అవధాని మాత్రం-

డార్జిలింగా! నా బొందా! చిత్రాలయా పక్కన కొనితెస్తుంది అని గొణుక్కొన్నాడు.

"ఎందుకులే? ఇంట్లో ఏవో ఉంటాయి లేదా కొనుక్కొంటాను. నీకెందుకు శ్రమ? " అన్నారు మాస్టారు.

"అదేంటి సర్! ఇందులో శ్రమేముంది? మీరు మా గురించి ఎంత శ్రమపడటం లేదూ? మధ్యాహ్నంగానీ, రేపుగానీ తెస్తాను. మీరేవీ కొనకండి. మధ్యాహ్నం ఇక్కడే ఉంటారుకదా"

"మధ్యాహ్నం ప్రత్యేకంగా దానికోసం రావడం దేనికి? ఎల్లుండి ప్రయాణం. రేపు వచ్చినప్పుడు తెండి"

"ప్రత్యేకం ఏవీలేదు. బిల్ ప్రిపేర్ చేసి తెస్తాను. మళ్లీ మీరు ఏ పదినో వస్తారు కదా!" అని సుమబాల అనగానే-

"మీకెందుకు శ్రమ. నేను ఫారమ్స్ అవీ తెచ్చి మీది, నాది కూడా మధ్యాహ్నం పెట్టిస్తాను. అంతదూరంనుండీ రావడం ఎందుకు? ఏవండీ, మాస్టారూ! అంతేకదా" అన్నాడు అవధాని.

వీళ్లంతా చాలా నేర్పుగా బిల్ విషయం కదిపారు. నిశాంత్‌కి, తను కూడా మరోసారడిగితే అన్పించింది. బిల్ పెట్టి ఆరు నెలలయ్యింది. వర్క్ ఏం చేశావనడుగుతారేమోనని భయం. నేను కూడా బిల్ పెడతానండీ అని అనాలని తాపత్రయం. నాలిక దాటి మాట రాదు. ఈ టైమ్ దాటితే అసలు అడగలేనేమోనని కంగారు. ఉక్కిరిబిక్కిరిగా ఊపిరాడనట్టుగా అన్పించింది. న్యాయంగా వర్క్ చేయలేదు కాబట్టి పెట్టకూడదు. కానీ... అవసరాలు... అని ఆలోచిస్తున్నాడు.

ఏ దేవుడు అతని మొర ఆలకించాడో గానీ,

"ఏంవోయ్! నిశాంత్ నువ్వు బిల్ పెట్టవా? " అన్నారు మాస్టారు.

నిశాంత్ కంగారుపడ్డాడు.

"పెట్టనా మాస్టారూ? " అన్నాడు గభాల్న.

"నాకేం తెలుసు. నీకు అక్కర్లేకపోతే పెట్టకు" అన్నారు మాస్టారు.

పెడతానని అనకుండా పెట్టనా అనడం పొరపాటయింది. మళ్ళీ ఎప్పుడో? అనుకొన్నాడు నిస్పృహగా.

"అయినా నిశాంత్! విజయ్‌ని చూసి నేర్చుకో. ఇరవైతేదీకల్లా మిగిలిన వర్క్ ఎలా ఉన్నాసరే, బిల్ మాత్రం తయారయిపోతుంది"

"మరి తప్పదుగదా, సర్! నాకు బండికే 60-70 రూ. లు అవుతుంది. అయినా మాకు వచ్చేదెంత? యూనివర్శిటీవాళ్లు ఇచ్చేది. మీలాంటి గురువర్యుల సేవ చేసుకోవాలి కదా" అని అతనూ దెబ్బకొట్టాడు.

అతని బండివాడు కొంటాడు కాబట్టి ఆయన కిక్కురుమనలేకపోయాడు. కొట్టినప్పుడు కొడతాడు. కాకా పట్టవలసినప్పుడు పట్టగలడు. అదీ కుదరకపోతే నలుగుర్ని వెంటేసుకొని ఇంటిమీదకి పోగలవాడు కాబట్టి మాస్టారు-

"సర్లే, ఈ కబుర్లకేంగానీ, మధ్యాహ్నం బిల్లులు పట్టుకొని రండి. అన్నట్టు నిశాంత్! నువ్వూ, అవధాని నేను వచ్చేదాకా మా ఇంట్లో ఉండాలయ్యా!"

పదిహేను రోజులు బిక్కు బిక్కుమంటూ అంత దూరంలో ఉండాలి. అయినా తప్పదు. అయిష్టతనంతా మనసులో అణగ ద్రొక్కుకొని-

"అలాగేనండీ" అన్నాడు.

"రాత్రి వెళ్లి పడుకోవడం కాదు. ఈమధ్య పగలే ఇల్లు దోచేస్తున్నారు. కాస్త పగలు కూడా అక్కడే ఉండాలి. లైబ్రరీ అని వ్రేలాడకుండా బుక్స్ పట్టుకువెళ్ళి అక్కడే వర్క్ చేసుకోండి. అవధాని అలాగే చేస్తాడు. నిశాంత్? నీకే చెప్తున్నాను. ఇద్దరూ ఉంటేనే బాగుంటుంది. మధ్యాహ్నం లైబ్రరీకి వెళ్లి జర్నల్స్ తెచ్చుకొందాం. రెండు పేపర్స్ పెర్‌ఫెక్ట్‌గా చదివితే అటునుండి వచ్చేక సెమినార్ చేద్దువుగాని. ఇకనైనా వర్క్ స్పీడ్‌గా చెయ్యాలి"

ఆ మాటతో నిశాంత్‌కి హమ్మయ్య అన్పించింది. ఇంకా ఎన్నేళ్లు ఇలా జీవచ్ఛవంలాగా గడపాలో అనే బెంగ వదిలిపోయింది.

ఎవరు చేయవలసిన పనులు వాళ్లకి గుర్తుచేసి-

"నాకు పనుంది. మళ్లీ కలుద్దాం" అంటూ మాస్టారు లేవడంతో అందరూ వెళ్లడానికి సిద్ధపడ్డారు.

"అవధానిగారూ! మీరు బిల్లు సంతకం పెట్టించుకోవడానికి ఎన్ని గంటలకి వస్తారు? " అని నిశాంత్ అడిగాడు. మళ్ళీ ఒక్కడే వస్తే పెడతాడో, తిడతాడో, ఎందుకొచ్చిన బాధ వాళ్లతో కలసి వెళ్తేనే బాగుంటుందనుకొన్నాడు.

"మా ఇంట్లో అక్కయ్య బంధువు లెవరో ఉన్నారు. వాళ్లు గోపాలపట్నం తీసుకువెళ్లమన్నారు. ఇంటికి వెళ్తే ఈరోజు రావడం అవదు. అందుకని ఇక్కడే కాలక్షేపం చేసి డిపార్ట్‌మెంట్‌కి వెళ్లాలనుకొంటున్నాను"

"అయితే, మెస్‌కి వస్తారా? "

"అబ్బే, అవసరం లేదు" అని వెంటనే కట్ చేశాడు అవధాని.

సాధారణంగా అవధాని ఎవ్వరితో ఎక్కడకీ వెళ్లడు ఎప్పుడో పార్టీకి తప్ప. అదీ తను ఎవరికి ఇచ్చాడో, వాళ్లతోనే లెక్కగా వెళ్తాడు. చిన్నప్పుడే తల్లిదండ్రులని పోగొట్టుకొని అన్నావదినల దగ్గర పెరిగిన అవధానికి ఎవరితోనైనా ఏమైనా చేయించుకొంటే తిరిగి చెయ్యలేనేమోనన్న భయం. కృతజ్ఞతా భారంతో వంగిపోవాలనే జంకు. అతను చాలా జాగ్రత్తగా అందరికీ అన్ని పనులూ చేసిపెడ్తూ తనకి కావలసినవి ఎంతో జాగ్రత్తగా చేయించుకొంటాడు. అతని సంగతి తెలిసిన నిశాంత్ భోజనం గురించి మాట్లాడకుండా-

"టీ త్రాగుదాం, పదండి" అన్నాడు.

"మీ భోజనం? "

"నాకు వంట్లో బాగులేదు"

"అరే! మీరు ఈమధ్య చాలా నీరసంగా ఉంటున్నారు. మెస్ భోజనం పడకపోతే బయట ఏమైనా బలంగా ఉండటానికి తినొచ్చుగదా!"

"డబ్బులుండాలికదా! బిల్లు సంతకం పెట్టి ఆరు నెలలయ్యింది. పదే పదే బిల్లు గురించి అడగడానికి మొహమాటంగా ఉంటుంది. ఈరోజైనా పెడ్తాడో, పెట్టడో" అని కోపంగా అన్నాడు నిశాంత్.

అవధాని చాలా భయంగా చుట్టుపక్కల చూస్తూ టీ తాగేనన్పించి-

"లైబ్రరీకి వెళ్లిపోదాం" అన్నాడు.

"ఏం? మీ గురువుగారిని నిందించానని

పారిపోవడం. నేనేమీ అనసులెండి. మీకు గురువంటే ఎంత ఇష్టమో! ఎంత చీదరించు కొన్నా దులిపేసుకోవడం మీకు అలవాటేనని నాకు తెలుసు. ఏదో నాకు మీ అంత సహనం లేదు. నా బాధలో నేనోమాట అన్నాను. అంత మాత్రాన ఏదో పెద్ద ఆపద మీకు సృష్టించేవాడిలా నన్ను చూసి దూరంగా పోవాలా?" అని చాలా ఆవేశంగా, ఆక్రోశంగా అంటున్న నిశాంత్‌ని ఆపేడు అవధాని.

"చూడండి! మాస్టారు ఎలాంటివారో, ఎంత నీచంగా తిడతారో అవన్నీ అనవసరం. ఆయన గైడ్. నాకు కావలసినది డిగ్రీ. కాగితం చేతికి వచ్చేదాకా ముఖంమీద ఉమ్మినా తుడుచుకొని వెళ్లిపోతా. మీకు ఇంకా కొత్త. ఏమీ తెలియదు. మేము ఏడు సంవత్సరాలనుండీ ఆయన దగ్గరే ఉన్నాము.

నా సలహా ప్రకారం మీరూ అలాగే డిగ్రీ చేతికి వచ్చేదాకా కిమ్మనకుండా ఉండాలి. లేకుంటే భ్రష్టులవుతారు. మీరు ఏదో ఆ ... ఆల్జీబ్రా మాస్టారు నారాయణగారి దగ్గర కూర్చుని మాట్లాడతారు. అది మాస్టారికి ఇష్టం ఉండదు. ఆయనేదో చాలా గొప్పవాడన్నట్లుగా ఉంటుంది. మీ బిహేవియర్ మొన్న ఇన్‌డైరెక్టుగా చెప్పనే చెప్పారు మాస్టారు. అయినా మీరు మానలేదు"

"ఆయన ఇష్టమేంటి? నేను నా ఇష్టమున్న వాళ్లతో మాట్లాడతాను. నారాయణ గారు నిజంగానే చాలా మంచాయన. ఎంతో ఫ్రెండ్లీగా ఉంటారు"

"సరే, మీ ఇష్టం వచ్చినట్టుండండి. ఆయనకు పోయేదేంలేదు. ఇకమీద మాత్రం నాతో మాట్లాడకండి" అని చెప్పి అవధాని వెళ్లిపోయాడు.

అతని వెనకాతలే, నిశాంత్ బయల్దేరి డిపార్ట్‌మెంట్‌కి వెళ్ళాడు. అయిదు నిముషాలలో చకచకా నవ్వు ముఖంతో సంతకాలు పెట్టేసి, రేపు నాలుగు గంటలకి, ఇంటి దగ్గరుండాలని గుర్తుచేసి వెళ్ళిపోయారు వామనరావు.

నిశాంత్‌కి టెన్షన్ అంతా పోయి గాలిలో తేలిపోయేటంత ఆనందం కలిగింది. దాంతోపాటే అవధానిమీద అమితమైన అభిమానం వచ్చింది.

"థేంక్స్ అవధానిగారూ! మీ వలనే సంతకం అయ్యింది"

"ఈసారినుండైనా మంత్లీబిల్ పెట్టుకోండి. అనవసరమైన ఆవేశాలు పెట్టుకోకూడదు. కేంపస్‌లో గోడలకు కూడా చెవులుంటాయి. చారేసేనోర్లున్నాయి. అది గుర్తుంచుకోండి"

ఎంత అమాయకుడో! నేను ఎందుకు జాగ్రత్తగా ఉంటాను. ఎన్నిసార్లు మనసు బాధపడలేదూ నాకు మాత్రం. పిహెచ్.డి. అయ్యేసరికి ముప్పైఏళ్లు దాటిపోతాయి. అప్పుడు ఎవడిస్తాడుద్యోగం. ఒకవేళ వచ్చినా డిగ్రీతో ఆపేసి ఉద్యోగం చేసేవాళ్లతో సమానంగా ఉండగలమా? యు.జి.సి. స్కేల్ తీసుకొంటేనే ఆ నష్టం కాంపన్‌సేట్ అవుతుంది. యూనివర్శిటీలో ఉద్యోగం కావాలంటే ఎన్ని బాధలు పడాలి. రేపు ఇంటర్వ్యూ బోర్డులో ఉండేది వీళ్లే. కనీసం ఒక్కరినైనా నమ్ముకొని ఉంటే అవకాశం ఉన్నప్పుడు పోస్ట్లే, మనం చెప్పినట్టు వినేవాడని దయతలచి ఇస్తారు. ఏమీ తెలియని నిశాంత్‌లాంటివాళ్లు, ఇలాగే ఆవేశపడతారనుకొన్నాడు. ఇదంతా మాత్రం పెదవిదాటి పైకి రానీయలేదు అవధాని.

"రేపు మీరు వస్తారుకదండీ" అన్న నిశాంత్‌తో "వస్తాను" అని చెప్పి వెళ్లిపోయాడు.

రేపు హెడ్‌చేత సంతకం పెట్టించి బిల్ ఆఫీస్‌లో ఇచ్చేయాలి అనుకొంటూ హాస్టల్ వైపు నడక ఆరంభించేసరికి గుర్తుకొచ్చింది మాస్టారు లైబ్రరీకి వెళ్లి జర్నల్స్ తెచ్చుకోమన్నారనే విషయం.

అయ్యో! మాస్టారు హడావుడిగా వెళ్ళిపో

యారు. బిల్లు సంతకం అయ్యేసరికి అన్నీ మరచిపోయాను. అని తననుతాను తిట్టు కొని, రేపు ఉదయాన్నే వచ్చి అడగాలనుకు న్నాడు.

మర్నాడు ప్రయాణం హడావుడిలో మాస్టారు కన్పించలేదు.

★ ★ ★

మెస్‌లో భోజనం చేసి, కావలసిన పుస్త కాలు తీసుకొని బయల్దేరుతున్న నిశాంత్ రూమ్‌లోకి జోగారావు వచ్చాడు.

జోగారావు తెలుగు ఎమ్. ఏ, పిహెచ్. డి. అయిన తర్వాత సోషియాలజీలో ఎమ్. ఏ. చేసి పిహెచ్. డి. లో చేరిన స్కాలర్.

జోగారావు రూమ్‌లోకి వస్తూనే బొటన వేలు, చూపుడువేలు కలిపి గుండ్రంగా చేసి కంటి దగ్గర పెట్టుకొని 'అదిరిపోయేవి' అన్నాడు.

అప్పుడప్పుడూ బ్లూఫిల్మ్ వేసుకోవడం వారికి అలవాటు. అలా వేసినప్పుడు అన్ని రూమ్‌లకీ వచ్చి చెప్తారు. నిశాంత్‌లాంటి వాళ్లు వెళ్లరు.

"నాకు పనుంది రాను" అన్నాడు నిశాంత్.

"ఋష్యశృంగా! నీ కోసం రాలేదు. మీ వోనరేడి?"

"వస్తాడులే. తొమ్మిదేగా అయింది"

ఇక్కడ వోనరంటే అర్జున్. ఆ రూమ్ అతనిదే. అర్జున్ రాత్రి మాత్రమే ఉంటాడు ఆ రూమ్‌లో. రూమ్ ఎలాట్‌కాని, నిశాంత్, పట్టాభిలాంటివారికేగాక, కాంపిటీటివ్ పరీక్షలు వ్రాయడానికి వచ్చే చాలామందికి ఆ రూమ్‌లో చోటు దొరుకుతుంది. అవసర మైన వారినందరినీ తన రూమ్‌లో ఉండ మని ఆహ్వానిస్తాడు అర్జున్.

నిశాంత్ ఎమ్. ఎస్‌సి. అయిపోయి, సి. ఎ స్. ఐ. ఆర్. వచ్చే మధ్యరోజుల్లో ఇంటికి వెళ్ల డానికి భయపడినప్పుడు అర్జునే 400 రూ. కి లెక్చరర్ ఉద్యోగం ఇప్పించి తన రూమ్‌లో ఉండమన్నాడు.

అప్పుడప్పుడూ పోలీస్ రెయిడింగ్ అయి నప్పుడు, వార్డెన్ చెక్ చేసినప్పుడు అంతా తలాదిక్కూ పోయి, మళ్ళీ మామూలుగా సర్దుకుపోవడం అందరికీ అలవాటే. నిశాం త్‌కి కొత్త. తప్పు చేస్తున్నాననే బాధ. దాంతో నూట ఏభైరూపాయలకి చిన్న రూమ్ అద్దెకి తీసుకొన్నాడు.

ఆ రూమ్ చూసిన అర్జున్- "వచ్చేది నాలుగువందలు అద్దె నూట ఏభై. ఎలా సరిపెట్టుకొంటావు. పైగా అయిదుగురు ఆడపిల్లలున్నవాడు వోనర్. ఎందుకొచ్చిన తంటా. నా రూమ్‌లో ఉండు. ఇంక మూడు నెలల్లో సి. ఎస్. ఐ. ఆర్. వచ్చేస్తుంది" అన్నాడు.

వస్తుందో, రాదో? అని నిశాంత్ సందే హించినా, నీకు రాకపోతే ఎవరికి వస్తుం దని మళ్ళీ రూమ్‌కి తీసుకువెళ్ళాడు.

అలా రూమ్‌లో అరడజను మందికి తక్కువ- కాకుండా ఎప్పుడూ ఉంటారు. ఆ రూమ్ ఎవరిదో కొత్తవారికి తెలియదు. జోగారావు మాత్రం కొంచెం పాతవాడు కాబట్టి అతనికి తెలుసు. అందుకనే సర దాగా 'వోనర్' అని అంటాడు.

అర్జున్ రూమ్‌లో లేకపోవడంతో చిన్న చీటీమీద సినిమా సంగతి రాసిపెట్టి వెళ్ళాడు జోగారావు.

జోగారావు పట్టాభి కోసం ఎదురుచూస్తు న్నాడు. వాళ్ళిద్దరూ ఒకప్పుడు మంచి స్నేహితులు. ఇప్పుడు మామూలు స్నేహి తులు. పి. జి. నుండీ ఒకే రూమ్‌లో ఉంటు న్నారు.

ఎమ్. ఏ. లో కృష్ణ అనే ఎమ్. ఎస్‌సి. బోటనీ అబ్బాయి, ప్రసాద్ అనే ఎలక్ట్రానిక్స్ అబ్బాయి వీళ్లతోపాటే ఉండేవారు. వాళ్లు నలుగురూ కలిసి ఉంటారని తెలిసినప్పుడు వాళ్ల ఆనందానికి అవధుల్లేవు.

వాళ్లు విశాఖ వచ్చింది పోటీపరీక్షలు రాసి మంచి ఉద్యోగాలు సంపాదించాలని. సైన్స్

ఆర్ట్సు వాళ్లం కాబట్టి కోచింగ్ అక్కరలే కుండా చక్కగా కలిసి ప్రిపేర్ అవ్వొచ్చు అనుకొన్నారు.

మొదటి నాలుగు నెలలు వాళ్ల వాళ్ల క్లాసెస్, ఫ్రెండ్స్, విశాఖబీచ్ అన్నీ వాళ్లని ఆకర్షించాయి. ఏదైనా నోటిఫికేషన్ వస్తే బాగుణ్ణు అనుకొనేవారు రోజూ. వాళ్ల సర దాకితోడు పెద్ద లైబ్రరీ. జోగారావు, పట్టాభి లకి పుస్తకాలంటే చాలా ఇష్టం. రాత్రి పగలు తేడా లేకుండా చదవడం- వాటిమీద చర్చలు చేయడం వాళ్లపని. కృష్ణ, ప్రసాద్ అవన్నీ ఎలా చదువుతారు బాబూ అనే వారు. ఇలా ఉంటుండగా ఎన్నికల సంరంభం ఆరంభమయింది.

జోగారావుకి హుషారెక్కువయింది. వాళ్ల తాతలనుండీ వాళ్ల వృత్తి ఎన్నికలలో నిలబ డడమే. సర్పంచ్, ఎమ్. ఎల్. ఏ., ఎమ్. పి. లదాకా అతని దగ్గర బంధువులు న్నారు. అసలు, వాళ్ల నాన్నకి వాళ్ల వూర్లోనే ఉండి రాజకీయాలలో తిరగాలనేదే కోరిక. కానీ చదువుమీద మోజుకొద్దీ అతను యూనివర్శిటీకి వచ్చాడు. పాలిటిక్స్‌లో సీటు రాకపోవడంతో ఏదైతేనేం అని తెలు గులో జాయిన్ అయ్యాడు.

డిగ్రీనుండీ జోగారావుకి ఎన్నికలలో నిల బడడం అలవాటే. వీడు ఇలా అయినా బాగుపడతాడని వాళ్ల నాన్న ఎలక్షన్ ఖర్చు కోసం డబ్బులు మస్తుగా ఇస్తాడు.

డిగ్రీకన్నా, పి. జి. లో పరిస్థితులు చాలా చిత్రంగా ఉన్నాయి. చాలా కులాలున్నా యని తెలుసుగానీ, మరీ చదువుకొన్నవారు కూడా, పబ్లిక్‌గా ఏ కులంవారు ఆ... అసో సియేషన్‌లో రిజిష్టరు చేయించుకొని, మన అసోసియేషన్ తరపున ఎవరు నిలబడతా రని నిర్ణయించడం, ఫలానా డిపార్ట్‌మెం ట్‌లో మన ప్రాబల్యం తక్కువగా ఉంది కాబట్టి అక్కడ ఎలాగైనా మనవాడ్ని నిల బెట్టి గెలిపించాలని అనుకోవడాలు- ఇవన్నీ జోగారావుకి కొత్తగా అన్పించినా, అతని సీని యర్ అతనిని బి. సి. అసోసియేషన్‌లో జాయిన్ చేసేశాడు. దాని తరపున నిలబడ డానికి కూడా వొప్పుకొన్నాడు.

మొదట చాలా సంతోషంగా, తననే నిల బెట్టారని కృష్ణ, ప్రసాద్, పట్టాభిలకి కేంటీ న్‌లో స్వీట్ పెట్టించాడు. కేన్వాసింగ్‌కి రావాలని చెప్పాడు. అందరూ అంగీకరిం చారు.

రెండు రోజులు నలుగురూ కలిసే వెళ్లారు. మూడోరోజు కృష్ణ, ప్రసాద్ రావడా నికి ఇష్టపడలేదు. మా మాస్టర్లు కన్పిస్తే బాగుండదు అన్నారు నెమ్మదిగా. సాధార ణంగా సైన్స్‌వాళ్లు దేంట్లోనూ అంటే ఆట లలో, ఎన్నికలలో ఎక్కువగా పాల్గొనరు. సైన్స్‌వాళ్లు కదా! పోన్లే, పాపం, అని వదిలే స్తారు.

మరో నాలుగు రోజులయిన తర్వాత పట్టాభి రావడం మానేశాడు. కారణం మాత్రం చెప్పలేదు. ఎండలో నడవలేను అన్నాడు. జోగారావు ఆ మాట నమ్మేడు.

కానీ, అసలు కారణం వేరు. పట్టాభి కమ్మకులస్థుడు. ఆ విషయం రీసెర్చి చేసి కనుక్కున్న కమ్మ అసోసియేషన్‌వాళ్లు వచ్చి నువ్వు మన అసోసియేషన్ తరపున ఉండా లిగానీ అలా బి. సి. వెనకాతల తిరగకూడ దని నూరిపోశారు.

"అబ్బే! అతను నా ఫ్రెండ్. చాలా మంచోడు. అతనికి బి. సి. ఫీలింగ్ లేదు" అని ఎంతగానో చెప్పాడు పట్టాభి. ఇక్కడ కులాలేటండీ, అని చిన్న సైజు లెక్చర్ ఇద్దా మనుకొన్నాడు. కానీ వాళ్లు వినకుండా వెళ్లి పోయారు.

సీనియర్స్ కూడా మనం స్ట్రాంగ్‌గా నిలబ డితే తోకలు ముడుచుకుపోయారు. అలా ఉండాలిరా. పట్టాభీ! అని తననితాను అభి నందించుకొన్నాడు.

సాయంత్రం రూమ్‌కి చేరుకొనేసరికి తన ఊరివాడైన సోంబాబు కన్పించాడు.



"హలో! బాగున్నావా? "

"ఆ! ఏమిటి కథ. ఊరెళ్తున్నాను. చెప్పమన్నావా మీ బాబుతో ఎన్నికలలో తిరుగుతున్నావని, బీచ్‌లో అమ్మాయిలతో కన్పిస్తున్నావని"

"అదేంటి? " అనేసరికి పొద్దున వచ్చినవాళ్లలో ఒకడు పక్కనుండీ-

"లేకుంటే ఏందయ్యా? లిల్లీపుట్‌లా ఉన్నావు. ప్రీవియస్‌వోడివి. నువ్వు కూడా వినవా? అర్థం చేసుకోవేమి? నా ఒక్కడి కోసం చెప్తున్నానా? నా ఒక్కడి కోసమే ఇంత టైమ్ వేస్ట్ చేస్తున్నానా? మనందరి బాగుకోసమేకదా!" అన్నాడు స్వతంత్రవీరుడి లెవిల్‌లో.

అప్పటికే భయంగా ఉన్న పట్టాభి పోలిటిక్స్‌వాడిననుకొని, ఆంధ్ర కేసరిని తలచుకొని-

"ఒక్కమాట అడగవచ్చునా అండీ? "

"ఊ" అన్నాడు గట్టిగా, పర్మిషన్ ఇస్తున్నా అన్నట్టుగా.

"నా ఒక్కడి కోసమేనా అన్నారుకదండీ. అలాగే ఒక్క కులంకోసమే ఎందుకు చేయా

లండీ? " అన్నాడు పట్టాభి.

దానికి కృష్ణ పరమాత్మలా ఓ నవ్వు నవ్వాడు.

"వెర్రి కుర్రా! నువ్వింకా చిన్నోడివి. నీకేమీ తెలియదు. ఇప్పుడు సపోజ్ బి.సి. వాళ్లు యూనియన్‌లో ఎక్కువయ్యేరనుకో... ఏటవుద్దీ? ఉద్యోగాలన్నీ వాళ్లవే. వాళ్ల రిజర్వేషన్ నింపుకోవడమేగాక, ఓపెన్‌లో కూడా మా వాళ్లకే ఇవ్వాలని వి.సి. మీదకి ప్రెషర్ తెస్తారు. ఏ వి.సి.కైనా లొసుగులుంటాయి. ఎవడైనా ముందున్నోడిని పడగొట్టి వచ్చేవాడేగా. దానికి ఎంత డబ్బు, ఎంత రాజకీయం, ఎంత కుళ్లు వాడాలంటావు? కాబట్టి ఈ వి.సి. కూడా వెధవపనులు చెయ్యక తప్పదు. నేచురల్‌గా వాడికీ అపోజిషన్ ఉంటుంది. దాంతో ఈ బి.సి. వాళ్లంతా ఆ అపోజిషన్‌తో కలసి- వెధవ పనుల చరిత్ర పైకితీసి దింపేయమంటావా? అంటారు. అప్పుడు చచ్చినట్టు వాళ్లకే ఉద్యోగాలు ఇస్తాడు.

వీళ్లు ఒక్కసారి టీచింగ్ అయినా, నాన్ టీచింగ్ అయినా ఇకమీదటంతా వాళ్లవాళ్లే వస్తారు. ఒకసారి దూరారంటే అరవైఏళ్లు వచ్చేదాకా-

"వేపకొమ్మని వేస్తే అమ్మోరు అయికూర్చున్నట్టు"గా ఇక కదలరు.

అక్కడనుండీ అన్నీ వాళ్లవాళ్లకే. మార్కులు వాళ్లకే. డిగ్రీలు వాళ్లకే. ప్రాజెక్టులు వాళ్లకే. ఉద్యోగాలు వాళ్లకే. ఆఖరికి వి.సి.లు కూడా వాళ్లవాళ్లే అవుతారు. ఓ నాలుగు లక్షలుగవర్నమెంటోడికి లంచం తినిపించడం, వి.సి. ఛైర్ ఎక్కేయడం. అప్పుడు మనపని రామభజనే"

ఇంతలో అతని వాక్ప్రవాహాన్ని ఆపుతూ ఎవరో వచ్చారు.

"ఇంతసేపు నా టైమ్ వేస్ట్ చేశావు. మాతో రాకుంటే మానేయ్. కానీ వాళ్లతో మాత్రం వెళ్లకు" అని హెచ్చరించి వెళ్లిపోయాడు.

జోగారావు గెలవాలని ప్రార్థించి మరీ... వెళ్లడం మానేశాడు పట్టాభి ఎందుకైనా మంచిదని.

★ ★ ★

ఈ ఎన్నికల హడావుడిలోనే పబ్లిక్ సర్వీస్ కమిషన్‌వాళ్ల గ్రూప్ ఒన్ నోటిఫికేషన్ వచ్చింది. కృష్ణ, ప్రసాద్ మహా ఆనందించారు. జోగారావు ఎన్నికల హడావుడిలో పెట్టలేదేమోనని, వాళ్లే డ్రాఫ్ట్ కట్టి అప్లికేషన్స్ పోస్ట్‌చేసి ఉద్యోగం వచ్చినంత ఆనందించారు.

ఎన్నికలయ్యేదాకా చదువు సరిగా అవదు. ఇవి అయిపోయిన తర్వాత, ఒక ప్రణాళిక ప్రకారం బాగా చదవాలనుకొన్నారు. అప్పటికి జోగారావుకి కూడా తీరుబడి అవుతుందనుకొన్నారు.

ఎన్నికలు అయ్యాయి.

జోగారావు గెల్చాడు. గెల్చిన హడావుడిలో మరో నెల ఇట్టే గడిచిపోయింది. జోగారావుకి తాను గెల్చిన విషయం కేంపాస్‌లో సాధారణ విషయంగా మారడంతో-

ఇంట్లోవాళ్లతో ఆ... ఆనందం పంచుకోవాలనుకున్నాడు.

సీనియర్స్ ద్వారా హోమ్‌సిక్ హాలీడేస్ ఇస్తారని తెలుసుకొని పదిమందిని వెంటేసుకొని హెడ్ దగ్గరకి వెళ్లాడు. యూనియన్ మనిషని హెడ్ మారుమాట్లాడకుండా ఇచ్చాడు.

జోగారావు ఇంటికి వెళ్లడం నచ్చలేదు కృష్ణకి.

"టైమ్‌టేబుల్ అయినా వెయ్యలేదు. ఇప్పుడు నువ్వు వెళ్లిపోవడమేమిటి? " అన్నాడు సీరియస్‌గా.

"ఒక్కవారం బాబ్బాబూ!" అని బ్రతిమిలాడి.

"ఈలోగా మీరు మొదలెట్టండి" అని వెళ్లిపోయాడు.

రెండురోజులు కష్టపడి హిస్టరీ చదవడం

మొదలెట్టారు. అంత సిలబస్ ఎప్పటికవు తుందో అనిపించింది.

ఈలోగా శ్యామ్‌సుందర్ అనే మాస్టారు ప్రసాద్ క్లాసుకి వచ్చి, ఎలక్ట్రానిక్స్ ఉప యోగం, దానివలన దేశానికి, వాళ్లకి ఉన్న ఉజ్వలభవిష్యత్తు కళ్లముందు కన్పింపజేసి, పాఠం మొదలెట్టి ఒక అరగంట చెప్పి ఆనాటికి వదిలేశారు. ఇంకో గంట చేస్తే బాగుణ్ణు అన్పించింది.

అంతలా... మృదువైన కంఠంతో, చక్కని ఇంగ్లీష్‌తో బ్రెయిన్‌లో ప్రింట్ అయినట్టుగా చెప్పిన ఆయనకి నిజంగా నమస్కరించాల న్పించింది ప్రసాద్‌కి.

కేంపాప్, కేంపాసే... అదృష్టం కొద్దీ ఈ మెట్టు ఎక్కాను. కష్టపడి చదవాలను కొంటూ రూమ్‌కి వచ్చాడు.

రూమ్‌కి వచ్చేసరికి కృష్ణ ఎ.పి.పి.య స్.సి. గైడ్ పట్టుకొని కన్పించాడు. బాబోయ్! ఆ చెత్త చదవమంటాడేమో! ఇప్పుడు తన బుక్ చదవాలని మంచి మూడ్‌లో వచ్చాను. రేపు శ్యామ్‌సుందర్ గారి క్లాస్ ఉంది. కాస్త చదివి వెళ్తే బాగుం టుందని-

"కృష్ణా! నేనీరోజు చదవలేను. కాస్త వర్క్ ఉంది" అని చెప్పాడు.

అలా నాలుగురోజులు గడిచాయి. తన సబ్జెక్ట్ ఇంట్రస్ట్‌గా ఉండటంతో పరీక్ష మాటే మరచిపోయాడు.

పట్టాభి కూడా శ్రద్ధ చూపడం మానే శాడు. పైగా కృష్ణ అడిగితే-

"ఏ.పి.పి.ఎస్.సి.వి వచ్చి చచ్చే ఉద్యోగాలు కావు. పైగా లక్షలమంది పెట్టారు. అంతేకాదు పోస్టులు అమ్మేస్తారు. మనమే మన్నా కొనగలమా? ఎందుకు ఊరికే శ్రమ.

అదీగాక, నేనో వ్యాసం వ్రాయాలి. మా మాస్టారు చాలా ఛాలెంజింగ్‌గా అన్నారు. నన్నొదిలేయ్. మళ్లీ పరీక్షకి కలిసి చదువుదాం" అన్నాడు.

జోగారావు రూమ్‌లో ఉండేదే తక్కువ యింది. ఇలా... అంతా జారుకొనేసరికి పరీక్ష నెలరోజులకి వచ్చింది. దాంతో కృష్ణకి నెలలో సిలబస్ ఎలాగూ అవదు అన్పిం చింది. అయినా ఆశ చావక లైబ్రరీలో రెండుగంటలు దానికోసం కేటాయించాడు.

ఒకరోజు పక్కన కూర్చుని చదువుతున్న తనని చూసి ఇతనూ గ్రూప్ వన్‌కే ప్రిపేర్ అవుతున్నాడనుకొని పలకరించాడు. తీరా, అతను బేంక్ పరీక్షకి ప్రిపేర్ అవుతు న్నాడు.

"ఎప్పుడు పడిందండీ?" అన్నాడు ఆశ్చ ర్యంగా కృష్ణ.

"ఇంకా పడలేదండీ. అయిదారు నెలల్లో పడుతుంది"

"మరి ఇప్పటినుండే?"

"భలేవారే! గట్టిగా ఆరునెలలు ప్రిపేర్ అవకుండా వెళ్లడం అనవసరం. ఎంత కాంపిటీషన్... కొత్తలో అంతా మీలాగే అనుకొంటారు. ఏముందీ? కూడికలేగా! లక్ తగిలితే కొట్టేస్తామని... పరీక్షలు రాసే స్తారు. రాకుంటే ఎక్స్‌పీరియన్స్ వచ్చిందను కొంటారు" అని చిన్నసైజు గీతోపదేశం చేసేసరికి,

ఈ వెధవగోల వదిలి బేంక్ పరీక్షలే లక్ష్యంగా పెట్టుకొందాం అనుకొన్నాడు కృష్ణ. అతనితో కలిసి నాలుగయిదు పరీక్షలు రాసి మొత్తానికి ఎమ్.ఎస్సి. గురించి పెద్దగా పట్టించుకోకుండా పి.జి. అయ్యేసరికి బేంక్‌లో ఉద్యోగం సంపాదించాడు.

పట్టాభికి ప్రీవియస్‌లోనే తన వ్యాసాలు జర్నల్స్‌లో పడడంతో మాస్టర్ల ప్రోత్సా హంతో తన సబ్జక్ట్ చదువుతూ, పోటీ పరీ క్షలకి కొన్నాళ్లు అప్లై చేసి ప్రతిసారీ ఎక్స్‌పీ రియన్స్ వచ్చిందనుకోవడం దేనికని, అప్లై చెయ్యడం మానేశాడు.

ప్రసాద్ రీసెర్చి చేస్తానని నిర్ణయించుకొని పరీక్షలు వ్రాయడం మానేశాడు. ప్రసాద్ సి.ఎస్.ఆర్. ఫెలోషిప్‌తో పి.హెచ్.డి.

సీటు సంపాదించాడు. అది శాంక్షన్ అయ్యే దాకా అక్కడా, ఇక్కడా ట్యూషన్స్ చెప్పి ఆ రూమ్‌లోనే కాలక్షేపం చేశాడు.

జోగారావు, పట్టాభిలకి ఫెలోషిప్ రాలేదు గానీ పిహెచ్.డి. సీట్లు వచ్చాయి. ఎమ్.ఎ. అయ్యాక ఇంటికి వెళ్లిపోవడంవలన యు.జి.సి. పరీక్షకి ప్రిపేర్ అవలేకపోయానని మళ్లీ రాద్దామనుకొన్నాడు పట్టాభి.

జోగారావుకి పరీక్ష ఊసేలేదు. కేంపాస్‌లో అతడిని పోషించేవాళ్లున్నారు. వాళ్లే సీటు ఇప్పించారు కాబట్టి ఉన్నాడు. ఎమ్మేలో తమచేత వ్యాసాలు ప్రోత్సహించిన మాస్టారి దగ్గర ఖాళీలేక మరో సాయిరాజ్ అనే అతని దగ్గర చేరాడు పట్టాభి.

"ఏదో చదువుకోవయ్యా? " అంటూ ఉండే అతడు ఎప్పుడూ మందుమీదే ఉంటాడు.

దాంతో టాపిక్ నిర్ణయించేసరికి ఏడాదయ్యింది. ఏదో ప్రీ పి.హెచ్.డి. అయిందనిపించేడు గానీ, తర్వాత ఎక్కడ వేసిన గొంగళీ అక్కడే.

ఎప్పుడు వెళ్లినా, ఈరోజు స్పాట్ అనో, ఎమ్.ఫిల్. వాళ్లు వస్తున్నారనో... ఏదో ఒకటి చెప్తాడు తప్ప వర్క్ విషయం ఏదీ పట్టించుకోలేదు సాయిరాజ్.

దాంతో అప్పుడప్పుడూ వెళ్లి విష్ చెయ్యడం, తర్వాత సినిమాలకి లైబ్రరీకి పోవడం మొదలెట్టాడు పట్టాభి.

కొన్నాళ్లయ్యేసరికి కాస్త ఎక్కువసేపు కన్పిస్తే- 'ఒక్కసారైనా పార్టీ ఇచ్చావా? ' అని మొదలెట్టసాగాడు సాయిరాజ్.

ఆ దెబ్బకి పట్టాభి కన్పించడం మానేశాడు. సాయిరాజ్ లేనప్పుడు వెళ్లి నెలా రెండు నెలల సంతకాలు ఒకేసారి పెట్టి లైబ్రరీకి వెళ్లి వర్క్ చేసుకోవడం మొదలెట్టాడు.

మరోసారి యు.జి.సి. రాసి జె.ఆర్.ఎఫ్. తెచ్చుకొన్నప్పుడు మాత్రం గైడ్, పట్టాభి కలసి పార్టీ చేసుకొని ఆనందించారు.

రెండు, మూడు నెలలయ్యేసరికి 'పార్టీ మరీ చప్పగా ఇస్తున్నావనే' గొణుగుడు ఆరంభమయింది. వచ్చిన డబ్బంతా వీడి కిందే అయిపోతుందే అని తిట్టుకొన్నా ఏం చేయలేక ఊరుకొన్నాడు పట్టాభి.

వచ్చిన డబ్బులో ఎక్కువభాగం పట్టాభే వాడుకొంటున్నాడనే దుగ్ధతో సంతకాలు పెట్టడానికి మనసొప్పలేదు సాయిరాజ్‌కు. అయినా పి.హెచ్‌డి.కి కావలసిన మెటీరియల్ సిద్ధం చేశాడు పట్టాభి. అదంతా చూపించినా, చలించలేదు సాయిరాజ్. యు.జి.సి.వాళ్లు వర్క్ రిపోర్ట్ పంపమని అడుగుతూనే ఉన్నారుగానీ సాయిరాజ్‌కి మందు మీదున్న ప్రీతి మరిదేనిమీదా లేదు.

ఏమిచెయ్యాలో తెలియని పట్టాభి విసుగెత్తి లైబ్రరీకి వెళ్లడం మానేశాడు. ఇలా నాలుగు సంవత్సరాలు ఈజీగా గడిచిపోయాయి. అప్పటికి ఉద్యోగం వస్తే బాగుణ్ను, ఈ రీసెర్చి వదిలేసి పెళ్ళిచేసుకోవచ్చు అనే స్థితికి వచ్చాడు పట్టాభి.

ఎ.పి. కాలేజ్ సర్వీస్ కమీషన్ వాళ్ళు ఎట్టకేలకు నోటిఫికేషన్ ఇచ్చారు. అంతా హుషారుగా పెట్టారు. నాలుగయిదేళ్ళబట్టీ తన రీసెర్చి టాపిక్ తప్ప మిగతావేవీ కనబడనీయకుండా అర్జునుడిలా ఏకాగ్రతతో చూడడంతో వాళ్లకి ఒక్కసారి మిగిలిన సబ్జెక్ట్‌లన్నీ గతంలో కలసిపోయాయి. ఫ్రెష్‌గా పి.జి. చేసిన వాళ్ళుమాత్రం అన్ని పేపర్స్‌తో టచ్‌లో ఉండడంవలన బాగా రాసారు.

రేంక్ స్టూడెంట్‌గా చాలా తెలివయినవాడన్పించుకొన్న ప్రసాద్ కూడా అదేస్థితిలో ఉన్నాడు. అతన్ని శ్యామ్‌సుందర్‌లాంటి మంచి మాస్టరు కూడా ఇప్పుడు అస్తమానం తిడుతూ, చీదరించుకొంటూ, ఏవో పనికిమాలిన పనులు చెప్తూ, అతనిరాకనే సహించలేకపోతున్నాడు.

చెట్టుపేరు చెప్పుకొని కాయలు అమ్ముకొన్నట్టు యూనివర్శిటీలో రీడర్ అనే లేబుల్‌తో ఎమ్.సెట్ కోచింగ్ సెంటర్‌లో చేరి

వేలకివేలు సంపాదనలో మునిగిపోయాడు.

ప్రసాద్‌లాంటివాళ్ళు, రీసెర్చి అని జిడ్డుగా పట్టుకోవడంవలన తప్పనిసరై అప్పుడప్పుడూ కొద్దిసేపు కూర్చోవడం, తర్వాత విసుక్కోవడం చేస్తున్నాడు.

తను కాన్ఫరెన్స్‌కి వెళ్లి సబ్మిట్ చెయ్యవలసిన పేపర్ వర్క్ కూడా ప్రసాద్‌కే పూర్తిగా అప్పచెప్పాడు. మూడు నెలలు అహోరాత్రులు కష్టపడి, జిరాక్స్‌కీ వాటికీ అయిదారు వందలు ఖర్చుపెట్టి, పేపర్ తయారుచేశాడు ప్రసాద్.

కాన్ఫరెన్స్‌కి టి.ఏ., డి.ఏ.లు ఇవ్వరనడంతో వెళ్ళడం మానేసి, పేపర్ బీరువాలో భద్రంగా పెట్టేడు. ఏ జర్నల్‌కైనా ఇద్దరి పేర్లూపెట్టి పంపిస్తాడేమోనని చాలా ఆశపడి, ఆగలేక రెండుమూడుసార్లు అడిగాడు ప్రసాద్. అలాగేనని చెప్పి, తన ఒక్కడిపేరు మీద జర్నల్‌లో వేయించుకొన్నాడు.

దాంతో అసహ్యం వేసిన ప్రసాద్ జె.ఎల్ వస్తే పోతాను అనుకొన్నాడు. పరీక్ష పాసయి, ఇంటర్వ్యూకి వెళ్లాడు. వాళ్లు రీసెర్చిమీద తప్ప ఏవో అడిగారు. సరిగా చెప్పలేకపోయాడు. పి.జి. అయినవెంటనే అయితే బ్రహ్మాండంగా ఉండేదనుకొన్నాడు. అయినా ఇంటర్వ్యూ తక్కువ మార్కులకే కాబట్టి ఉద్యోగం వస్తుందేమోనని ఆశపడ్డాడు.

★ ★ ★

ఏ.పి.పి.యస్.సి, జె.ఎల్.ఇంటర్వ్యూకి వెళ్ళినట్టే అంతా మరచిపోయారు. ఏడాదిన్నర తర్వాత రిజల్ట్సు వచ్చాయి. రాతపరీక్ష పాస్‌అవని జోగారావు బ్లూఫిల్మ్ వేస్తున్నారని ఎదురుచూసే రోజు అదే.

పక్కన పట్టాభి లేకుంటే మజా రాదు జోగారావుకి. పన్నెండు అయిపోతే మిగతా వాళ్ళు ఆగరు. ఒక్కసారి కిందకి వెళ్ళి చూస్తాననుకొని వస్తుండగా,

నడవలేక, నడవలేక తూలుతూ పట్టాభి, ప్రసాద్ గొణుక్కొంటూ వస్తున్నారు.

"మజాఫిల్మ్‌పైకి రండి. బిగిన్ అయిపోతుంది" అంటూ చెయ్యిపట్టుకొన్నాడు జోగారావు.

'మజా' అని వినబడగానే ప్రసాద్,

"ఏట్రా మజా? ఎవడికిరా మజా? ఏముందిరా? గైడ్ ముండాకొడుకు తిట్లు మజానిస్తాయిరా? నే సచ్చిపోతానురా! నే బతకను. నేనీబాధలు పడలేనురా!" అంటూ తల గోడకి బాదుకోవడం మొదలెట్టాడు.

వెంటనే జోగారావు దగ్గరగా తీసుకొని,

"బాధపడకు ప్రసాద్! ఇయ్యాల కాకుంటే రేపు. నువ్వు మంచి పొజిషన్‌లో వుంటావు. నే చెప్తున్నా ఇనుకో"

ఆ మాటకి వెక్కివెక్కి ఏడుస్తూ,

"ఏటిరా మంచిరోజులు. పి.హెచ్.డియా అవకపోయె, ఉద్యోగమా, రాకపోయె.

ఆ శ్యామ్‌సుందరగాడు ఎమ్.ఎస్‌సిలో ఇంచక్కా ఉండేవాడా? ఇప్పుడు నాకు మొగుడులా తయారయ్యాడు.

పెళ్ళాన్ని చూస్తే పెత్తనం చెయ్యాలన్పిస్తుంది. స్కాలర్‌ని చూస్తే నొక్కేయాలన్పిస్తుంది.

వొట్టి అనుమానం మొగుడురా. పక్క ప్రొఫెసర్ రూమ్‌కి వెళ్ళి పదినిముషాలు కూర్చుంటే ఏవి చెప్పేనో అని భయం. ఆడు మళ్ళీ ఈ రీడర్ నాకొడుక్కి ప్రొఫెసర్ అయ్యేటపుడు ఛైర్మన్‌గా ఉంటేనో!"

"ఆ ప్రొఫెసర్ కూడా మనదగ్గర అయ్యో! పాపం! అని మాట్లాడేసరికి మనము ఐస్ అయిపోతాముగాని, మనం అన్న మాటలన్నీ అందరికీ చెప్పి, వాడి చెవులకీ చేరుస్తాడు. వాడంటే వీడికి పడదు. వీడంటే వాడికి పడదు. ఈ రీడర్ నా కొడుకు, ఆ ప్రొఫెసర్ నా కొడుకు ఇయ్యాల ఏమన్నారో తెలుసా?

ఒరేయ్, చెప్పనియ్యి. నేనేవీభయపడను. ఈరోజునుండీ ఎవ్వరికీ భయపడే

మాటేలేదు. నాకు గీర ఎక్కువయిపోయి జె.ఎల్.పోస్ట్ రాలేదుట. ఆ శీనూగాడికి వచ్చిందట"

"ఇదిగో, నీకు తెల్దూ! వాడికి రెండుసార్లు ఎమ్.ఎస్‌సి పోతే, బాధపడకు అని చెప్పి, వాడికి నోట్సు రాసిపెట్టి చదివించి, పాస్ చేయించాను, నేనేకదా! అళ్ళింట్లో చదువంటే ఏటో... తెలియదని సొంతతమ్ముడిలా చూడలేదూ!" అంటూ, అంతలోనే ఇంకా రెచ్చిపోయి,

"కోటానాకొడుకురా... వాడికి రాకపోతే నాకు వస్తుందా? జె.ఎల్. తెచ్చుకోలేనోడివి రీసెర్చి చేస్తున్నావా? అని ఎలా నవ్వేడో తెలుసా? "

"కోటాగాళ్ళకి ఏమిరా? ఎంత వయసొచ్చినా ఫరవాలేదు. ఈ గైడ్‌ముండాకొడుకులు మనల్ని వదిలేసరికి మనం ముసలోళ్ళమయిపోతాము, పోనీ, మనకీ వయసుతీసేయొచ్చుగా. నేను, పి.ఎమ్. నయితే మొదటదే చేస్తాను. ఒక్కటి సెప్పు. నాకు ఆ శీనూగాడికన్నా సబ్జక్టరాదా? నేను చదవకుండా తిరిగేనురా? కోటాలో వాడు కొట్టేసాడు గానీ..." అంటూ అతివేగంగా, గట్టిగా, ఆవేశంగా మాట్లాడడంవలన అలసిపోయి నిలబడలేక జోగారావు కాళ్ళదగ్గర పడిపోయాడు.

"అయ్యో! లే!" అంటూ లేవనెత్తి.

"నిజమే! వాళ్ళ కోటా మరీ అన్యాయంరా! ఫీజులు ఫ్రీ, భోజనం ఫ్రీ, వయసు ఫ్రీ... అన్నీ ఫ్రీయే. మనసొమ్మేకదరా! మనకి రావలసిన ఉద్యోగాలే కదా" అని జోగారావు అనేసరికి చతికిలబడిన పట్టాభి,

తారాజువ్వలా లేచాడు.

"ఓయబ్బో! ఏటిరా, చెబుతున్నావు. కోటాగాళ్ల గురించా? నీకు లేదా? నాకన్నా ఎక్కువ కోటాయే కదరా! మరెందుకు ఏడుపు? రిజర్వేషన్‌లకి ఏంటీగా స్ట్రైక్ చేసినపుడు, నువ్వు ఎట్టా తప్పించుకొన్నావో మాకు తెలీదా? "

"ఒరేయ్! మీరంతా కులం పిచ్చోళ్లే. ఏకులపోడికి ఆకులపోడే గైడ్. మీకులపోడెవడో, ఏదో రాసిన చెత్తకూడా, ఘనంగా రాసేడని చెప్పి ఆడిమీదే రీసెర్చి చేసేస్తారు. ఛీ, మీ సంగతేడికి తెల్దు" అని చీదరించుకొనేసరికి,

"ఎట్రా పేల్తున్నావు? ఏదో ఫ్రెండ్‌వి. తాగినోడివని ఊరుకొంటుంటే... ఎముకలు తీయించీగలను. మీలాగే ప్రజల సొమ్మంతా దోపిడీ చేసినోళ్లంకాదు. ఆస్తులుండీ ఉద్యోగాలకి ఎగబడలేదు. నీబాబు సంగతి ఏడికి తెలీదు. ఆ రెడ్డిగాడిని అడిగితే మీ యవ్వారం అంతా బయటపెడతాడు" అని జోగారావు అన్నాడు.

తాగి ఉన్న పట్టాభి కోపంతో కాలర్ పట్టుకొన్నాడు.

విదిలించుకొని ఒక్కతోపు తోశాడు జోగారావు.

వాళ్ళ కొట్లాట చూసేసరికి మత్తులో ఉన్న ప్రసాద్ భయపడిపోయి,

"వద్దర్రా" అంటూ మధ్యలో దూరాడు.

"నంగనాచి యెధవా! నీవలనే గదరా వచ్చినది. బాపన వెధవలు. మీకు పబ్లిక్‌గా పెట్టే ధైర్యం లేదుగానీ మన క్యాస్ట్ అనుకొని మీరంతా గూడుపుఠాణీ అవడం ఎవరికీ తెలియదనుకొంటారే..." అని జుత్తు పట్టుకొని తోసేశాడు జోగారావు.

రూమ్‌లలోనుండీ అప్పటికే చాలామంది బయటకి వచ్చేరు.

"కోటాగాళ్లని' నోటికి వచ్చినట్టు పేల్తున్నావా? " అంటూ ఎస్.సి. అసోసియేషన్ సెక్రటరీ, జోగారావు కాలర్ పట్టుకొన్నాడు.

మొత్తానికి, వాళ్లూ వీళ్లూ కలిసి దొరికినవాళ్లు దొరికినట్టు చితగొట్టుకొన్నారు. మరి కొద్దిసేపటిలో పోలీసులు రంగప్రవేశంచేసి అక్కడ ఉన్నవాళ్లందర్నీ పట్టుకుపోయారు.

మర్నాడు పేపర్‌లో 'కుల కొట్లాటలతో వర్సిటీ' అన్న హెడ్డింగుతో వార్త తాజాగా

అందివ్వడం, వి.సి. గార్ని విలేఖరులు ప్రశ్నించడం, ఆయన రొటీన్‌గా సమాధానం చెప్పడం, వాళ్లని విడిపించడం అన్నీ షరా మామూలుగా అయిపోయాయి.

మూడు- నాలుగు రోజులు మాత్రం అంతటా ఇదే చర్చ. బి.సి.వాళ్ల దగ్గర వాళ్లని సపోర్ట్ చేస్తూనూ, ఎస్.సి.ల దగ్గర వాళ్లనే సమర్థిస్తూనూ, బ్రాహ్మణుల దగ్గర 'మీరు మరీ అన్యాయం అయిపోతున్నా'రనీ ఇలా కాలక్షేపం చేస్తున్నారందరూ! ఏ కులమో తెలియని చోట మాత్రం గవర్న మెంటుని తిడుతూ, కొంతమంది కాలక్షేప బఠాణీలు నమిలారు.

అసలు విషయం తెలిసిన రాజు మాత్రం ప్రసాద్ రూమ్‌కి వెళ్ళాడు.

అతనిని చూసిన ప్రసాద్ నేను తాగి పేలిన సంగతి తెలిసే ఉంటుందనుకొని గిల్టీగా ఫీలయ్యాడు.

రాజు మాత్రం మెత్తగా నవ్వి,

"ఎటైనా వెళ్తున్నారా? " అని అడిగాడు.

"లేదండీ, కూర్చోండి" అంటూ తనూ కూర్చున్నాడు.

"మీరూ, చాలా ఆవేశపడ్డారుట. నేను ఎస్.సిల తరపున మాట్లాడడానికి రాలేదు. అపార్థంచేసుకోకండి. మీ ఆవేశం సహ జమే. ప్రతిభ ఉండి ఉద్యోగం రాకుంటే ఎవర్నికైనా బాధే. మీస్థానంలో ఎవరున్నా అలాగే ఉంటారేమో? " అని సానుభూతిగా మాట్లాడేడు రాజు.

ఎప్పుడూ పుస్తకాల ముందుండే తను జైలుకి వెళ్లడం, తాగి అసహ్యంగా మాట్లా డడం వలన డిప్రెషన్‌లో ఉన్న ప్రసాద్‌కి కళ్ళనీళ్ల పర్యంతమయింది.

అతికష్టంమీద దుఃఖాన్ని ఆపుకొని,

"చూడండి... ఎన్ని ఉత్తరాలో! ప్రతి ఉత్త రంలోనూ నేనేదో సంపాదించి తనకి సాయం చేస్తానని ఆశపడే మానాన్నే! ఈ ఉద్యోగానికి ఇంటర్వ్యూకి వెళ్లినపుడు, వచ్చే సినట్టే సంతోషించారు కూడానూ.

"నిజంగా, ఈ వెధవ పి. హెచ్.డిలో చేర కుండా ఇంటిదగ్గరే ఉన్నట్లయితే ట్యూషన్స్ చెప్పయినా బోల్డు సంపాదించేవాడ్ని.

"పి. హెచ్. డి. ఆశతో ఆరు సంవత్సరాలు గడిపాక ఇది మానేసి వెళ్లనూలేను, ఉండ నూలేను. ఎంత నరకమో, మీకు తెలి యదు. పోనీ ఫారెన్ వెళ్దామంటే చేతిలో పైసాలేదు. అక్కడ వర్క్ ఎలా ఉంటుందో? తీరా, ఏ ప్రొఫెసర్ దగ్గరో అప్పుచేసి వెళ్ళాక తీరుద్దామంటే సక్సెస్ అవు తానో, లేదో! అక్కడ అన్నీ మొదటినుండీ చదవాలంటే ఎంతకష్టం. ఇవి, ఇవన్నీ ఎవ రికీ అక్కర్లేదు" అన్నాడు చాలా బాధగా.

"నిజమే! చాలామంది స్కాలర్స్ పడు తున్న బాధలే ఇవి. మీకు ఒక్కరికే లేవు గదా! మన మేధాశక్తి సరిగా వాడే అదృష్టం లేదు మనకి. ఇది చాలా బాధాకరమే. కానీ తప్పక ఏదోరోజు మంచి అవకాశం వస్తుంది.

"అంతేగానీ ఇలా డిప్రెషన్‌లో పడిపోయి, తాగేసినంత మాత్రాన సమస్య పరిష్కారం కాదుకదా! అదీగాక, మనలో మనం కొట్టు కొంటే ఏమిటి లాభం? శ్రీను, గురూజీ! అని మిమ్మల్ని ఎంత గౌరవిస్తాడు? ఓరోజు వాళ్ల ఇంటికి వెళ్ళారు గదా వాళ్లస్థితి చూసి ఆరోజు ఏమన్నారు మీరు?

"అటువంటి కుగ్రామం నుండీ వచ్చిన అతను యూనివర్శిటీకి రావడమే గొప్ప అన్నారే. ఆరోజు మీరేగా తరతరాలుగా వెనకబడినవారి ఐ. క్యూ. ఒక్కసారిగా పెంచలేము కాబట్టి కనీసం, ఆర్థికంగా సాయం చేయాలని, రిజర్వేషన్ ఉండా లనీ... అన్నారే.

"మరి అలా మాట్లాడిన మీరే, ఈరోజు ఇలా..."

"ఛా, శీనుకి వచ్చినందుకు ఏడవలేదండీ. అతనికి వచ్చినందుకు నేనెంతో సంతోషి స్తున్నా..." అంటుండగానే శ్రీను లోపలికి

వచ్చాడు.

ప్రసాద్‌లేచి, అతని చేతులు పట్టుకొని,

"ఐయామ్ సారీ! నేను రీసెర్చికి పనికిరా ననేసరికి తట్టుకోలేకపోయాను. అటు రీసె ర్చికీ పనికిరాక, ఇటు ఉద్యోగమూలేక ఏమ యిపోతానో అనే భయంతో అసహ్యంగా బిహేవ్‌చేసా. నన్ను క్షమించు" అన్నాడు.

వెళ్ళిపోవడానికి సిద్ధపడిన రాజుతో,

"రాజుగారూ! థేంక్స్! మంచి మిత్రుణ్ణి పోగొట్టుకోకుండా చేసారు. అందుకేనేమో మిమ్మల్ని అందరూ అంబేద్కర్ అని పిలు స్తారు" అన్నాడు కృష్ణ.

రాజు మొహమాటంగా నవ్వాడు.

★ ★ ★

లైబ్రరీకి వెళ్తోంది సమీర. కేంటీన్ దగ్గర నుండీ ఆమెని చూసిన జలజ,

"ఏయ్! సమీరా!" అని పిల్చింది.

వచ్చిన సమీరకి "మా ఫ్రెండ్ తేజ" అని ఒక అమ్మాయిని పరిచయం చేసింది.

తెల్లగా, బొద్దుగా, కొద్దిగా పొట్టిగా అన్పించే తేజ నీరసంగా కన్పించింది.

"మాజాతిపక్షే" అంది జలజ.

"అదేంటి? " అంది అర్థంకాని తేజ.

"స్కాలర్స్ జాతని అంటుంది సమీర. ఎప్పుడూ విసుగ్గా, చికాగ్గా ఉంటామని, ఆమె అభిప్రాయం"

"అవున్లే, ఒకపక్క వర్క్‌ప్రెషర్. ఇంకో పక్క ఏవేవో వెధవ సమస్యలూను, అంద రికీ" అంది తేజ దిగులుగా.

"వదిలేయ్, తేజా!" అని,

"సమీరా! అర్జెంటుగా అద్దెకి ఇల్లుకావాలి. అయిదు వందలలోపు అద్దె ఉండాలి. ఒక్క గదైనా చాలు. మావైపు అంత తక్కువలో దొరకవు"

"ఇంతకీ ఎవరికి? "

"తేజకి కావాలి"

"హాస్టల్ ఉందిగా!" అంటూ ఆమె మెడలో నల్లపూసలు చూసి,

"పెళ్లయితే హాస్టల్‌లో ఉండకూడదా? ... ఆ నల్లపూసలు తీసేసి, హాయిగా హాస్టల్‌లో ఉండండి. ఇల్లు సరదా ఏంటి? వండుకో వడం, తినడం. ఇంతేగా!" అంది విసుగ్గా.

"ఆమెని ప్రస్తుతం హాస్టల్‌లో ఉండని వ్వరు" అంది జలజ.

"ఎందుకు?"

"అబ్బబ్బ! యక్షప్రశ్నలు వేస్తావు" అని జలజ అనడంతో చిన్నబుచ్చుకొని ఊరు కొంది సమీర.

ఆమె ముఖం చూసిన తేజ,

"అదేంటి? ఆమెని హెల్ప్ చెయ్యమని, ఆమెనే తిడతావు" అంది.

"పోనీ, మీరు చెప్పొచ్చుగా"

"చెప్పొచ్చు..." అంటూ నసిగి,

"నాకు మూడోనెల. ప్రెగ్నెన్సీ అయితే హాస్టల్‌లో ఉండకూడదు" అంది తేజ.

"ఏంటి? ఏవి తొందర? రీసెర్చి అయ్యే దాకా ఆగొచ్చుకదా!" అంది సమీర కొంచెం కఠినంగానే.

ఏమాత్రం ఊహించని ఆ మాటకి జల జలా కళ్ళనీళ్ళు వచ్చేయి తేజకి.

ఏడుస్తున్న తేజని చూస్తూ,

"అసలు నీకు బుద్ధిలేదు. ఏ మాటంటే ఆ మాట ముఖాన అనేయడమే" అని తిట్టింది జలజ.

"అది కాదు. అసలు పెళ్ళే రీసెర్చి అయ్యేక చేసుకొంటే బాగుంటుంది. ఇంకా పిల్లలు..."

పూర్తి చేయకుండానే గయ్‌మంది జలజ.

"ఇంకా నయం. ఎప్పుడు అవుతుందో తెలియని ఈ రీసెర్చి అయ్యాక చేసుకో వాలా? అప్పటికి మనల్ని అంతా అమ్మమ్మా అంటారు" అంటుండగా తేజకి గతం కళ్ళముందు కదలాడింది.

★ ★ ★

తేజ బి.ఎస్‌సి పరీక్షలవగానే పెళ్లికి ముహూర్తం పెట్టేరు. మేనత్త కొడుకు కృష్ణే కాబట్టీ అతను ఈమెని ఎమ్.ఎస్‌సి చదివి

స్నానని చెప్పడంతోనూ చాలా ఆనందంగా ఒప్పుకొంది.

కృష్ణ ఎమ్.ఎస్‌సి. కెమిస్ట్రీ చదివాడు. తర్వాత ఎమ్ సెట్ కోచింగ్ సెంటర్‌లో చేరి నెలకు నాలుగువేలు సంపాదించేవాడు.

ఒక సంవత్సరం డబ్బులు కూడబెట్టిన తరువాత తేజని విశాఖలో ఎమ్.ఎస్‌సిలో జాయిన్ చేస్తానన్నాడు. అలాగే తనూ రీసెర్చి పూర్తిచేసుకొంటాననుకొన్నాడు.

క్వాలిఫికేషన్ లేకుంటే ఎప్పుడూ జూనియర్ లెక్చరర్‌గానే ఉంచేస్తారు. ఇంప్రూవ్ అయితే కాస్త డబ్బులు కూడా ఎక్కువ ఇస్తారు. దానికితోడు రీసెర్చి చెయ్యాలనే కోరిక ఎప్పటినుండో ఉంది.

తనకి తెలిసిన ప్రొఫెసర్‌ని కలసి మూడు సంవత్సరాలలో తనచేత పి.హెచ్.డి సబ్మిట్ చేయిస్తానంటే వస్తానన్నాడు.

ఆయన సరే అన్నాకే విశాఖపట్టణం ఇద్దరూ వచ్చేరు.

తేజ ఎమ్.ఎస్‌సిలో, కృష్ణ పిహెచ్‌డిలో చేరారు. మొదట ఇల్లు తీసుకొందామనుకొన్నారు గానీ, తేజకి హాస్టల్ సరదా ఉండటంవలన, మానేశారు. వేర్వేరు హాస్టల్స్‌లో జాయిన్ అయ్యారిద్దరూ.

ఆరునెలలయ్యేసరికి కృష్ణకి ఎంతసేపూ తేజ గుర్తుకురావడం, రూమ్ తీసుకోవాలనుకోవడం మొదలయ్యింది.

దాంతో వారానికి ఒక్కరోజు మంచి హోటల్‌లో గడపాలని తేజకి చెప్పాడు. తేజముందు ఒప్పుకోలేదు.

ఆమెకీ బావతో ఉండాలనే ఉంది. పాపం తన కోసం అత్తయ్యనీ, మావయ్యనీ ఒప్పించి తను కోరిన హాస్టల్ లైఫ్ ఇచ్చాడు కదా అని తర్వాత ఒప్పుకొంది.

హోటల్ రూమ్‌లో హాయిగా గడిపారు.

తీరా తెల్లవారగానే,

ఏడుస్తూ కూర్చుంది తేజ.

కంగారుగా లేచిన కృష్ణ, "ఎందుకు? ఏమయ్యింది? " అన్నాడు ఆత్రుతగా.

"అదికాదు... పిల్స్ వాడడంలేదుగా, కడుపు వచ్చేస్తుందేమో!" అంది చాలా భయంగా.

గతుక్కుమన్నాడు కృష్ణ. అసలు గుర్తే లేదు. అయిదు నిముషాలు అలాగే ఉండిపోయిన కృష్ణ,

"సేఫ్ పీరియడ్ కాదా? " అన్నాడు కొద్దిగా ఆశతో.

"ఆ! ఫరవాలేదు" అంటూ గుండెలమీద చేతులుంచుకొంది.

"అబ్బ! హడలగొట్టేసావ్! దీనికి పనిష్మెంట్‌గా ఈరోజు కాలేజీ డుమ్మా కొట్టేయాలి"

"అదేంకుదరదు" అంటున్నా,

"సేఫ్ పీరియడ్ మళ్ళీరాదు" అని ఉంచేశాడు.

పరీక్షలు మూడు నెలలున్నాయనగా ఇలాంటివేం కుదరవు అని కట్టడి చేసింది. కృష్ణ కూడా తన రీసెర్చిలో మునిగిపోయాడు.

పరీక్షలయ్యాక తేజని వాళ్ళ ఊరులో దిగబెట్టి నాలుగురోజులుండి తిరిగి వచ్చేసాడు.

తేజకి థర్డ్‌రేంక్ వచ్చింది. అంతా సంతోషించినా, తేజ మాత్రం ఫస్ట్ రేంక్ రానందుకు బాధపడింది. మళ్ళీ సంవత్సరం బాగా చదవాలనుకొంది. ఈసారి బావతో ఆదివారాలు వేస్ట్‌చేయకూడదనుకొంది.

కృష్ణ కూడా ప్రీ. పి.హెచ్.డి. పూర్తిచేసి దృష్టంతా రీసెర్చిమీదే పెట్టాడు. అతనూ తేజని కలిసి వేస్ట్ చేయకూడదనుకొన్నాడు. అదీగాక బేంక్ బాలన్స్ చాలామట్టుకు అయిపోయింది. జాగ్రత్త పడక తప్పదనుకొన్నాడు.

ఎప్పుడైనా ఫోన్ చేసి, బీచ్‌కి వెళ్ళి కబుర్లు చెప్పుకోవడం చేసేవారు. అతను ఎప్పుడూ తన గైడ్ గురించీ రీసెర్చి గురించీ గైడ్ ఎంత ప్రోత్సహిస్తున్నదీ చెప్తూ, అతని మంచితనం గురించి చెప్పేవాడు.

అప్పుడు తేజ,

"బావా! మనం నిజంగా అదృష్టవం తులం. చాలామంది గైడ్‌లతో వేగలేక ఛస్తున్నారనుకో!" అనేది.

"నిజమే! పాపం. ఆయన, రాత్రి రెండు గంటలదాకా నాతో లేబ్‌లో ఉన్నారు తెలుసా? " అంటూ ఆనందంగా చెప్పి, ఆ వెంటనే.

"మాస్టారు నాకోసం అంత కష్టపడు తుంటే నేను నీతో ఇలా కబుర్లు చెప్పడం బాగులేదు. వెళ్తాగానీ, ఏమనుకోకు" అని చెప్పి వెళ్ళిపోయేవాడు.

మధ్యమధ్యలో ఎప్పుడైనా, "ఈరోజు మంచి రిజల్ట్స్ సంపాదించాం" అని చెప్పి "సాయంత్రం వస్తాను, రెడీగా ఉండు" అనే వాడు.

తేజ కూడా వెళ్ళేటపుడు చాలా ఆనం దంగా వెళ్ళేది. వచ్చేటపుడు మాత్రం 'టైమ్ వేస్ట్ అయిపోయింది. ఈరోజు అంతా ఎంత చదివారో!' అనుకొనేది.

"వివాహే విద్యానాశాయ అన్నారు పెద్దలు. ఊరికే అంటారా? " అని తేజ అంటే మాత్రం కృష్ణ వొప్పుకొనేవాడు కాదు.

"ఇలా మనం హాయిగా గడిపేక, రేపటి నుండీ ఎంత బాగా వర్క్ అవుతుందో తెలుసా? మావాళ్ళు చాలామంది సెక్స్‌కోసం బ్లూఫిల్మ్ చూసి, అక్కడికివెళ్ళి, ఇక్కడకివెళ్ళి నానా బాధపడిపోతున్నారు. మనం హాయిగా ఉన్నాం. ఒక్కరోజుకి కొంపలేవీ మునిగిపోవు"

"ఒక్కరోజు ఏమిటి? కిందటివారం అంతా నువ్వే గుర్తొచ్చి చదువు ఏమీసాగ లేదు, తెలుసా? " అంది తేజ.

"మరి ఫోన్ చెయ్యలేకపోయావా? బడాయి, ఎప్పుడూ నేనే ఫోను చెయ్యాలి. నాకోసమే వస్తున్నట్టు ఫోజు కొట్టాలికదూ? ఆడబుద్ధి..."

"అదేం కాదు లేవోయ్! ఒకసారి ఫోన్ చేశాను. లేబ్‌లో ఉన్నావు. సరే, నిన్ను డిస్టర్బ్ చెయ్యడం, ఎందుకని ఊరుకొన్నాను"

"అరే, నాకు ఫోన్ చేసినట్టే తెలియదు"

"నేనే చెప్పనక్కరలేదన్నాన్లే అనవసరంగా వర్క్ పాడవుతుంది కదా! నాది కోర్సువర్క్ కాబట్టి ఫరవాలేదు. నీ థాట్ కట్ అయితే కష్టం కదా! తమరు స్కాలర్‌కదా! అని గౌర వంగా ఫోన్ చెయ్యడంలేదు. మంచికి పోతే చెడు ఎదురయిందని ఫోజు కొట్టేనంటు న్నావు"

"సారీ తేజా! అందుకే చదువుకున్న పెళ్ళాన్ని, చదువు విలువ తెలిసిన పెళ్ళాన్ని కట్టుకోమన్నారు"

"ఏంటీ? ఎవడి పెళ్లాన్ని కట్టుకొంటావు తన్నగలరు"

"పెళ్లాన్ని కాదు. పిల్లని చిన్న సవరణ చేసుకో" రూమ్ ఖాళీచేసి వెళ్ళిపోయారి ద్దరూ!

అప్పటినుండీ రెండుమూడురోజులకొక సారి ఫోన్ చేసి,

"తేజా! నన్ను చూడాలని ఉందా? చెప్పమ్మా!" అంటూ ఉండేవాడు.

"ఏమీలేదు. అస్తమానం ఫోన్ చెయ్యకు. బహుశా చదువు తగ్గించి ఉంటావు" అని తిరిగి దెబ్బలాడేది తేజ.

రెండు నెలల్లో పరీక్షలున్నాయనగా కృష్ణ ఫోన్ చేసిరమ్మంటే,

"వద్దు, పరీక్షలు దగ్గరకివచ్చేయి" అంది తేజ.

"ఒక్కరోజు, ప్లీజ్ తేజా! నాకెంత విసుగ్గా ఉందో, నావర్క్ పదిరోజులబట్టీ ఆగిపో యింది. మామాస్టారు ఊరెళ్ళారు. ఆయన వస్తేగానీ... సాగదు. అందుకే బోర్‌గా ఉంది. ఒక్క రోజేగా..." అనగానే.

"నాకు వొంట్లో బాగులేదు"

"ఏమయిందీ? " అన్నాడు ఆత్రుతగా.

"అబ్బే! ఏవీలేదులే. వస్తాను" అని ఫోన్ పెట్టింది.

చదువుపోతుందనుకొని అలా చెప్పిందను

కొని హుషారుగా వచ్చాడు.

"తేజా! వొంట్లో బాగులేదా?"

"బానే ఉంది"

ఆ కబుర్లు, ఈ కబుర్లు కొద్దిసేపు చెప్పి తేజ పక్కన కూర్చుని,

"మాస్టారు రేపు వచ్చేస్తారంటావా?" అన్నాడు ఆశగా.

"ఆ" అంది ముక్తసరిగా.

సాధారణంగా ఇలాంటపుడు ఎంతో హుషారుగా, ఎంకరేజింగ్‌గా, ఎందుకు రారూ? అంటూ మాట్లాడుతుంది. అసలు ఆ మాటకోసమే ఇలా వచ్చేడు కృష్ణ.

కానీ, తేజ 'ఆ!' అని ఊరుకోవడంతో ఆమె మొహంలోకి లోతుగా చూసి,

"నీకు నిజంగా వొంట్లో బాగులేదు కదూ!" అన్నాడు.

ఆ మాటతో వెక్కివెక్కి ఏడ్చింది తేజ.

"ఏమిటి బాగులేదు, చెప్పు" అని గారంగా అడగ్గానే,

"నాకేమో ఇన్‌ఫెక్షన్ వచ్చింది"

"ఏమిటి?"

"యూరినరీ ఇన్‌ఫెక్షన్. ఎంత బాధగా వుందో? నేనయితే ముందు ఎంత భయపడ్డానో! మా పక్క రూమ్ అమ్మాయి, చెడతిరుగుతుంది. ఆమెకి ఏదో జబ్బులు కూడా ఉన్నాయట. మా బట్టల పక్కనే తన బట్టలూ ఆరేసింది. ఆ బట్టలు ఉతుకుదామనుకొన్నాను. నీళ్ళు లేక వేరే పెట్టాను అవి తెచ్చి, మారూమ్మేట్ నా పెట్లో పెట్టింది.

ఆమె జబ్బులు ఏమన్నా అంటాయేమోనని భయమేసింది. డాక్టర్‌దగ్గరకి కూడా వెళ్లాలన్పించలేదు. జలజ వచ్చి, బలవంతాన హాస్పిటల్‌కి తీసుకువెళ్లింది. డాక్టర్ ఫరవాలేదన్నాక హమ్మయ్య! అన్పించింది. నిజంగా ఎంత టెన్షనో, తెలుసా?" అని చెప్తున్న తేజని చూస్తే జాలిగా బాధగా అన్పించింది కృష్ణకి.

"పోన్లే, అవన్నీ తలచుకోకు. హాయిగా పడుకో" అని పడుకోబెట్టి, తనూ నిద్రపోయాడు.

ఉదయాన్నే,

"ఏయ్! బావా! లేవవా" అని లేపిన తేజని చూసి,

"ఎందుకు లేవడం. నోర్మూసుకొని పడుకో, కాలేజీకి వెళ్లొద్దు"

"ఎందుకట? నాకు బాగానే ఉంది వెళ్తాను"

"అవునుగాని, నాకు ఫోన్ ఎందుకు చేయలేదు? నిన్న వచ్చిన వెంటనే అయినా బాగులేదని చెప్పావా? నేనెలా కన్పిస్తున్నాను నీకంటికి. సెక్స్‌కి వెంపర్లాడిపోయేవాడిననుకొన్నావా?"

"ఛా, అదేం కాదు. వచ్చి ఏం చేస్తావు? నా బాధ నేనే పడాలిగా. అసలు నాకు తగ్గిపోయిందనే అనుకొన్నా... ప్చ్! ఈ రూమ్ రెంట్ అంతా వేస్టకదూ!"

"ఏవీ కాదు. వచ్చేము కాబట్టే తెలిసింది. ఇలా చెప్పకుండా దాచేస్తారు. కొన్నాళ్లయ్యేసరికి అందరిమీదా విసుగువస్తుంది. ఈ మగాళ్లంతా ఇంతే, అని తిట్టుకోవడం. మీ లేడీస్ ప్రోబ్లమ్స్ మాకు తెలియవు కదా! ఇది, నా బాధ అని ఖచ్చితంగా చెప్పాలి. నేను, గైడ్ ఊరెళ్లారనే బాధ దగ్గరనుండీ, అన్నీ నీదగ్గర చెప్పి, సానుభూతి పొందాలనుకొంటున్నానా? ఆఖరికి తలనెప్పి వచ్చినా, చెప్తానే, మరి నువ్వేమి చేశావు?"

"ఆపుతావా? ఉపన్యాసం. నిన్నుకూడా బాధపెట్టడం దేనికి అని చెప్పలేదు"

"బాధపడితే పడతాను. అది అలవాటు చెయ్యాలి" అన్నాడు స్థిరంగా.

"అదికాదు బావా! తలనొప్పి అనుకో, అది ఎప్పుడూ వచ్చేదేకాబట్టి నేను భయపడిపోను. కానీ ఈ ప్రాబ్లెం నీకు చెపితే ఏమయ్యిందో అని బెంగపెట్టుకొంటావు. అందుకనే చెప్పలేదు" అని తేజ లాజికల్‌గా చెప్పి వప్పిద్దామనుకొంది.

"మాకు తెలియనివి, మేము ఎప్పుడూ

అనుభవించనివీ కాబట్టే మీ 'ఆడబాధలు' వివరంగా చెప్పి ఎడ్యుకేట్ చెయ్యాలి మమ్మల్ని, అంతేగానీ..." అని ఇంకా ఏదో చెప్పబోయిన కృష్ణతో,

"మహానుభావా! ఇక ఆపు. క్లాసులు పీకమంటే రెడీ. కోచింగ్ సెంటర్‌లో తమరికి బాగా అలవాటయిపోయింది. ఇచ్చిన బిట్టే ఇచ్చీ, ఇచ్చీ.. బలవంతాన రుద్దేయడం. నేనేవీ స్టూడెంట్‌ని కాను. చెప్పిందే చెప్పి వాయించేస్తున్నావు. నాకేమీ చెప్పక్కర్లేదు. పద పోదాం" అంది కందగడ్డలా ముఖం పెట్టుకొని.

"ఊహూ, ఈరోజు ఇక్కడే ఉంటాము. కాఫీ తాగుతావా? "

"వద్దులే... ఇంకాసేపు పడుకొంటా. రూమ్ రెంట్ కట్టాలిగా" అంటూ కళ్ళు మూసుకొని పడుకొంది తేజ.

ఎమ్. ఎస్‌సి. పరీక్షలయ్యాక తేజని అమ్మా, నాన్న దగ్గర దిగబెట్టి, అప్పుడప్పుడూ వెళ్తుండేవాడు. తేజకి థర్డ్ రేంక్ వచ్చింది.

పోన్లే, సి.ఎస్.ఐ.ఆర్ వస్తుందని సరిపెట్టుకొంది. తర్వాత ఆ రిజల్ట్స్‌కోసం ఎదురు చూడడం మొదలయ్యింది.

కృష్ణ దగ్గర నుండీ ఉత్తరాలు వస్తున్నాయి తేజకి.

'మాస్టారు సరిగ్గా, వూళ్లో ఉండడంలేదు. ఉన్నా డల్‌గా ఉండి వర్క్ పెద్దగా చేయించడంలేదు' అని రాయడం ఆరంభమయింది.

"తేజా! దేవుడులాంటి మాస్టారి భార్యకి కేన్సర్ వచ్చిందట. అందుకే మాస్టారు చాలా డల్ అయిపోయారు. వైద్యం కోసం తిరుగుతున్నారు. నాకు చాలా డల్‌గా ఉంది. నువ్వుకూడా లేవు. ఈ ఏడాది వర్క్ అవుతుందనే నమ్మకం లేదు. మరో ఏడాది ఇక్కడే ఉండాలేమో" అని కృష్ణ రాస్తే,

"నాకు సి.ఎస్.ఐ.ఆర్ వస్తే నేనూ వచ్చేస్తా" అని రాసింది తేజ.

నిజంగానే సి.ఎస్.ఐ.ఆర్. ఫెలోషిప్ వచ్చింది తేజకి.

ఫెలోషిప్ ఒక నెల అందుకొన్న తరువాత ఇల్లు తీసుకొందామనుకొన్నారు. ఈలోగా కృష్ణా, తేజా బీచ్‌లో మాత్రం కలిసేవారు. రూమ్ తీసుకొందుకి డబ్బుల్లేవు.

ఒకరోజు,

ఫ్రెండ్ రూమ్ ఖాళీగా ఉందని తెలిసి తేజని రమ్మన్నాడు కృష్ణ.

ఆరోజు వాళ్ళ అలవాటైన ప్లానింగ్ ఫెయిల్ అవడంతో.

కృష్ణ భయంగా "తేజా! ఎలా? " అన్నాడు.

ఏమీ పట్టించుకోలేదు తేజ.

తేజని చూస్తూ, "బాబోయ్! కడుపు వచ్చేస్తుందేమోనని ఏడుస్తూ కూర్చుంటావని భయపడ్డాను" అన్నాడు కృష్ణ.

"ఆ, నాలుగు సంవత్సరాల నుండీ ఎప్పుడూ భయపడడమే. విసుగువచ్చింది. వస్తే అప్పుడే చూద్దాం. అప్పుడే ఏదో చేద్దాం"

"నీకెంత ధైర్యం వచ్చిందీ? " అని ఆశ్చర్యపోయాడు.

"ధైర్యం రాదేంటి? వయస్సు వస్తోందిగా. అదీగాక, మొన్న ఒక అమ్మాయి అబార్షన్ చేయించుకొంది. మర్నాడు హాయిగా బీచ్‌కి వెళ్ళింది. తెలుసా? "

"ఇలాంటి విషయాలన్నీ తెలుస్తున్నాయే తమరికి? "

"ఇంకేంటి? పనా! పాటా! ప్రస్తుతం మా పని, ప్రేమ పురాణాలు చెప్పుకోవడం, గైడ్‌లని తిట్టుకోవడం, అంతేగా!" అని వాళ్ళ కాలక్షేపం గురించి కాసేపు కబుర్లు చెప్పుకొని ఎవరిదారిన వారు వెళ్లిపోయారు.

మళ్ళీ నెల పీరియడ్ రాకపోయినా గుర్తించలేకపోయింది. కొద్దిరోజులలో కడుపులో వికారం. తలనొప్పి అన్నం సయించకపోవడం, నిద్రమత్తు మొదలవడంతో

అనుమానం వచ్చింది. కృష్ణతో కలసి హాస్ట ల్ కి వెళ్లింది.

ప్రస్తుతానికి పిల్లలు అక్కర్లేదని ఎంత చెప్పినా డాక్టర్ మొదటిసారి అబార్షన్ మంచిదికాదు అనడంతో కృష్ణ భయప డ్డాడు.

ఒక్క బాబో, పాపో ఉంటే తర్వాత ఆప రేషన్ చేయించుకోవచ్చు అని చెప్పి ఒప్పిం చాడు తేజని.

పెగ్నెన్సీ కన్ ఫర్మ్ అయిన మర్నాడే బిల్ ప్రిపేర్ చేసి ఆఫీస్‌లో ఇచ్చింది. కానీ డిపా ర్టమెంట్ కి వెళ్లడం అంటేనే భయం.

అప్పుడప్పుడూ గైడ్ దగ్గరకి వెళ్ళి,

"ఒంట్లో బాగులేదు సర్" అని చెప్పి సంతకాలు పెట్టివచ్చేది.

ఎప్పుడూ, నీరసంగా రూమ్‌లో పడుకో వడం, అస్తమానం వాంతులు చేసుకోవడం,

ఆమె వాలకం చూసి వార్డెన్‌కి అను మానం వచ్చి, రూమ్‌లోకి వెళ్తున్న తేజని చూసి,

"రీసెర్చి చెయ్యడానికి వస్తారో? కడు పులు చేయించుకొందుకి వస్తారో? " అంది.

దాంతో ఒళ్ళుమండిన తేజ,

"దేనికి వస్తామో, మా ఇష్టం. మీ రూల్స్ ఒప్పుకోకపోతే మర్యాదగా రూమ్‌ఖాళీచేయ మని చెప్పు. అంతేగానీ నోటికి వచ్చినట్లు వాగితే ఊరుకోను" అని గట్టిగా దబా యించి,

నువ్వు ఎవడి పక్కలో పడుకొంటే వార్డెన్‌వి అయ్యావో మాకు తెలియదా! అని గొణుక్కొంటూ, ఏడుస్తూ పడుకొంది.

ఒకగంట తర్వాత వార్డెన్ వచ్చి-

"సారీ, ఏమనుకోకు. నీకు తెలియంది ఏముంది. మొన్ననే ఆ లలిత అబార్షన్ చేయించుకొంది. కిందటి నెల ఎకనామిక్స్ డిపార్ట్‌మెంట్‌లో నీరజ స్లీపింగ్ పిల్స్ మింగింది. నీకూ తెలుసుగా. రక్షించి డిపా ర్ట్‌మెంట్‌లో మింగింది. ఇక్కడే ఆపని చేస్తే! పోలీసులతో నా ప్రాణం విసిగిపో యేది. అయినా వాళ్లు వస్తూనే ఉన్నారు. ఏదో అడుగుతూనే ఉన్నారు. ఆ విసుగులో ఏదో అన్నాను" అంది

ఆ మాటకి మరికొంచెం దుఃఖం వచ్చింది తేజకి. "ఈ నెలలో రూమ్ ఖాళీ చేస్తాను. ఇలా అవుతుందని నేనూ అనుకోలేదు" అంది దిగులుగా.

"సంతోషంగా గడపవలసిన సమయం. దిగులు పడకు" అని చెప్పి వార్డెన్ వెళ్ళిపో యింది.



"అదీ, నా ఫ్లాష్‌బ్యాక్ సమీరగారూ!" అంది తేజ.

అరే, ఈమెని అనవసరంగా బాధపెట్టేనే అనుకొన్న సమీర-

"రెండు రోజులలో ఇల్లు చూస్తానండీ" అంది.

"ఇంతకీ మీ నీరజ ఎందుకు స్లీపింగ్ పిల్స్ మింగింది" అడిగింది తేజ.

"అదో పెద్ద గాథ. నీరజ ఎమ్. ఏ. ఇక్కడే చేసింది. ఎమ్. ఏ. నుండి ఒక మాస్టారితో సంబంధం ఉంది"

జలజ చాలా జాగ్రత్తగా ఉంటుంది. ఎంత దగ్గరి ఫ్రెండ్ అయినా నోరు జారదు. మాస్టారు అంటుందేగాని పేరు చెప్పదు.

"నీరజ ఎమ్. ఫిల్. ఉస్మానియాలో

చేసింది. ఆ రెండేళ్లు మాస్టారు హైదరాబాదులో కలిసేవారట. అది ఇబ్బందన్పించి పి. హెచ్. డి. సీటు ఇక్కడే ఇప్పించి ఆమెని రప్పించారంటారు.

ఆమె నిజంగానే ఆ రకమేలే! కానీ ఇక్కడకి వచ్చిన తర్వాత, మాస్టారు ఆమెకి బోర్ కొట్టారో, మాస్టారికే ఆమె బోర్ కొట్టిందో, తెలియదుగానీ, ఆమె కో-స్కాలర్ ఒకరితో తిరుగుతోంది.

అతడు ఆమెతో షికార్లు కొట్టాడు. తిరగడానికి ఎవరైనా ఫరవాలేదుగానీ, పెళ్లికి పతివ్రత అవ్వాలిగా! అతనికి అప్పటికే పెళ్లి కుదిరిపోయింది. మా కందరికీ కార్డ్స్ ఇచ్చాడు.

సరిగ్గా ముహూర్తం టైమ్‌కి ఈమె డిపార్ట్‌మెంట్‌లో తీరుబడిగా పిల్స్ మింగింది. ఉదయం ముహూర్తం అవడం అదృష్టం. వెంటనే స్వీపర్ చూసింది. బ్రతికింది. లేకుంటే అతగాడి మెడకి చుట్టుకొనును. అయినా ఏదో కేసు పెట్టి ఆమె, అతడిని ఇబ్బంది పెడుతోంది. ఆ వెధవకీ ఆమాత్రం పనిష్మెంట్ ఉండాలిలే" అని చెప్పింది జలజ.

"పోలీసుకేసు ఏమవుతుంది? " అంది గాభరాగా సమీర.

"ఇలాంటివి ఏమవుతాయి. మాఫీ అవుతాయి. తీగలాగితే డొంకంతా కదుల్తుంది. కాబట్టి తీగ జోలికే రానివ్వరు.

"ఒక వారంరోజులు క్లాసెస్ అన్నీ కేన్సిల్ చేసి డిపార్ట్‌మెంట్‌ని ఖాళీగా ఉంచారు.

"అంతా బాగానే ఉన్నారు కానీ"-

"స్వీపర్స్ మాత్రం మమ్మల్ని చూసి ఘోరంగా మాట్లాడుతున్నారు. నేను హాస్టలర్ని అనుకొని మొన్న-

"అమ్మా, బాబులుండరుకదా అని, ఆడాళ్లమన్న సంగతి మరచిపోయి జల్సాగా తిరగడం- మగాడు చక్కాపోయాక ఏడవడం...

అంటూ చాలా అసహ్యంగా మాట్లాడింది ఏమి చేస్తాం? నోర్మూసుకొని విననట్లుపోతున్నాం" అని జలజ భారంగా నిట్టూర్చి-

"టీ తాగుదామా? " అంది.

"వద్దు, నేవెళ్తాను" అంది సమీర.

ఆమెని చూసి తేజ అంది.

"మీరెందుకు? అంత డల్‌గా అయిపోయారు? "

"యూనివర్శిటీ గురించి చాలా చాలా ఉన్నతంగా ఊహించింది. ఇక్కడంతా కుళ్లు రాజకీయాలు, కులాలు, కడుపులు... అబార్షన్‌లు..." అని చెప్తున్న జలజ మాటలు మధ్యలో ఆపి,

"వెళ్తానే" అని వెళ్లిపోయింది సమీర.

వెళ్తున్న సమీరవైపు చూస్తూ-

"మధ్యాహ్నం పూట లైబ్రరీలో ఉంటుంది. అక్కడే పరిచయం అయింది. స్కాలర్స్ అంటే చాలా గౌరవం. అందుకనే తనకి అప్పచెప్పా. ఖచ్చితంగా రెండు రోజుల్లో ఇల్లు చూసి పెడ్తుంది" అంది జలజ.

తేజకి తన పరిస్థితి గుర్తుకొచ్చి నీరసంగా అన్పించి-

"వెళ్దామా? " అంది.

"ఓకే. బై! బీ హేపీ!" అంది జలజ.

ఇల్లు చూడాలని కృష్ణకి గుర్తుచేయాలని ఫోన్ చేసింది తేజ.

కానీ కృష్ణ- "సారీ, తేజా! వారందాకా అవదు. మాస్టారుతో వర్క్ సీరియస్‌గా అవుతోంది. ఏమీ అనుకోకు" అని చెప్పడంతో సమీర చూస్తుందిలే అనుకొంది.

ఆ ఆశతోనే రెండురోజులు వరసగా సమీర డిపార్ట్‌మెంట్‌కి వెళ్లింది- కానీ సమీర రాలేదు.

చాలా విసుగ్గా అన్పించి నిరాశ కలిగింది. కృష్ణతో గడిపితే కాస్త హుషారుగా ఉంటుందనుకొని ఫోన్ చేసింది తేజ.

★ ★ ★

రిఫరెన్స్ బుక్‌కోసం హడావుడిగా వచ్చిన కృష్ణకి పైమెట్లమీదనుండి గప్పున వాసనతో పాటు ఛండాలం మాటలు కూడా వినిపిం

చాయి.

పట్టాభి చేతులూపుకొంటూ, తూలుతూ ఏవో వాగుతున్నాడు. వాళ్లని చూసిన కృష్ణకి చిరాకేసింది.

దారికి అడ్డుగా ఉన్నవాళ్లని-

"లెండి" అన్నాడు గట్టిగా, విసుగ్గా.

"ఏంది? గురూ! ఎందుకు లెగాలి? రూమ్‌కెళ్లి ఏటిసేస్తావు. గదిలో పిల్లగానీ ఉందా? సెప్పు. ఇంచక్కా ఉంటదా?" అని చేతులు పట్టుకొన్నాడు జోగారావు.

"ఛత్. వెధవ దరిద్రం. చదువులేదుగాని తాగి వెధవకబుర్లు, సిగ్గు లేదూ? రీసెర్చి వంకన వచ్చి- ఇలా తగలడడానికి?" అని కేకలేసి-

తన చేతులు పట్టుకొన్న జోగారావు చేతులు దులపరించి పారేశాడు. ఆ మాటలు విన్న పట్టాభి

"ఏట్రా, సదువులేదా మాకు. నువ్వొక్క డివే గొప్పోడివి. అవునా? ఒరేయ్! నీ గైడ్ మంచోడు. మంచి మొగుడు దొరికిన ప్రతి పెళ్లాం, ఇట్టాగే అంటదిరా! మనసెరిగి కాపురం చేస్తున్నానంటదిరా. గొప్ప పతివ్ర తలా సెబుతున్నావే" అని-

కృష్ణకి దగ్గరగా వచ్చి, చేతులు పట్టుకొని ఏడుపు గొంతుతో-

"బాసూ? మంచి పుడ్డులేదు. మంచిదేదీ లేదు. హాస్టల్ కూడు తినీతినీ కడుపు ఖరా బయ్యిందా? నాలిక సచ్చిపోనాదా? ..." అని నాలిక మొత్తం బయటకి పెట్టాడు.

ఒక రెండు సెకనుల తర్వాత, నెమ్మదిగా నాలిక లోపలికి తీసుకొని, కుడిచేతిని పైకి ఎత్తి మూడువేళ్లు తెరచి ముఖంమీద పెట్టి-

"ఇన్ని పదుల వయసు వచ్చినాదా? ఏవి సుఖపడ్డాం. సగం వయస్సయిపోనాది. అవునా? ..." అంటుండగా-

వాచ్‌మాన్ వచ్చాడు.

"బాబూ! తేజమ్మగారు ఫోన్ చేశారు" అన్నాడు.

అప్పుడే కూర్చుని కొద్దిగా మత్తులోకి వెళ్తున్న జోగారావు చటుక్కున లేచాడు.

"ఎవరురా? తేజా! మరదలు పెళ్లాం. ఎప్పుడంటే అప్పుడు వస్తుంది. అందుకే నీకు ఫోజు. మరి మాకో... తేజ లేదుగా. డబ్బులుంటేగానీ మాకేవీ రావు. ఆ ప్రొఫె సర్‌గాడు ఎప్పుడో విదులుస్తాడు. మరి నువ్వో! మెత్తగా ఉండే తేజవాళ్లో... ఎప్పు డంటే అప్పుడు బజ్జుంటావుకదూ..."

ఆ మాటకి బాగా కోపమొచ్చింది కృష్ణకి.

"ఒరేయ్! నీకెందుకురా? దమ్ముంటే నువ్వూ పెళ్లాడు" అని ఒక్కతోపు తోశాడు.

దూరంగా పడ్డాడు జోగారావు.

"ఆడ్ని ఎందుకు కొట్టావు? ఆడన్నదాంట్లో తప్పేంటి ఉందీ?" అని తాగిన మైకంలోనే కాలర్ పట్టుకొన్నాడు పట్టాభి.

"తాగుబోతు వెధవల్లారా! స్కాలర్స్‌మని చెప్పుకొందుకి కూడా సిగ్గేయడం లేదూ? వదులు ముందు" అని విదిల్చాడు కృష్ణ.

"ఏట్రా వదిలేది. నోటికి వచ్చినట్టు పేలి" అని పట్టాభి అంటుండగా-

కృష్ణ జోగారావుకి దూరంగా జరిగాడు.

"వాడిని వదలీకు. వదిలీకు" అంటూనే ఉన్నాడు పట్టాభి.

ఓపికలేని జోగారావు మాత్రం ఆ ప్రయత్నం చేయక, గోడకి జారపడ్డాడు.

తానూ వదిలేసి, జోగారావు వదిలేయడం పట్టాభికి నచ్చలేదు.

"వాడ్ని వదిలేశావా?' కులం కుళ్లు ఎక్కువరా మీకు. మీవాడు కదూ! అందుకే వదిలేశావు. మరోడయితే ఫిల్ట్ పట్టుకొన్నం దుకు ఆడి ఎముకలు విరగ్గొట్టేవ్" అన్నాడు.

"నోర్ముయ్! యెదవ నాకొడకా! మావా డనే వదిలేశా. దిక్కున్నసోట సెప్పుకో శ్రీరంగనీతులు సెప్పేది మీవోళ్లే. మావాళ్లు, మా వాళ్లని పాతుకుపోయారు. కులాన్ని, సొమ్ముని కూడా భద్రంగా సూసుకొనేది మీరే" అంటూ రెచ్చిపోయాడు జోగారావు.

తాగిన మత్తులో వెనకాతల అనుకొనే

మాటలు ముఖంమీదే అనుకొన్నారు.

మెస్ సెక్రటరీ అక్కడకి వచ్చాడు. వస్తూనే-

"ఏంటి సంగతి? " అన్నాడు.

"బుల్లెట్ బాబుగారు, తగాదా తీరుస్తారా? మీవాడెవడూ లేడు. ఎవడికీ, ఏ అన్యాయం జరగలేదు" అన్నాడు కృష్ణ కచ్చగా.

"మావాడుంటే సంగతేంటని అడగను. ఈపాటికి దుమ్ము దులిపేద్దును"

"ఆ, ఏమైనా చేస్తావు. మెస్ సెక్రటరీ అయి ఆరు నెలలవకుండానే బుల్లెట్ కొన్నవాడివి. మీ వాళ్లేకదా, కిందనుండీ పైదాకా ఉన్నారని తెగనీల్గుతున్నావు" అని కృష్ణ కూడా ఆవేశపడడం చూసిన నిశాంత్-

"కృష్ణా! రండి" అని చేయిపట్టుకొని రూమ్‌లోకి తీసుకువెళ్లాడు.

"మందు కొట్టినవాళ్లు మర్నాటికి మరచిపోతారు. మనం మరచిపోగలమా? కేకలు వేసి, అరచి బూతులు మాట్లాడేవాళ్ల సంస్కారం వాళ్లకి సిగ్గన్పించదు. మనం అలా- ఆవేశపడితే, మర్నాడు చాలా సిగ్గుపడతాము. ఆ ప్రభావం చాలా రోజులుంటుంది. వర్క్ సరిగా అవదు" అన్నాడు నిశాంత్.

అప్పుడే వాచ్‌మెన్ వచ్చాడు.

"తేజమ్మగారు మూడుసార్లు ఫోన్ చేశారు" అని చెప్పాడు.

గబగబా వెళ్ళిన కృష్ణ-

"ఇదిగో, తేజా! నీకు చదవాలని లేకుంటే మానేసి, ఇంటికి పో. అంతేగానీ, బోర్, గీర్ అని, చీటికీ మాటికీ ఫోన్ చెయ్యకు" అని ఫోను పెట్టేశాడు.

తేజ మనసు చచ్చిపోయినట్లయింది. ఎలాగో రూమ్‌కి వచ్చి- మంచంమీదపడి ఏడ్చి, ఏడ్చి అలసిపోయి పడుకొంది.

ఉదయం తొమ్మిదిగంటలయినా లేవాలన్పించలేదు. దేనిమీదా ఇంట్రస్ట్ లేదు. వెధవబ్రతుకు, వెధవ చదువు, అని అప్పటికి వందసార్లు అనుకొంది.

కదలకుండా పడుకొని ఉన్న తేజ, సమీర రాకతో తప్పనిసరై లేచింది.

"నిన్నా, మొన్నా మీరు కాలేజీకి రాలేదు కదూ"

"అవునండీ, మీకు ఇల్లు దొరికింది. ఓనర్స్ చాలా మంచివాళ్లు. మా ఇంటికి చాలా దగ్గర" అని హుషారుగా చెప్పింది సమీర.

"సారీ! మిమ్మల్ని అనవసరంగా ఇబ్బంది పెట్టాను.

నాకు ఈ వూర్లోనే ఉండాలని లేదు. వెళ్లిపోతాను" అంది తేజ భారంగా.

"ఏం? "

ముఖం కనబడకుండా మోకాళ్ల మధ్య పెట్టుకొంది తేజ.

"ఒంట్లో బాగులేదా? "

"బాగానే ఉంది" అని కృష్ణకి ఫోన్ చేసిన విషయం చెప్పింది.

"అంతేనా? దానికి అంత బాధ దేనికి? ఆయన ఏ చికాకులో ఉన్నారో? "

"ఏమీకాదు, మగబుద్ధి. వాళ్ల అవసరాలకి తియ్యతియ్యని కబుర్లు చెప్తారు. మన అవసరాలకి ఛీకొట్టేస్తారు" అంది కోపంగా.

"అరే, దీనికి తిట్టుకోవడం దేనికి? హాస్టల్‌కి వెళ్లి ఏవిషయం కనుక్కొందాం, పదండి"

"నేను రాలేను. చాలా నీరసంగా ఉంది"

"భోజనం చేయలేదా? రాత్రి"

"లేదు... ఈ వెధవ కడుపు రాకుంటే ఎంత బాగుణ్ణో? ఎంత చిరాగ్గా ఉందో? "

"ప్లీజ్... అలా మాట్లాడకండి. ముఖం కడుక్కోండి. మంచి టిఫిన్ చేసి హాస్టల్‌కి వెళ్దాం. అక్కడనుండీ ఇల్లు చూడడానికి వెళ్దాం" అంది. సమీర బలవంతంతో తప్పనిసరిగా లేచి బయల్దేరింది.

ఇద్దరూ కృష్ణని కలిసారు.

సారీ చెప్పాడు కృష్ణ.

తేజ, కృష్ణ, ఆరోజే కొత్త ఇంట్లోకి వెళ్లిపోయారు.

★ ★ ★

జరీ అంచు పచ్చచీర కట్టుకొని ఠీవిగా ఆటో దిగింది ప్రొఫెసర్ శాంభవి. ఏమాత్రం అలంకరణమీద శ్రద్ధ వహించకపోయినా నిండైన, గంభీరమైన ఆ విగ్రహం చూపరులని ఆకర్షిస్తుంది. గంభీరంగా, హుందాగా ఉండే ఆమె ముఖాన్ని చూసిన వెంటనే కొద్దిగా భయం కలుగుతుంది. కానీ, వెంటనే ఆమె ముఖంలో కన్పించే చిరునవ్వులో తొణికిసలాడే ఆప్యాయత-ఆదరణలతో-

ఆ భయంపోయి, ఆస్థానే గౌరవభావం కలుగుతుంది.

ఆమె కోసమే ఎదురుచూస్తున్న మత్స్యలింగం-

"నమస్తే, మేడమ్" అని విష్ చేశాడు.

"ఆ, నమస్తే! బాగున్నావా? వర్క్ అవుతోందా? " అని ఆదరంగా అడుగుతూనే రూమ్ తాళంతీసి-

"రావయ్యా! కూర్చో" అంది.

"ఇప్పుడు చెప్పు. చాలారోజులయింది కన్పించి. ఊరికే చూసిపోదామని వచ్చావా? ఏమయినా పనిఉందా? " అని సూటిగా అడగ్గానే-

"సమస్య వచ్చినప్పుడు మీరేకదా, పరిష్కారం చూపేది. అందుకనే... వచ్చాను"

మా గైడ్, అప్పారావుగారితో కొద్దిగా ప్రాబ్లమ్‌గా ఉంది. ఇప్పుడు ఫీల్డ్‌వర్క్‌కి వెళ్లమంటున్నారు. నేను ప్రస్తుతం సివిల్స్ మెయిన్ ప్రిపరేషన్‌లో ఉన్నాను. మీకు తెలుసుకదా!

అప్పుడే నాలుగు నెలలనుండీ బిల్ కూడా సంతకం పెట్టలేదు. నేను వర్క్ చేయడంలేదని కోపం. నేను ప్రస్తుతం వర్క్‌చెయ్యలేను. అర్థం చేసుకోరు. పి.హెచ్.డి. అక్కర్లేకుంటే వెళ్ళిపో...అన్నారు. సివిల్స్‌వస్తే ఫరవాలేదుగానీ... లేకుంటే ఎలా? డిపార్ట్‌మెంట్‌కి వస్తే చాలు. ఏవో పనులు. చాలా వర్రీగా ఉంది. మరొక్క ఛాన్స్ మాత్రమే ఉంది. ఈ టెన్షన్‌తో ప్రిపేర్ అవడం కష్టంగా ఉంది మేడమ్"

"ఒకపనిచెయ్యి. మధ్యాహ్నం రెండు గంటలకి వచ్చి సంతకం పెట్టి ఎవరికంటా పడకుండా వెళ్లిపో. నేను నెమ్మదిగా అప్పారావుతో మాట్లాడతాను. ఫరవాలేదు. నేను చెప్తే వింటాడు. ఇక ప్రస్తుతం ఫెలోషిప్ గురించి ఆలోచించకు. నీకు అవసరమైన డబ్బులు నేను సర్దుతాను. మొహమాటపడకు" అని పర్స్‌తీసి అయిదువందల రూపాయలు చేతిలో పెట్టారు.

"డబ్బులు అవసరమయితే- ఇంటికి వచ్చి తీసుకో. కలెక్టర్‌వి అయితే అంతకన్నా కావలసినదేమిటి? కష్టపడి చదువు. తప్పకుండా సక్సెస్ అవుతావు"

"థేంక్యూ మేడమ్. మీ దీవెనలుంటే తప్పకుండా అవుతాను. వెళ్లొస్తాను" అన్నాడు మత్స్యలింగం.

★ ★ ★

సమీర వచ్చేసరికి అందరూ గుంపులుగా చేరి మాట్లాడుకొంటున్నారు.

ఆ ముందురోజు సీనియర్ ప్రొఫెసర్, సెకండియర్ స్టూడెంట్స్‌కి ఎక్స్‌ట్రా క్లాస్ పెట్టి, రెండుగంటలదాకా ఉంచారు.

రసరాజం శృంగారం గురించి చెప్పి చెప్పి చివరగా- ఒక్కొక్కరుగా వచ్చి బుగ్గమీద ముద్దు పెట్టుకొని మరీ వెళ్లాలి అన్నాడుట. ముసిలాడినేకదా, ఫరవాలేదని నసపెట్టడంతో కొందరు చచ్చినట్లు ముద్దు పెట్టి బయటకిపోయారు. ఇష్టపడని వాళ్లని, అబ్బాయిలలో కొందరూ, ఆ ప్రొఫెసరూ కలిసి చాలా అవహేళన చేసి అవమానపరిచారు.

సమీర, ఆమె ఫ్రెండ్స్ బోయ్‌కాట్ చేద్దామని చాలా ఆవేశపడ్డారు. కానీ సీనియర్స్

ఎవరూ వొప్పుకోలేదు. హెడ్‌కి రిపోర్ట్ చెయ్యడానికి కూడా వొప్పుకోలేదు.

హెడ్ ఏమీ చెయ్యడు. కనీసం ఎక్స్‌ప్లనేషన్ కూడా అడగడని ఖచ్చితంగా తెలుసన్నారు. కారణం, హెడ్ ప్రస్తుతం రీడర్. రేపు ప్రొఫెసర్ ఇంటర్వ్యూకి వెళ్లవలసినవాడు. అక్కడ ఛైర్మన్ ఈ ప్రొఫెసరే అవుతాడు. ఏమాత్రం అతడిని ఇప్పుడు ప్రశ్నించినా, ఇంటర్వ్యూలో సబ్జక్ట్ రాదన్పించి, సెలక్షన్ ఆపేస్తాడు.

అదీగాక రెండు సంవత్సరాలుండిపోయే వాళ్లం. మార్కులు రాకుంటే కష్టం. పేపర్స్ వాళ్లే దిద్దుతారు. థర్డ్‌వేల్యుయేషన్ ఉన్నా ప్రయోజనంలేదు. వాళ్ల శిష్య ప్రశిష్యులనే పిలుస్తారు స్పాట్‌కి. దాంతోవాళ్లూ వీళ్లూ ఒకటే కాబట్టి, పేపర్ సీల్ వెయ్యకుండానే ఇచ్చి రెండూ టేలీ చేసి మరీ పంపిస్తారు తలచుకుంటే.

పరీక్షలు మూడు నెలలు కూడాలేవు. ఇప్పుడు ఇలాంటివన్నీ పెట్టుకోకూడదు అని ఖచ్చితంగా చెప్పడంతో,

ఎక్కడలేని దిగులూవచ్చి సమీర క్లాస్‌కి వెళ్లకుండా కేంటీన్ దగ్గర సిమెంట్ బెంచీ మీద కూర్చుని అంతపెద్ద ప్రొఫెసర్ అలా ఎందుకు చెయ్యాలి? అని మనసులోనే గింజుకొంటుండగా,

ఇంగ్లీష్ స్కాలర్ మాధురి చూసింది.

"హాయ్!" అని పలకరించింది.

పలుకు, ఉలుకు లేకుండా కూర్చుంది సమీర.

"ఏంటీ? ఎవరికోసం, ఎదురు చూపులు చూస్తూ ఒంటరిగా కూర్చున్నావు, అమ్మడూ!"

"నీ మొహం... నీకెప్పుడూ ఆ గోలే. సమస్యలతో నేనేడుస్తుంటే!" అంది సమీర.

"ఏవిటి సమస్య? చెప్పవోయ్!" అంటూ పక్కన కూర్చోబోయి వెంటనే మానేసి,

"ఒక పనిచేద్దాం. నాకు కాస్త పని ఉంది. టైమ్ అయిపోతోంది. నడుస్తూ మాట్లాడుకొందాం పద" అంది మాధురి.

నడుస్తూ జరిగిన విషయం అంతా చెప్పండగానే లైబ్రరీలోపలకి వెళ్లింది.

రెండంతస్తులపైన ఉన్న లేడీస్ టాయిలెట్‌లోకి వెళ్లబోయింది మాధురి.

రిఫరెన్స్ సెక్షన్‌కి కాబోలు అనుకొన్న సమీర "టాయిలెట్‌కి ఇక్కడకు రావాలా వెయిటింగ్ రూమ్‌కి వెళ్లొచ్చుగదా!" అంది విసుగ్గా.

"రా, అమ్మడూ!" అని మాధురి లోపలకి వెళ్లి గోడమీద పెట్టిన పుస్తకాలు తీసింది.

ఆశ్చర్యంగా సమీర "ఇక్కడ పుస్తకాలు ఎవరు పెట్టారు? " అంది.

"ఎందుకలా, కళ్లింత సాగదీసి ఆశ్చర్యపోతావు. నేనేపెట్టాను. ఈ పుస్తకాలు నాకు కావాలి. ఇవి దొరికినపుడు టికెట్స్‌లేవు. అక్కడ ఉంచితే ఎవరో ఒకరు తీసుకుపోతారు. అందుకే ఈ పద్ధతి."

"ఇంతకుముందు మరోసెక్షన్‌కి తీసుకువెళ్లి దాచేవాళ్లం. కానీ అది సేఫ్టీకాదు. ఒకో రోజు మంచి అటెండర్ అయితే బయటపడేస్తున్నాడు. అందుకని... ఇలా తప్పదు" అంటూ చేతిలో పుస్తకాలు చూసుకొంది.

"ఏమిటి లాభం? నేను మూడు పుస్తకాలు పెడ్తే రెండే ఉన్నాయి. ఛీ, నీతినియమాలు లేకుండాపోతున్నాయి. ఇక్కడ పెట్టుకొన్నారంటే వాళ్లకి ఎంతో అవసరమయి ఉంటుందనుకోవాలికదా!" అని పుస్తకం తీసినవాళ్లని తిడుతున్న మాధురిని చూస్తే వింతగా అన్పించింది.

ఎక్కడ పుస్తకం అక్కడ ఉండాలనే లైబ్రరీ సూత్రాలు అందరికీ ఉపయోగపడేవి. వాటిని పాటించకుండా వేరే గ్రూప్‌గా వాళ్ల సదుపాయం వాళ్లు చూసుకోవడం అక్కడా నీతిసూత్రాలు పాటించడం లేదని బాధపడడం...

చిత్రంగా అనిపించి అలా ఉండిపోయిన సమీర భుజం తట్టి,

"ఇంతకీ నీ సమస్య. మీ వాళ్లు ఒక ముద్దు పారేసారు. అంతేగా. అదో సమస్య? ఒక ముద్దు పారేస్తే పోయేదేమిటట? మొన్న మా రీడర్ ఒకాయన నా చెయ్యి పట్టుకొన్నాడు తెలుసా? " అని కన్ను గీటి,

"నాదేం పోయింది. హాయిగా పట్టుకోనిచ్చా" అన్నది తేలికగా మాధురి.

"రేప్ చేసినా, చేయించుకో అంటావు. నీ మాటలకేం? "

"ఛాఛా, అలా అనను. రేప్ అంటే భయంకరమైనది. రేప్ చేస్తున్నప్పుడు సెక్స్ అనుకోమంటా, అంతే"

"అలా చెయ్యి. అంతా నీ చుట్టూతా ఉంటారు. ఏమిటసలు? అలా మాట్లాడతావు" అని అయిష్టతనంతా ముఖంలో చూపించింది సమీర.

"ఏమిటే? నేనేదో చాలా ఘోరంగా మాట్లాడినట్టు మొహం పెట్టావు. ఒకటడుగుతాను చెప్పు. ఆడాళ్లకి, మగాళ్లకి తేడా ఎక్కడ? మనం రేప్ చెయ్యబడతామేమోనని భయపడతాం. వాళ్లకి ఆ బాధ లేదు. అంతేగా! ఆ భయంపోతేనే ఆడాళ్లు బాగుపడతారు. అసలు నిజానికి నీలాంటి వాళ్లు ఆడవాళ్ల సమస్యల మీద సానుభూతి చూపిస్తూనే 'పాతివ్రత్యం బోధిస్తారు"

"భయపడమని ఎవడంటాడు. అన్యాయంగా మాట్లాడకు మధూ! చదువు చెప్పవలసిన మాస్టర్లు ఇలా... నువ్వు మాట్లాడుతున్నది నీకు అర్థమవుతోందా? "

"అర్థమయే మాట్లాడుతున్నా. అబ్బాయినే వెళ్లి ఓ అమ్మాయి ముద్దు పెట్టుకొందనుకో వాడు ఏమవుతాడు? నవలోకంలోకి వెళ్లిపోతాడు. మరి అమ్మాయి ఎందుకు ఏదో అపవిత్రం అయినట్టు భావించాలి? "

"అమ్మాయిల ధ్యేయం అబ్బాయిలని అనుకరించడమేనా? అబ్బాయిలేమన్నా ఆదర్శ వ్యక్తులా? వాళ్లని అనుకరించడానికి. అయినా, అందరబ్బాయిలూ నువ్వు చెప్పినట్టు నవలోకానికేం వెళ్లిపోరు..." అని అంటున్న సమీరని ఆపి,

"తల్లీ! నీతో వాదించి లాభం లేదుగానీ, నే పోతాను. కాస్త ఈజీగా తీసుకోవాలి"

"నీలాంటివాళ్లు యూనియన్‌లో కూడా చేరారు"

"ఇలా వున్నాను కాబట్టే రానిచ్చారు. నేను ఒకటి మాత్రం చెప్తాను. ఇక్కడ జరిగే చాలా విషయాలుకన్నా ఇది చాలా చిన్న విషయం. కాంపౌస్ సంగతి పూర్తిగా నీకు తెలియదు. జాగ్రత్త" అని టాటా చెప్పి వెళ్లిపోయింది మాధురి.



మాస్టారు వస్తే ఇంక ఈ కాపలా బాధ తప్పుతుంది. ఈ రోజుతో విముక్తే అనుకొన్నాడు నిశాంత్.

ఛా, నా ఆలోచన ఇలా తగలడుతోందేమిటి? చిన్నప్పుడు మాస్టర్లు పని చెప్తే నాకే చెప్పారు సుమా! అని ఎంత ఫోజు కొట్టేవాళ్లం. అలాంటిది ఇప్పుడు ఇలా ఎందుకన్పిస్తోంది? ఆలోచనలో మార్పా! ఆధునిక మార్పా! మాస్టర్లకి ఎలా చెప్పినా జీతం వస్తుంది. నిజానికి బాగా చెప్పడానికి ప్రామాణికాలులేవు. ఏమీ అర్థం కాకుండా ఎదుటవానికి అంతా చెప్పొచ్చు ఓహో! అన్పించుకోవచ్చు

టీచర్స్ పని ఇద్దరికి సంబంధించినది.

ఇద్దరిలో ఎవరు సరిగా లేకున్నా కుదరదు. సాధారణంగా నేర్చుకొనేవాడి మీదకి తప్పునె ట్టొచ్చు దానికితోడు నష్టపోయేది స్టూడెంటే. అందుకే మనఃస్ఫూర్తిగా టీచర్, మంచి భావాలతో ఉండి, పాఠం చెప్పాలి గానీ, ఎవ్వరూ ఏమీ చేయలేరు.

మరి టీచర్ విషయమే ఇలా అయితే రీసెర్చి గైడ్ గురించి అనుకోనక్కరలేదు. వాళ్ల మనస్ఫూర్తిగా సబ్జక్ట్ మీద ఇంట్రస్ట్‌తో స్కాలర్‌మీద అభిమానంతో వర్క్ చేయిస్తే గానీ జరగదు. స్కాలర్‌మీద అభిమానం ఎలా వస్తుంది. ఏ సంబంధం లేకుండా ఎందుకు అభిమానించాలివాళ్లని. ఈ గంట పాఠం అయిన తర్వాత మీకూ నాకూ సంబంధం లేదు అనడానికి లేదు, వాళ్లకి రాత్రి, పగలు కష్టపడేవాళ్లకి ఆమాత్రం పని చేస్తే తప్పేంటి?

నేను మరీ పాడైపోతున్నాను. అందుకే నావర్క్ అవడంలేదు అనుకొని మనసులోనే బుద్ధిగా లెంపలు వేసుకొన్నాడు నిశాంత్.

మాస్టారు రాగానే ఆనందంగా, గౌరవంగా నమస్కరించాడు.

"ఆ, ఏవోయ్? బాగున్నారా? అవధాని ఏడీ? "

"అవధాని... వాళ్లింట్లో..."

"పోన్లే, జాగ్రత్తగా ఉన్నావుకదా! మీరేదో బాగానే ఉంటారు. ఆమధ్య నా ఫ్రెండ్, ఒక స్కాలర్‌ని ఇంట్లో ఉండమంటే, వాడు నలుగురు ఫ్రెండ్స్‌నీ, నాలుగు విస్కీ సీసాలు కూడా తెచ్చుకొని, నానా రభసా చేశారుట" అని నవ్వి, "మీరు జాగ్రత్తగానే ఉన్నారు కదా!" అన్నారు.

"ఆ! ప్రయాణం బాగా జరిగిందా సర్? "

"జరక్క ఏమవుతుందీ? " అంటూ లోపలికి వెళ్లారు.

అరగంట తరువాత వచ్చిన మాస్టారుతో,

"సర్, నేను వెళ్తాను" అన్నాడు నెమ్మదిగా.

"రేపు కలుద్దాం"

గురువుగారి మూడ్ అద్భుతంగా ఉంది. కాన్ఫరెన్స్ బాగా అయిందేమో! వచ్చి గంటయినా ఒక్కసారీ కసరలేదు. ఈ మూడ్‌లోనే ప్రీపి. హెచ్. డి సంగతి అడగాలనుకొన్నాడు. 'ఏదో చేస్తాను రేపు' అనే ఫీలింగ్ వలన రాత్రి హాయిగా ప్రశాంతంగా నిద్రపోయాడు.

ఉదయం రెండు గంటలు చదివి, ఎనిమిది గంటలకల్లా పుస్తకాలు తీసుకొని, రాముడు మంచి బాలుడు అనేటట్టుగా డిపార్ట్‌మెంట్‌కి వెళ్లాడు నిశాంత్.

తొమ్మిదిన్నరకి చదువుతుండగానే వామనరావు వచ్చాడు. రాగానే అంతా విష్ చేశారు.

"ఏంటోయ్? నిశాంత్! తెగ చదివేస్తున్నావు? రామానుజమ్ లెవెల్‌లో"

ఆ మాట నిశాంత్‌కి మహా ఉత్సాహాన్నిచ్చింది. అబ్బ! నా బతుకులో అసలు ఈయన ఇలా నాతో మాట్లాడతారనుకొన్నానా? ఆయన మేధావి. బాగా కష్టపడతారు. అయినా సరిగ్గా వర్క్ చేయడం లేదు. మేథమెటీషియన్ ఒక్కక్షణం వృథా చేయకూడదంటారు. ఎవ్వరినీ సాధారణంగా ధ్వనిరూపంలో కూడా పొగడరు. అలాంటాయన అలా అనేసరికి నిశాంత్‌కి ఆనందమన్పించి ఇంకా బాగా కష్టపడి చదవాలనుకొంటూనే-

"ఏదో చూస్తున్నా సర్" అన్నాడు కొంచెం సిగ్గుగా.

"ఏంటమ్మా! చూస్తున్నావా? చూడు, నా తండ్రి! చూస్తే ఏమి వస్తుంది? చూసేంత పెద్ద వాడవయిపోయావా? " అని సుమబాలవైపు తిరిగి ఇలా అన్నారు.

"చూస్తే వచ్చేస్తాయా? అల్లాటప్పా అనుకొంటున్నారా? లెక్కపెట్టుకోవాలి. అంతే గాని, పెళ్లిచూపుల్లో పిల్లని చూసినట్టు చూస్తే వస్తాయా లెక్కలు? "

ఆ మాటకి సుమబాల, విజయ్ ఫక్కున

నవ్వారు. అవధానికి కూడా చిన్న నవ్వు వచ్చినా నవ్వబోయి మానేశాడు. నిశాంత్ చిన్నబుచ్చుకొన్నాడు.

నాకు అసలు మాట్లాడడం రాదు. మంచి అవకాశంపోయింది. ఈ రోజు ఇంకేం అడుగుతాను. అంతా నా కర్మ అనుకొన్నాడు. అసలు ఈ సంవత్సరంలో నా అవమానం నంబర్ 14కదా! అనుకొన్నాడు దిగులుగా.

సుమబాల వర్క్ చూస్తున్నారు మాస్టారు. ప్చ్ అమ్మాయినయినా అయ్యేను గాదు. ఓ లుక్ వేస్తే ఎవ్వరైనా వర్క్ చేసేద్దురు అనుకొని మళ్లీ,

అమ్మాయినయినంత మాత్రాన చేసేస్తారా? సుమబాలకి చక్కగా మాట్లాడడం వచ్చు చక్కటి ఫ్యామిలీ బ్యాక్‌గ్రౌండ్ ఉంది. పదిరోజులకొకసారి వాళ్ల నాన్న కూడా వచ్చి ఆమె తరపున మాట్లాడతాడు. నాకెవడున్నాడు? నా గురించి మాట్లాడేవాడెవడున్నాడు?

ఇలా ఆలోచనలు సాగుతుండగా,

మాస్టారి కంఠం ఖంగుమంది.

చాక్‌పీస్ ఇచ్చి, "సెమినార్ చేస్తానన్నావు కదా వెళ్లు" అన్నారు.

ఏమిటో అంతా అయోమయంగా అన్పించింది. ఏవో పిచ్చి ఆలోచనలతో మనసు ఎక్కడకో వెళ్లిపోయింది. ఒక్కక్షణం భయమేసింది.

సెభాష్ అన్పించుకొందామనుకొని రావడం, ఇక్కడ అట్టర్ ఫ్లాప్ అవడం. భూమి చీలి అందులోకి వెళ్లిపోతే బాగుండు.

అసలు తను పిహెచ్.డి.కి పనికిరాడేమో! అంతా రీసెర్చి చేసేద్దామనుకోవడంవలనే వర్డీ వర్క్సు రావడం లేదేమో!

కానీ ఒకప్పుడు పనికిమాలిన వాళ్లంతా ఎందుకు? నిశాంత్‌లాంటి తెలివైన వాడికి చెప్పడానికి బాగుంటుందని పొగిడింది ఈయనే!

అప్పుడే పనికిరావు అంటే హాయిగా ఇంటికి పోయేవాడినికదా! అని మనసులోనే నలిగిపోతున్న నిశాంత్‌తో,

"ఏయ్! ఏంటి? కళ్లు తేలేశావు. నాకు టైమ్‌లేదు. త్వరగా కానీ" అన్నారు గట్టిగా.

"ఎస్ సర్" అని రేపు అనడానికి ధైర్యం లేక చాక్‌పీస్ తీసుకొని బోర్డ్ దగ్గరకు వెళ్లాడు.

బుర్రంతా ఖాళీగా ఉంది. ఏవిటో? ఏమడుగుతారో? ఒకపక్క చిరిగిన బనీను లోపలినుండీ కన్పిస్తుందేమోనని భయం. సుమబాల, విజయ్ నవ్వుతున్నట్టుగా అన్పించి మరీ కుంచించుకుపోయాడు. ఎలాగా అవమానమే. మరి భయం దేనికి, అని అనుకొంటుండగా అనుకొన్నంతా అయింది.

పి. హెచ్. డి. అంటే ఆటలా ఉంది. మాస్టర్లు పనీపాటూ లేక వీళ్లకోసం కూర్చుంటారనుకొన్నాడు.

"చూడండి ఇదీ పద్ధతి. మళ్లీ మామీద ఏడుస్తారు" అని మాస్టారు కేకలు వేశారు.

"అదేంటి? నిశాంత్‌గారూ! అలా చేశారు ప్రిపేర్ అయి రావాలిగదా!" అంది సుమబాల.

'నీకెందుకు నంగనాచీ! పెద్ద అభిమానం కారిపోయినట్టు. తెలివైన దానిలా ఫోజు. మూడోసారి రాస్తేగానీ సి.ఎస్.ఐ.ఆర్ రాలేదుగానీ అయినా ఫోజే' అనుకున్నాడు మనసులో నిశాంత్.

అంతలోనే నీరసం వచ్చింది. ఏడాది మీద ఆరు నెలలయ్యింది. ప్రి పి. హెచ్. డి ఊసేలేదు. గట్టిగా ఎవరైనా అడిగితే దేని మీద రీసెర్చి చేస్తున్నాడో తనకే తెలియదు.

"ఇంకా ఎందుకు ఇక్కడ? బయటకు కదులు" అన్నారు మాస్టారు.

ఈసురోమని బయటకి వచ్చేశాడు నిశాంత్.

మరో మూడు రోజులు వరసగా వెళ్లి విష్ చేసినా కోపంగా చూశారు తప్ప లోపలకి రమ్మనలేదు. తెగించి వెళ్లడానికి సాహ

సించలేదు.

డిపార్ట్‌మెంట్‌కి వెళ్లడానికి ఇంట్రస్ట్‌పోయి కాస్త కోపం పోయాక వెళ్దాం అనుకొన్నాడు. లైబ్రరీలో కాసేపు కాలక్షేపం చేయడం, వెళ్లి పోవడం మాస్టారు సాయం లేనిదే ముందుకి సాగదు. చదువు అంటేనే బోర్ అన్పించేస్తోందేమిటి? పాడయిపోతున్నా అనుకొని బలవంతాన డిపార్ట్‌మెంట్‌కి వెళ్లాడు.

విద్యార్థి అని ఎందుకు అన్నారో బాగా తెలుస్తోంది అనుకొంటూ నిలబడ్డాడు. పొమ్మంటాడు అనుకొన్న వాడికి వంద రూపాయలు ఇచ్చినట్టయింది. నవ్వుతూ ఆహ్వానించారు మాస్టారు.

ఇన్నాళ్ల సంఘర్షణ, నిశాంత్ మనసులో జరిగింది తప్ప, ఆయనకి అసలు గుర్తేలేదు.

"ఇప్పుడే నీ గురించి అనుకొన్నాను. నెలా ఖరికి ఫారెన్ నుండీ స్వామిగారు వాళ్లూ వస్తున్నారు. సెమినార్స్ అవీ ఉన్నాయి. మీరంతా జాగ్రత్తగా ఫాలో అవ్వండి. ముఖ్యంగా నీకే నిశాంత్ చెప్తున్నా. ఒకసారి హెడ్‌ని కూడా కలవండి" అని సెమినార్స్ దేనిమీద, ఏమిటి అనే విశేషాలు కాసేపు చెప్పేసరికి నిశాంత్‌కి ఉత్సాహం వచ్చింది.

ఏదోరకంగా మాస్టారిని కలసినందుకు ఆనందించాడు. మంచి సెమినార్స్ వినే యోగం కలిగింది. వారం రోజులు ఒక్క క్షణం వృథా చేయకుండా ప్రశాంతంగా చదువుకొన్నాడు. అక్కడక్కడా డౌట్స్ అవీ క్లియర్ చేస్తుకొన్నాడు.

సెమినార్ ప్రారంభమయ్యాక మరీ ఉత్సాహంగా అన్పించింది. కాన్సెన్‌ట్రేషన్ పే చేసి వినడం చాలా కష్టమన్పించినా ఉత్సాహం మాత్రం పోలేదు. వాళ్లు చాలా చక్కగా లెక్చర్స్ ఇచ్చారు. స్కాలర్స్ అడిగిన సందేహాలకి కూడా వోపిగ్గా సమాధానం చెప్పారు. మాస్టారికి ఉన్న సబ్జక్ట్ కమాండ్ వలన మాస్టారి స్కాలర్స్‌ని కూడా గౌరవం గానే చూశారు. చక్కగా మాట్లాడారు. దానికితోడు విశాఖ చూపించడానికి నిశాంత్‌ని, అవధానిని పంపించారు. దానివలన వాళ్లతో ఎక్కువసేపు మాట్లాడ్డానికి అవకాశం దొరికింది. వాళ్లు ప్లీజ్ అయి, మా యూనివర్శిటీకి రాకూడదూ, రీసెర్చికి అన్నారు. అవధాని, తన పి. హెచ్. డి ఇంచుమించు అయిపోయినట్టే కాబట్టి మాట్లాడలేదు. నిశాంత్ అవకాశం ఇస్తే వస్తాము సర్ అన్నాడు.

"మేము వెళ్లాక అప్లికేషన్ సంగతి చూసి పంపిస్తాము తప్పకుండా" అని ప్రామిస్ చేసి బాగా వర్క్ చెయ్యమని ప్రోత్సహించి మరీ వెళ్లారు.

★ ★ ★

మాస్టారు ప్రశాంతంగా ఉన్నప్పుడే బిల్ పెట్టాలని అవధాని వాళ్ళతోపాటు నిశాంత్ కూడా సంతకం పెట్టించుకొన్నాడు.

అవధాని బంధువులు రిజిస్ట్రార్ ఆఫీస్‌లో ఉండడంవలన అతని పాత బిల్ వచ్చింది. నిశాంత్ బిల్ మాత్రం రాలేదు.

అవధానిని అడగమనడానికి మొహమాటం, దానికితోడు- ఈ పని వాళ్ళు చెయ్యవలసినదే కదా! చెయ్యడానికి ఏమి? అనే పట్టుదలవలనా ఎవరితోనూ అడిగించలేదు నిశాంత్.

కొత్తబిల్లు ఇస్తూ పాతబిల్లు సంగతి అడిగాడు నిశాంత్.

"ఏమో! ఎవరి దగ్గర వుందో? సూపరింటెండెంట్ వచ్చాక అడగండి" అన్నాడు.

"ఎప్పుడొస్తారు? "

"ఏమో! వచ్చాక తెలుస్తుంది" అన్నాడు కేర్‌లెస్‌గా.

ఈ రోజు ఎలాగైనా సరే, బిల్లు సంగతి తేల్చుకోవాలనుకొన్నాడు. బయటకి వచ్చి వెయిట్ చేస్తూ నిల్చున్నాడు.

అక్కడ సమీర ఉంది.

"మీరేంటి ఇక్కడకి వచ్చారు? " అడిగాడు నిశాంత్.

"మా ఫ్రెండ్ బిల్ రావాలి. కనుక్కొందా మని వచ్చాను. సూపరింటెండెంట్ రావా లట కదా!" అంది.

అరగంట పిచ్చాపాటీ మాట్లాడుకొని కాల క్షేపం చేసారు.

అపుడు సిగరెట్ కాల్చుకొంటూ తాపీగా,

"సర్, నిశాంత్, మేథ్స్ డిపార్ట్‌మెంట్. బిల్ పంపారండీ? "

నాలుగు ఫైళ్ళు చూసి,

"ఏవీ లేవే ఇక్కడ... వెంకయ్యని అడ గండి" అన్నాడు.

"ఆయనే మిమ్మల్ని అడగమన్నారు" అని నెమ్మదిగా అన్నాడు నిశాంత్.

"ఏంటీ? ఉంటే దాచుకొంటామా? "

"నామీద అరుస్తాడేంటి? క్లర్క్‌ని పిలిచి అడగొచ్చుకదా!" అనుకొని మళ్ళీ మొదట అడిగిన వ్యక్తి దగ్గరకే వెళ్ళాడు.

"సర్... మిమ్మల్నే అడగమన్నారు"

"ఎవరూ? " అన్నాడతను ఏమీ ఎరగ నట్టు.

రూమ్ వేరు అన్న పేరు తప్ప, నిజానికి ద్వారం మాత్రమే మధ్యలో ఉంది. మళ్ళీ గోత్రనామాలు చెప్పుకొని బిల్లు సంగతడి గాడు.

"టపాస్‌లో చూడండి"

ఇదేదో ముందే చెప్పొచ్చుగా అనుకొని టపాస్ దగ్గరకి వెళ్ళి అడిగాడు.

"ఎప్పుడు వచ్చిందో డేట్ చెప్పండి" అన్నాడు తాపీగా.

గతుక్కుమన్నాడు నిశాంత్. మూడు నెలలు దాటిపోయింది. ఎలా గుర్తుం టుంది? అసలు గుర్తుంచుకోవాలనుకొంటే కదా! జ్ఞాపకం చేసుకొందుకైనా?

"చూసి... తర్వాత చెప్తాలెండి" అని బయటపడ్డాడు.

అప్పటికే రెండుమూడు సార్లు వెళ్ళిన సమీర డేట్ అవీ తెచ్చి ఫైల్ బయటకి తీయించింది.

వెంకయ్య తీరుబడిగా నవ్వుతూ,

"కూర్చోండి మేడమ్" అన్నాడు.

కూర్చున్న సమీరతో,

"ఏం చేస్తున్నారు? ఎక్కడ ఉంటు న్నారు? " అని కులాసాగా మాట్లాడాడు.

అయిదు నిముషాల తర్వాత బిల్లు సంగతి అడిగింది.

"రేపురండి... పంపిస్తాను" అన్నాడు.

పంపడానికి తన అవసరం ఏవిటో తెలి యలేదు సమీరకి.

"మళ్ళీ రేపెందుకు సార్! ఇవాళ చూద్దురు" అంది కాస్త నవ్వుపులుముకొని.

"అంతకన్నా ముందు వచ్చినవే చాలా ఉన్నాయి. రేపు కూడా అసలు అవదు. పాపం! మీరంత దూరంనుండీ వచ్చారు కదా, అని రేపు చేస్తానన్నాను"

"అయితే రేపు పదిగంటలకి రానా? "

"ఊ"

ఊ, అనగానే వెళ్ళబోయింది సమీర.

వెళ్తున్న ఆమెని పిలిచి,

"టీ, అయినా కనీసం ఇప్పించలేదు" అన్నాడు.

టీ ఎందుకు ఇప్పించాలి? నువ్వేమయినా నా నెత్తిమీద చుట్టానివా? వెధవ నవ్వూ, వెధవ అడుక్కోవడమూ, అని తిట్టుకొంటూ,

"ఇహిహి..." అని ఓ వెర్రినవ్వు నవ్వింది.

నవ్వుతూనే "రేపు వస్తాను గదా!" అన్నది.

ఆ మాటకి పొంగిపోయాడు వెంకయ్య.

పక్కన ఉన్న లేడీటైపిస్ట్‌కి అసహ్యమే సింది.

ఆమె ముఖం చూసిన సమీరకి దుఃఖం వచ్చింది. ఛీ, ఈ వెధవపనికి రాకూడదు అనుకొంది. తేజ సుర్తొచ్చి పోన్లే, అని సరి పెట్టుకొని, సున్నితత్వం తగ్గించుకోవాలను కొంది.

మర్నాడు పది గంటలకల్లా ప్రిన్స్‌పాల్ ఆఫీస్‌కి వెళ్ళింది సమీర. మరో అరగంటకి వెంకయ్య తాపీగా వచ్చి కూర్చున్నాడు.

"మార్నింగ్" అని సమీర ఎదురు కుర్చీలో కూలబడ్డది.

"ఆ, వచ్చారా? ఏదీ? టీ ఇప్పిస్తాన న్నారు. దానికోసమే వచ్చాను. ఇంత ఎర్లీగా" అని భుజాలు ఎత్తి దింపాడు స్టైలుగా అన్నాననుకొని.

"టీకేముంది సార్, తాగుదాం. ఫైల్ సంగతి చూడండి" అన్న సమీరని దొంగ చూపులు చూస్తూ,

"ఇలా వచ్చారో లేదో అంతకంగారేంటి?"

"అబ్బే! కంగారులేదు. నీ కుక్కచూపులు భరిస్తూ, ఇక్కడే ఇలా కూర్చుంటాను. దౌర్భాగ్యుడా" అని తిట్టుకొంది. పైకి ఏమనాలో తెలియక నిశ్శబ్దంగా కూర్చుంది సమీర.

"ఏంటండీ? మరీ ధర్నా చేస్తున్నట్టున్నారు" అంటూనే,

"బయట ఏదో హడావుడిగా ఉందే, చూద్దాం, ఉండండి" అని బయటకి వెళ్లిపోయాడు వెంకయ్య.

బయట సినిమా షూటింగ్. డ్యూటీ మాని చూస్తూ కూర్చుంటాడా? వస్తాడులే, అనుకొన్న సమీర అంచనా తప్పయింది. పన్నెండున్నర దాటినా రాలేదు. బయటకి వచ్చి చూసినా ఆ జనాలలో ఎక్కడున్నాడో తెలియలేదు. ఈరోజుకింతే సంగతులనుకొని వెళ్ళిపోయింది సమీర.

మూడు రోజులు షూటింగ్ హడావుడిలో నిశాంత్‌కి, సమీరకి కూడా కనబడలేదు వెంకయ్య. తర్వాత కూడా ఒక రోజు రిజిస్ట్రార్ ఆఫీస్‌కి వెళ్తున్నానని, ఒకరోజు ప్రిన్సిపాల్ పిల్చారని, ఒకరోజు యూనియన్ ఆఫీస్‌కి వెళ్లాలని ఏదో వొకటి చెప్తుండటంతో మరో వారం గడిచిపోయింది.

విసుగువచ్చిన సమీర ఒకరోజు,

"మీపని మీరు చేయడానికి ఇలా అయిపోతున్నారేం?" అని గట్టిగా అడిగింది.

"ఏంటండోయ్! మాటలు గట్టిగా వస్తున్నాయ్! మీకెందుకు నేను చెప్పాలి? మీకు సంబంధించిన విషయం కాదు. ఎవరి గురించో వచ్చి ఇలా దబాయించేస్తున్నారు" అన్నాడు వెంకయ్య.

పక్కనే ఉన్న నిశాంత్,

"నా బిల్లు సంగతి చూడండి. నాకు సంబంధించినదే కదా!" అన్నాడు.

ఆ మాటకి రెచ్చిపోయాడు వెంకయ్య.

"ఏ నెలది ఆ నెల పంపాలి. ఇలా నెలల తర్వాత వచ్చి మమ్మల్ని దొబ్బుతారేం. అసలు మీలాంటి వాళ్ళ సంగతి సి. ఎస్. ఐ. ఆర్‌కి రాయాలి. నెలల తరబడి ఇళ్లకి దొబ్బేయడం..." అని మొదలెట్టేసరికి,

బిక్కముఖంపెట్టి, దిక్కుతోచక నిలబడ్డాడు నిశాంత్.

అతని ముఖంచూసిన సమీర,

"టైమ్ వేస్ట్ ఎందుకు. ఎప్పటికో, అప్పటికి వస్తుందిగా. నేను స్లోగా అడుగుతాలెండి వెళ్ళండి" అంది.

హమ్మయ్య! అనుకొని రావడం మానేసాడు నిశాంత్.

సమీర నెమ్మదిగా, కూల్‌గా మాట్లాడి జాగ్రత్తగా మేనేజ్ చేసి ఫైల్ వెనకాతల నడిచి ఎట్టకేలకు తేజ బిల్లు పంపింది.

నిశాంత్ బిల్లు సంగతి అడిగితే చావు కబురు చల్లగా చెప్పినట్టు,

"ఆయన బిల్లుపోయింది" అన్నాడు.

"అదేంటండీ, అన్యాయం" అన్నది సమీర.

"మీ పని అయింది కదా, మీకెందుకు?" అన్నాడు కఠినంగా వెంకయ్య.

ఏం మాట్లాడలేకపోయింది సమీర.

"ఇలా పనులు చేయించుకొంటారు. మాకేం చేయరు. మమ్మల్ని మరచిపోతారు" అన్నాడు వెంకయ్య.

"మేము ఏం చెయ్యగలం సర్, థేంక్స్ చెప్పడం తప్ప" అని బయటపడి,

బలికానురాదేవుడా! బిడ్డు బ్రహ్మావదిలాడు అనుకొంది.

★ ★ ★

బిల్లు పోయిన సంగతి విన్న నిశాంత్‌కి మిన్ను విరిగిమీద పడ్డట్టయింది. ఒక్కసారి బిల్లు సంతకానికే నానాపాట్లూ పడవలసి వచ్చింది. మళ్ళీ పెట్టించాలంటే గైడ్‌తోనూ కష్టమే. హెడ్‌తో మరీ కష్టం. దురదృష్టం ముందు పుట్టి నేను పుట్టాను అనుకొన్నాడు భారంగా.

అతని ముఖం చూస్తే జాలేసింది సమీరకి.

"బిల్లు నాకివ్వండి. నేను చూస్తాను. ఇంతకీ సంతకం పెట్టారా?"

"గైడ్‌కి కాళ్ళావేళ్ళా పడతారానీ, మా హెడ్ ఓ తిక్క శంకరయ్య. అన్నిటికీ రూల్స్‌అనీ, అదనీ, ఇదనీ ఏపనీ అవని వ్వడు. ఏ నెల బిల్లు ఆ నెలేగానీ ఇన్ని నెల లేంటి? అంటారు"

"ఏదోలాగ పెట్టించండి"

"ఆ దరిద్రుడు మళ్ళీ పారేస్తే"

"ఈసారి పారేయడు. నే చూస్తాలెండి"

"మీకు ఎందుకులెండి. టైమ్‌వేస్ట్"

"ఏం ఫరవాలేదు. నేనేమీ చదివి ఉద్ధరిం చేదిలేదు. హాయిగా మీరు వర్క్ చేసు కోండి. రేపు నాకు ఇచ్చేయండి"

"ఏంటీ? రేపా! ఎంత ఈజీగా చెప్తు న్నారు. ఛస్తే పెట్టరు మా హెడ్. ఈ వారం పోయాక సెలవుపెట్టి ఊరెళ్తారు. అప్పుడు ఇన్-చార్జి చేత పెట్టిస్తాను. ఈమధ్యే తెలుసుకొన్నాను ఈ కిటుకు"

"శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపా యాలు. తప్పదు కదా! సంతకం అవగానే నాకివ్వండి" అని చెప్పి వెళ్ళిపోయింది సమీర.

★ ★ ★

అతివేగంగా, కంగారుగా ఇంచుమించు పరిగెడ్తూ జీడిమామిడి చెట్టువైపు వెళ్తూ కన్పించింది జలజ.

"జలజగారూ!" అని పిలిచింది సమీర.

భయంగా వెనక్కి తిరిగి సమీరని చూసి చేత్తో రమ్మనమని సైగచేసి, తను ఆగ కుండా వెళ్ళి ఒక చెట్టుచాటున ఎవ్వరికీ కన బడనిచోట కూర్చుంది.

"ఏమయిందీ?" అన్న సమీర మాటలకి, సమీర చేతులు పట్టుకొని వెక్కివెక్కి ఏడ్చింది.

ఆ ఏడుపు ఆపడం అసాధ్యం అన్పిం చింది. ఏడవడంవలన ఏమీ చెప్పలేకపో యింది.

అయిదు నిముషాలయినా ఆపకపోయేస రికి భయమేసి,

"ఏమయింది చెప్పండీ?" అన్నది వణుకు తున్న గొంతుకతో సమీర.

అప్పటికి కాస్త ఏడుపు ఉధృతం తగ్గించు కొన్న జలజ,

"మరేమో! ఏం చెప్పను. మా మాస్టారు ఈరోజు... నేను రూమ్‌లోకి వెళ్లగానే..." అని నసిగింది.

"ఆ, వెళ్లగానే... చెప్పండి"

"అబ్బే, బాగానే మాట్లాడారు"

"అయితే, దానికి ఏడవడం దేనికి?"

"మాట్లాడుతూ... గభాల్న చెయ్యిపట్టుకొ న్నారు. ఎంత భయమేసిందనుకొన్నావు" అని మళ్ళీ ఏడ్చింది.

ఏడుపు ఆపుకొందుకి ప్రయత్నిస్తూ,

"ఎప్పటినుండో నేనంటే ఇష్టమేనని... ఏదేదో అన్నారు. నాకేవీ వినబడలేదు"

"ఏడవకండీ... ప్లీజ్"

"ఏడవక ఏం చేయను. నా బాధ ఎవరికి తెలుసు. ప్రతి క్షణం భయపడుతూ నేనేమి రీసెర్చి చేస్తాను. ఈ వెధవ రీసెర్చి మానే స్తాను. నా సరదాకొద్దీ జాయిన్ అయ్యాను. అసలు ఈ రీసెర్చి వద్దని మా అమ్మ గోలపెడ్తూనే ఉంది. పి.హెచ్.డి. ఉన్న మొగుడ్ని నేను తేలేను అని రోజూ చెప్తు తూనే ఉంది. ఆఖరికి థీసిస్ సబ్మిట్ చెయ్యను. ఊరికే అలా చదువుతాను. అంతా రెడీగా ఉంచుకొని, పెళ్ళయ్యాక, ఆయన ఒప్పుకొంటే చేస్తాను, అని

చెప్పాను. ఇప్పుడు ఈ విషయం తెలిసిందంటే ఇంక గుమ్మం కదలనివ్వదు" అని మరోసారి కళ్ళనీళ్లు పెట్టుకొంది జలజ.

"అర్థంలేకుండా మాట్లాడతారేమి. అమ్మకి ఎలా తెలుస్తుంది. అయినా, చిన్నపిల్లలా భయపడతారేంటి? అమ్మకి మీరు చెప్తేగా, తెలిసేది. మీరు చెప్పకండి"

"నీకేవీ తెలియదు. నేనే చెప్పాలా? మరొకరు చెప్పకూడదా? "

"ఎవరైనా చూసారా? "

"ఆ, పెద్దపాలేరుగాడు చూసాడుగా!" అంది భయంగా.

"ఎవరూ? " అన్నది ఆశ్చర్యంగా సమీర.

"అదేలే, పెద్దపాలేరని అంటాము. సుబ్బారావు అని మా సీనియర్ ఒకతను. అతను రోజుకి ముప్పై గంటలు మా ప్రొఫెసర్‌గారింటిలోనే ఉంటాడు. వాళ్ల పిల్లల్ని స్కూలుకి దింపడం, వాళ్ళ ఇంటికి సిమెంట్ చేయించడం, కార్పెంటరీ వర్క్... ఇలా... అదీ... ఇదీ అనేమీలేదు. సమస్తం చేతులు నులుముకొని నిల్చుని చేస్తాడు. చెయ్యడానికి సిద్ధంగా ఉంటాడు. నెక్స్ట్ రిక్రూట్‌మెంట్‌లో అతనికి పోస్ట్ గేరంటీ. దానికోసమే ఆ తాపత్రయం. అందుకనే పెద్ద పాలేరంటాము"

సమీర నవ్వి "భలేవుంది. చిన్నపాలేరు కూడా ఉన్నాడా? " అని అడిగింది.

"ఆ, ఒక్కడేం. ఒక అరడజను మంది ఉన్నారు ఆయన దగ్గరే గబ్బిలాల్లాగ... ఎప్పటికైనా ఒక పోస్ట్ తగలకపోతుందా అని. వాళ్లు వేలకివేలు డబ్బు కూడా ఖర్చు పెడతారు. అరే! ఇలా మాట్లాడుతున్నానేమిటి? పిచ్చిపిచ్చిగా" అని నిశ్శబ్దంగా కూర్చుంది జలజ.

డిపార్ట్‌మెంట్ విషయాలు చెప్పేస్తున్నా. ఇక్కడ చెట్టుకి, కొమ్మకి, టీ గ్లాసుకి కూడా చెవులుంటాయి. అవి చేరేసేస్తాయి అనుకొని అయ్యో! నాకీరోజు ఏమయింది? ఇలా వాగేసాను అని తిట్టుకొంది. అయినా ఎవ్వరికీ చెప్పకుండా అసలుండలేను అనుకొని వెధవగోల ఈ రీసెర్చి మానేస్తే... అనుకొని ఒక్క క్షణంలో మానేస్తానని నిర్ణయించుకొంది జలజ.

"సమీరా! నేను రీసెర్చి మానేస్తాను" అంది దిగులుగా.

"అదేం... రీసెర్చి మానేయడం ఏమిటి?"

"అదికాదు... నిజంగా చెప్తున్నా. అస్తమానం ఎక్కడ చెయ్యేస్తాడో అని భయపడుతూ ఎలా వెళ్తాను, చెప్పు"

"పోనీ, గైడ్‌ని మార్చుకోవచ్చుగదా? "

"అదంతతేలికకాదు. అదీగాక పెద్దవాళ్ళు ఇద్దరే. ఈయనే నయం. ఇతను పెనం అయితే అతడు పొయ్యి. ఎమ్.ఎ.లోనే భరించలేక స్పెషల్ మార్చుకొని ఈయన దగ్గర చేరాను. వీళ్ళిద్దరి దగ్గరనుండీ మారి వస్తానంటే తీసుకొనేవాళ్లు ఎవరూ లేరు" అంది జలజ.

ఏం మాట్లాడాలో తెలియక సమీర మౌనంగా కూర్చుంది.

పదినిముషాలు తనలో తనే ఆలోచించుకొన్న జలజ,

"అయినా ఏదో ఎమోషనల్‌గా ఒక్క క్షణం అలా బిహేవ్ చేసి ఉండొచ్చు కదా! ఆయనా మనిషేగా. నిజంగా హెరేస్ చేద్దామనుకోకపోవచ్చు. అదే ఉద్దేశం అయితే, మరో రెండుసార్లు కలిసేసరికి తెలిసిపోతుంది గదా! తొందరపడకూడదు. నిదానంగా ఉండి, ముందు జరిగినది మరచిపోయి రేపటినుండీ మామూలుగా ఉండాలి నేను. తప్పదు. ఇక్కడి వాతావరణంలో అదే చెయ్యాలి కదూ!" అంది చాలా దిగులుగా.

సున్నితతత్వం చంపుకొని ప్రతిక్షణం సర్దుకుపోవడం తప్పదన్పించగానే మనసులో కెలికినట్లయింది సమీరకి.

"సర్దుకోక తప్పదు. మూడు సంవత్సరాలు

దాటిపోయింది. ఇప్పుడు మానేసి ఎలా వెళ్తాను. కానీ సమీరా, ఒక్కసాయం చేస్తావా? "

"ఏంటీ? "

"ఈ సంగతి ఎవరికీ చెప్పకూడదు"

"చా, చెప్పను"

"చెప్పనంటే కాదు, వొట్టు వెయ్యి" అని చెయ్యి చాచి వొట్టు వేయించుకొని ఆ క్షణం లోనే జరిగినది మరచిపోయింది.

మరో పదినిముషాల తర్వాత-

"ఇంటికి పోదాం పద" అన్న జలజతో-

"మీరు వెళ్లండి, నేను రాను" అంది సమీర.

"ఇలా తిండిమానేసి లైబ్రరీలో వేలాడితే వచ్చేది చదువు కాదు. నీరసం. పద పోదాం"

"ఊహూ, నేను రాను. నాకు ఇంటికి వెళ్లాలన్పించకే లైబ్రరీలో ఉంటున్నా"

"ఏం? ఏమయ్యింది? "

"ఏవీలేదు. పెళ్లిచూపులు. వద్దంటే వినరు. విసిగించేస్తున్నారు"

"పెళ్లిచూపులా! దానికి ఆనందించక ఇదేమి ఏడుపు ముఖం"

"నాకు ఇష్టం లేదు. నా పెళ్లయ్యాక అన్న య్యది చెయ్యాలని చంపేస్తున్నారు"

"నిజంగా ఎంత అదృష్టవంతురాలివో! చూడు. నేనూ ఉన్నాను. ఎక్కడ పెళ్ళి చెయ్యాల్సివస్తుందోనని అన్న ఇంట్లోంచి వెళ్లి పోయాడు. మా పెద్దక్క ఆస్తి అమ్మి తన కొడుకు ఇంజినీరింగ్ సీటు కోసం 50,000 రూ. ఇమ్మంటుంది తప్ప ఒక్క సంబంధం చూసి పెళ్లిచేద్దాం అనుకోదు. మా అమ్మ అయితే 'ఆ యోగం రావాలికదా' అంటూ సాగదీస్తుంది. నేను ఎంత బాధ పడుతు న్నానో! ఎంత వేగం ఆ కొంపలోంచి నుండీ బయట పడతానా అని చూస్తున్నాను. కట్నం ఎక్కువ ఇచ్చేస్తారేమోనని భయం, ప్రతి ఒక్కరికీ. ఆఖరికి మా అమ్మకి కూడా"

అని చెప్తున్న జలజ మాటలని ఆపి-

"కట్నం ఇచ్చి పెళ్లి చేసుకోవాలంటే బాధగా ఉండదూ" అంది సమీర.

"ఎందుకు ఉంటుంది. ఏం, మనకేమన్నా ఆస్తిలో భాగం ఇచ్చేస్తారా? అంతా వాళ్లే దొబ్బితింటారు. మరి, ఒక 50,000 రూ. ఇస్తే అరిగిపోతారా? అంతెందుకూ... దీనికీ అని సాగదీస్తారు".

ఆ మాటలకి ఆశ్చర్యపోయింది సమీర.

"కట్నం నీకు ఉండదుగా. మరో మగాడు హాయిగా వాడుకొంటాడు. నీకేమిటి లాభం? ఆస్తిలోనే భాగం అడగొచ్చుకదా!"

"నీకేం తెలియదు. ప్రాక్టికల్‌గా ఉండాలి. కట్నానికే ఏడ్చేవాళ్లు. నిజంగా ఆస్తిలో భాగం ఇస్తారా? దానికోసం కోర్టుకి వెళ్లలే ముకదా! వెధవ సెంటిమెంట్స్ ఏడిసాయి కదా! కట్నం మనకి ఇవ్వకపోయినా మనం వెళ్ళే ఇంటికి వాడతారు. ఆ ఇంటి ప్రోగ్రెస్‌తో మనకీ సంబంధం ఉంటుందికదా! పిచ్చి పిచ్చి ఆలోచనలు పెట్టుకోకుండా హాయిగా పెళ్లిచేసుకోవడం మంచిది" అంది జలజ.

"ప్చ్!" అని దీర్ఘంగా నిట్టూర్చింది సమీర.

"నాది సెల్‌ఫిష్ ఆర్గ్యుమెంట్ అనిపి స్తోందికదూ! పోనీ. నీపెళ్లి నువ్వు చేసుకోగ లననే నమ్మకం నీకుంటే ధైర్యంగా, స్థిరంగా ఉండు. అంతేగానీ, ఇలా బాధగా, పిచ్చి పిచ్చి ఆలోచనలు పెట్టుకొంటే చదువు పాడై పోతుంది" అంది.

"చదివినా, ఈ డిగ్రీతో ఏ ఉద్యోగం వస్తుంది. ఒకోరోజు చాలా దిగులుగా ఉంటుంది"అంది సమీర. నిరుత్సాహంగా కూర్చోవడం భరింపలేని జలజ-

మాటలు మార్చి "తేజ రమ్మంది. వెళ్దాం పద" అని బలవంతాన తేజ ఇంటికి తీసు కువెళ్ళింది.

ముగ్గురూ కలసి భోజనం చేశారు అక్కడే.

"ఇంతకీ కృష్ణగారి వర్క్ ఎలా ఉంది? "

అని అడిగింది జలజ.

"వాళ్ళ మాస్టారు వైఫ్‌ని తీసుకొని ఫారెన్ వెళ్తున్నారు. ఆరు నెలలదాకా రారు. ఈమధ్య కూడా ఆ ప్రయత్నాలలోనే ఉన్నారు. అందుకనే కాలేజీలో పార్ట్‌టైమ్ ఇప్పించారు. ప్రస్తుతం కాలేజీకి వెళ్తున్నాడు. మళ్ళీ ఆయన వచ్చేదాకా అంతే సంగతులు. ప్రస్తుతం డబ్బులు కావాలికదా" అంది తేజ.

"కాలేజీలో ఏమిస్తారేమిటి మహా! ఎమ్. సెట్‌కి చెప్పొచ్చుకదా" అంది జలజ.

"దానికయితే అన్నీ వదిలేసి అంకితం అయిపోవాలి. రీసెర్చి ఏప్టిట్యూడ్ పోతుందేమోనని భయం. సబ్మిట్ చేశాక మొదలెడదామని మానేశాడు"

"డాక్టర్ అన్పించుకొనేసరికి ఎమ్. సెట్‌కి మళ్ళీ కొత్త అయిపోతారు. ప్రొఫెసర్స్, రీడర్స్ అంతా రీసెర్చి ఏప్టిట్యూడ్ పక్కన పెట్టి, కోచింగ్ సెంటర్‌ల మీద పడుతూ వుంటే... ఏంటో? ఈ స్కాలర్స్ ఎప్పుడు బాగుపడతారో" అంది జలజ విచారంగా.

"తమ సంగతి తాము చూసుకొంటారు గానీ, చాలా ఆలస్యమయిందిప్పటికే, పోదాం" అని సమీర కంగారు పెట్టడంతో వెళ్ళిపోయారు.

★ ★ ★

"హలో! సమీరగారూ! బాగున్నారా? " అని పలకరించాడు నిశాంత్.

"ఈమధ్య మీరు కన్పించడం లేదే? "

"అవునండీ, కాస్త వర్క్ అవుతోంది"

"ఓహో! అందుకా! కొద్దిగా హుషారుగా ఉన్నారు. ఇంతకీ బిల్లు ఏవయ్యింది. సంతకం పెట్టించారా? "

"సంతకం అయ్యిందిగానీ, ఆఫీస్‌లో ఇంకా ఇవ్వలేదు"

"నేను ఇస్తానన్నాకదా! మరచిపోయాను. అయినా మీకు హాస్టల్ దగ్గరేకదా! ఎంతసేపు ఇవ్వడం"

"ఇవ్వడం కష్టం కాదనుకోండి. కానీ ఆ వెంకయ్యతో మాటలు పడడం కష్టం. అందుకని ఎవరైనా ఇస్తే బాగుంటుందని... "

"మేము మాత్రం, మాటలు పడము. పాపం! నేను తిట్లు తిన్నా ఫరవాలేదు అంతేగా! "

"బాబోయ్! అది కాదు. అతగాడు తిడితే నన్ను తిడతాడుగానీ, మిమ్మల్ని కాదుగదా? వీళ్ళంతా వర్క్ చెయ్యరు. బిల్లు పెట్టడానికి కూడా ఓపిక ఉండదు. డబ్బులు మాత్రం కావాలి, అన్నాడనుకోండి. మీరు కూడా అవునండీ అతడికి మహాశ్రద్ధ అని మరో నాలుగు తిట్టి ఏదోలాగా మేనేజ్ చెయ్యగలరని. మీకు శ్రమ అయితే మీరేం చెయ్యనక్కరలేదు. ఇంతకీ, మీరు ఎందుకంత కోపంగా, రోషంగా ఉన్నారు? "

"కోపం లేదు ఏమీలేదు... పరీక్షలు వచ్చేస్తున్నాయి. చదవడంలేదు. భయంగా ఉంది. సరేగానీ, బిల్లు ఇవ్వండి. నేపోతా" నంది సమీర.

"వద్దులెండి... అంత తిట్టుకొంటూ చెయ్యడం ఎందుకు? "

"తిట్టుకోవడం లేదు. ప్రామిస్ చేశానుగా. అయినా ఒక్క సంవత్సరం ఆగండి ఎమ్. ఏ. అయ్యాక నిరుద్యోగినేకదా! అప్పుడు సర్వీస్ యూనిట్ పెట్టి రిజిష్ట్రార్ ఆఫీస్ పనులు, ప్రిన్సిపాల్ ఆఫీస్ పనులు చేసి మీలాంటి వాళ్ళ దగ్గర మా బిల్ ముక్కుపిండి వసూలు చేస్తాను"

"అలాగా! అయితే, ఈ సంవత్సరం బిల్లులు అట్టే పెట్టమంటారా? "

"మీరలా, అన్నేసి వేలు ఒకేసారి కొట్టేస్తే వెంకయ్యలాగే నా సొమ్మేదో ఇచ్చేసినట్టు నేనూ జెలసీ ఫీల్ అవుతా. అందుకని ఏ నెల బిల్లు ఆ నెల పెట్టుకోండి" అని చెప్పి-

"టైమయింది, వస్తాను" అంది సమీర.

★ ★ ★

నిశాంత్‌ని కలవడానిక వచ్చిన జగన్ అటుపక్క వస్తున్న సమీరని చూస్తూ-

"ఈ బాలాకుమారి స్కాలరా?

స్టూడెంటా? " అన్నాడు.

"ఎవరూ? ఆమె ప్రీవియస్ స్టూడెంట్ సమీర"

"నీకు అంత బాగా తెలుసా? అరే నీ కోసమే వస్తున్నట్టున్నది" అని వెంటనే-

"ఏవి బాసూ! చాలబోర్ కొట్టిందా. ఈమెకి వేసావు లైన్" అన్నాడు జగన్.

"ఛీ ఊర్కో" అన్నాడు కంగారుగా అప్పటికే దగ్గరగా వచ్చిన సమీర విన్నదేమోనని భయపడిపోతూ.

ఆ మాటలు వినలేదు సమీర.

"మీ బిల్లు సేంక్షన్ అయివచ్చింది. డబ్బులు బ్యాంక్‌కి వచ్చాయట. తీసుకోండి" అంది సమీర.

"నిజంగా! మెనీ మెనీ థేంక్స్" అని చాలా ఆనందంగా,

"నేనయితే ఇంకా పంపకేపోను. ఈమె ధర్మమా అని వచ్చాయి" అన్నాడు జగన్‌తో.

"సరేలే! నువ్వూ, నేనూ వెళ్తే ఎవడు చేస్తాడు? అమ్మాయిలయితే ఓ లుక్ వేస్తే ఎవరైనా చేసేస్తారు" అన్నాడు జగన్.

తెల్లబోయింది సమీర. నిశాంత్‌కి జగన్ మాట తీరు తెలిసినా మరీ ఇలా ముఖం మీద అనడం బాధన్పించింది. ఏవి మాట్లాడాలో కూడా తెలియలేదు.

సమీరకి మరుక్షణం కోపమొచ్చింది.

"ఏంఫరవాలేదు. ఏదో మాకు పనిచేసి ఓ లుక్ వేస్తే వేశాడు. పనీ మాకు చేసిపెట్టకుండానే, ఆడపిల్ల కన్పిస్తే చాలు ఆబగా లుక్స్ వేసే వెధవాయలని చాలామందిని చూశాను. వాళ్లకన్నా బెటరేకదా!" అని వెనక్కి తిరిగింది వెళ్ళిపోవడానికి.

తన కోసం, తనకి మేనేజ్ చెయ్యడం రావడంలేదని హెల్ప్ చేసిన సమీరని అలా అనడం... చాలా బాధన్పించి నిశాంత్-

"ఏంటి జగన్, అలా అనకుండా ఉండాల్సింది" అన్నాడు.

సమీర వెనక్కి తిరిగి-

"అలాంటి వాగుళ్ల వలన నాకేవీ నష్టం లేదు. బాధాపడను" అని తీవ్రంగా గబగబా వెళ్లిపోయింది.

"ఎందుకలా వాగి, బాధపెడతావు. నీ వాగుడు వింటే ఎవరూ మంచివాడవని అనుకోరు. ఎన్నిసార్లు చెప్పినా అంతే" అని తిట్టాడు నిశాంత్.

"బాసూ! వదిలేయ్. మనిషికో వీక్‌నెస్ మహిలో ఉండవలయున్‌కదా! ఆమెకి లేని బాధ నీకెందుకు? ఎంత ధైర్యంగా సమాధానం చెప్పింది. ఇంతకీ గురూ! ఈమెని ఎలా పట్టావ్? "

"ఛత్. వెధవకబుర్లు. వద్దన్నకొద్దీ చెప్తావ్. ఇంతకీ ఎందుకు వచ్చినట్టు" అన్నాడు నిశాంత్.

"వాసుదేవ్‌గారు వస్తున్నారు"

"ఎవరూ? "

"అదేనోయ్. ఫిజిక్స్‌లో డాక్టరేట్ చేసి సెకండరీ గ్రేడ్ సింగిల్ టీచర్‌గా వెళ్ళిపోయిన వాసుదేవ్. తమరి ప్రియస్నేహితుడు"

"ఎప్పుడు వచ్చారు? అరే, నన్ను కలవలేదే? " అన్నాడు ఆత్రంగా.

"ఊరెళ్లారు. గురువారం వస్తారట. తవరిని రూమ్‌లో ఉండమన్నారు. మాట్లాడాలట"

"డబ్బులు అందాక వస్తున్నారు. మంచి పార్టీ ఇవ్వాలి. ఎప్పుడూ తను ఇవ్వడమే గానీ, నేనివ్వలేదు" అన్నాడు నిశాంత్.

"చూడు, నాకీవారం కుదరదు. బాకీలో వ్రాసుకొంటా. తర్వాత వసూలు చేస్తాను" అని చెప్పి జగన్ వెళ్లిపోయాడు.

★ ★ ★

బ్యాంక్‌లో డబ్బులు తీసుకొని రూమ్‌కి వచ్చాడు నిశాంత్.

అప్పులు చిట్టా తీసి, అర్జున్‌కి డబ్బులు ఇచ్చేక మిగతావాటి సంగతి చూద్దామనుకొని, అర్జున్‌కోసంఎదురు చూస్తూ-

ఈలోగా ఉత్తరాలు చదవాలని కూర్చున్నాడు. పోస్టలు ముద్రలు ఉన్న తేదీల బట్టీ వరుసగా పెడుతుండగా అర్జున్ వచ్చాడు.

"ఉత్తరాలకి మోక్షం వచ్చిందా? అవును, నిశాంత్! ఈ పద్ధతేంటి? విచిత్రంగా. వచ్చిన ఉత్తరాలు ఎప్పటికప్పుడు చదవాలి గానీ- ఇలా దొంతరలుగా చదివి, ఏంటి లాభం? "

"మీకయితే- ఏవో రాజకీయ విషయాలు. వ్యవసాయానికి ఏమందులు తేవాలో లిస్ట్, ఆవు కోడిపెయ్య పెట్టింది, జున్ను తినడానికి రమ్మనమని రాస్తారు కాబట్టి వెంటనే ఉత్తరం చదువుతావు. చదవాలి. నా ఉత్తరాలన్నిటి సారాంశం నాకు తెలుసు. అన్నీ డబ్బు పంపితేగానీ తీరేవి కావు. వాడికి ఫీజు, అప్పులు, చెల్లి పెళ్లి నీ పెళ్లితో ముడిపడిఉంది. కాబట్టి త్వరగా పెళ్లి చేసేసుకో. చదువు మానేసి, ఏదైనా ఉద్యోగం చూసుకో లాంటివే ఉంటాయి.

నాకు డబ్బులు చేతికందాక చూశాననుకో. పంపించగలను. గొప్పగా, మీ అందరిలాగే చదివేననుకో, ఏదో ఇలా గెడ్డాలు పెంచి తిరుగుతున్నాను. అప్పుడు అమానుషంగా ఉన్నానేమోనని భయపడి ఇలా కూడా తిరగలేను. అందువలనే చదవను. ఈ పద్ధతి అలవాటు చేసుకున్నా" అని చెప్పి అర్జున్‌కివ్వవలసిన డబ్బులు ఇచ్చేడు.

"థేంక్యూ, ఆకస్మిక ధనలాభం, కాస్త ఈ పుస్తకాలు రిటన్ చేసేయవా! ఫైన్ పడుతోంది" అని లైబ్రరీ పుస్తకాలు ఇస్తూ- అందులో నుండీ ఒక కవరుతీసి చేతిలో పెట్టాడు.

"సి.ఎస్.ఐ.ఆర్. నుండీ వచ్చింది. ఇది మాత్రం వెంటనే చదువు" అన్నాడు నవ్వుతూ అర్జున్.

"చదివి "బాప్‌రే" అన్నాడు నిశాంత్.

"ఏంటి? "

"ఇయర్లీ రిపోర్ట్ పంపమని. కరువులో అధికమాసం"

"వర్క్ చేస్తూనే ఉన్నావుగా"

"ఏవి వర్కో! ప్రీ పిహెచ్.డి. కూడా అవలేదుగా"

"ఇది చూపించి నెమ్మదిగా అడుగు. ఆయన ఏదో చేస్తారు. ఊరికే అన్నిటికి వర్రీ అవుతావు అనవసరంగా" అని బయటకి వెళ్లిపోయాడు అర్జున్.

★ ★ ★

భగవాన్! ఈరోజు మాస్టారు మంచి మూడ్‌లో ఉండాలని ప్రార్థిస్తూ డిపార్ట్‌మెంట్‌లోకి అడుగుపెట్టాడు నిశాంత్. మూడ్ బాగుంటే సి.ఎస్.ఐ.ఆర్.కి ఏదో రిపోర్ట్ రాసి పంపేస్తారు. నెమ్మదిగా ప్రీ పిహెచ్.డి. విషయం అడగొచ్చు అనుకొంటుండగా ఎదురుగా రీడర్ శ్రీరాములు కన్పించారు.

"నమస్తే!" అన్నాడు నిశాంత్.

"ఆ! ఏవిటోయ్! ఎలావుంది నీ రీసెర్చి? ఏమంటున్నారు .మీ గురువర్యులు? " అన్నారు వెక్కిరింతగా.

నిశాంత్ గైడ్ వామనరావుకి, శ్రీరాములుకి పడదు. శ్రీరాములు తమ్ముడు వామనరావు దగ్గర స్కాలర్‌గా చేరాడు. అతడి వర్క్ పూర్తిచేయకుండా నానాతిప్పలూ పెట్టడంతో అతను విసిగి బికారివాడిలా తయారయ్యేడు. అప్పటికి శ్రీరాములు అమెరికాలో ఉన్నాడు. తమ్ముడి సంగతి తెలిసి, ఇక్కడ రీసెర్చి వదిలిపెట్టించి తను అమెరికానుండీ తిరిగిరాగానే తమ్ముణ్ణి అమెరికా పంపారు.

అప్పటినుండీ వామనరావు అంటే మంట. వామనరావుని ఏమీ అనలేక అతని స్కాలర్స్‌మీద ఏదో మాట విసురుతాడు.

ఆ ధోరణిలోనే నిశాంత్‌ని మీ గురువర్యులు ఏం చేస్తున్నారని అడిగాడు. దానికి సమాధానం ఏం చెప్పాలో తెలియక మెదలకుండా ఊరుకొన్నాడు నిశాంత్

"ఏమిటీ మాట్లాడవు. మీ గురువులాగే



డిగ్నిటీ మెయింటైన్ చేద్దామనుకొంటున్నావా? అసలు నీ రీసెర్చి టాపిక్ ఏంటట? ”

“ఇంకా డిసైడ్ అవలేదు. నేనీమధ్యే వర్క్ మొదలెట్టాను”

“ఏంటీ? ఇంకా అవలేదా? గొప్ప స్కాలర్స్. గొప్ప గైడ్. మీ గురువు నిర్ణయించేసరికి నీకు రిటైర్‌మెంట్ వయస్సు వచ్చేస్తుందేమో! జాగ్రత్త” అంటూ రూమ్‌లోకి వెళ్ళిపోయాడు.

సంతకం పెడ్తున్న నిశాంత్‌కి, వామనరావు సెలవు అని తెలియడంతో వెంటనే లైబ్రరీకి వెళ్ళిపోయాడు.

మర్నాడు, వామనరావు రూమ్‌లోకి వెళ్ళి విష్ చేయబోయాడు నిశాంత్.

“ఓహో! తవరా! ఏమ్మా? తమకి దేని మీద రీసెర్చి చేస్తున్నారో కూడా తెలియదా! నీకు తెలిసి ఏడవకపోతే నన్ను అడగాలి గానీ వాళ్లెవరి దగ్గరో మొరపెట్టుకోవడం దేనికి? వాళ్లు రికమెండ్ చేస్తారనుకొ

న్నావా? అసలు చేసిన వర్క్ ఏంటట? "
అని వామనరావు కేకలు మొదలెట్టేసరికి నిర్ఘాంతపోయాడు నిశాంత్.

"అదిగో, నా దగ్గర నేను అరవాలేగాని పెదవి విప్పవు. మొండితనం. ఊరందరి దగ్గరా వాగగలవు" అన్న మాస్టారి మాట లకి నేనెవరి దగ్గరా వాగను అని గట్టిగా అరవాలన్పించినా, అరవడానికి కూడా ఏదో భయం. అసలు నేనింకా నా వర్క్ సంగతి మాట్లాడలేదే! మరి ఈయన ఇలా ఎందుకు రెచ్చిపోతున్నారు. అనుకొన్నాడుగానీ అది శ్రీరాములవారి వాఙ్మహిమ అని తెలియలేదు.

మాస్టారు కేకలు ప్రారంభించగానే ఎంత వేగం అక్కడనుండీ తప్పించుకుపోదామా, అన్పిస్తుంది తప్ప ఇంకేమీ ఆలోచించడానికి కూడా అతనికి ధైర్యం ఉండదు. అకస్మా త్తుగా ఏదైనా అదృశ్యశక్తి వస్తే బాగుణ్ను అనుకొన్నాడు.

మాస్టారి ఎదురుగా కూర్చున్న సుమబాల, "పోనీలెండి సార్. నిశాంత్‌గారి బదులు నేను సారీచెప్తున్నా. ఏమీ అనుకోకండి" అన్నది.

నాబదులు నువ్వు సారీచెప్పడమేమిటి? అసలు నేను సారీ చెప్పవలసినంత తప్పేం చేసాను? అనుకొన్నాడు మనసులోనే కచ్చగా.

"అవునమ్మా! మనం ఇతని గురించి తాప త్రయపడడమేగానీ, అతను మాట్లాడడు. చూడు, ఎలా నిలబడ్డాడో!"

మాస్టారు కొద్దిగా శాంతించేరు కదా అని, "సార్, నేను, నిశాంత్ లైబ్రరీకి వెళ్ళి మీరు తెమ్మన్న జర్నల్స్ తెస్తాము" అన్నాడు అవ ధాని.

"వెళ్ళండి... కానీ నిశాంత్! నా దగ్గర వర్క్‌నచ్చకపోతే మధ్యాహ్నం ఏదో ఒకటి తేల్చుకొందాంలే" అన్నారు.

మధ్యాహ్నం కదా! ప్రస్తుతానికి బయటప డుతున్నాకదా! అనుకొని అవధానితోపాటూ బయటకి వచ్చేశాడు.

"మధ్యాహ్నం మళ్ళీ పంచాయతీ పెడ్తాడు కాబోలు!" అన్నాడు నిశాంత్.

"మధ్యాహ్నం రాకండి. కాస్త మూడ్ మారేక కన్పిస్తే సరి" అని చెప్పాడు అవ ధాని.

"అలాగే, కానీ నేను ప్రస్తుతం లైబ్రరీకి రాలేనండీ. రూమ్‌కి పోతాను"

"అంత సున్నితంగా ఉండకూడదు. నన్ను తిడుతున్నారుగా. నన్ను తిడ్తున్నా మీరు లోపలికి రాకుండా పారిపోతారు. అలా అయితే ఎలా? ఆయన సంగతి తెలుసు కదా! సర్లెండి రేపు వస్తారు కదా" అన్నాడు అవధాని.

★ ★ ★

నిత్యం చచ్చేవాడికోసం ఏడ్చేవాడెవడ న్నట్టు మాస్టారు ఎందుకు రెచ్చిపోయారో, ఆలోచించడం దండగ అనుకొన్న నిశాంత్ ముసుగుదన్ని నిద్రలోకి జారిపోయాడు.

వాసుదేవ్ వచ్చి లేపాడు నిశాంత్‌ని.

"హలో! బాగున్నారా? జాబ్ ఎలా ఉంది? చాలా రోజులయింది, మిమ్మల్ని చూసి. దగ్గరదగ్గర సంవత్సరం అయింది కదూ మీరు వెళ్ళి. అప్పటినుండీ మధ్యలో ఒక్కసారి మాత్రమే వచ్చారు" అని ఆద రంగా చేతులు పట్టుకొని కూర్చోబెట్టాడు.

"నా బాధలు నీకేం తెలుసు. ఇప్పుడ యినా తెగించి వచ్చేసాను. సింగిల్ టీచ ర్‌ని అవడంవలన సెలవులే వాడుకోవడం అవడంలేదు. ఒక్కరోజు స్కూల్‌కి సెలవు పెట్టినా ఊరిప్రెసిడెంట్ నుండీ బొడ్డూడని వాడిదాకా అంతా నిలదీసేవారే. చచ్చీ చెడీ బయల్దేరితే ఏ వర్షమోవచ్చి, ఆ కుగ్రామం నుండీ బయటపడలేము. కనీసం ఎంప్లాయి మెంట్ న్యూస్ అయినారాదు. ఏ పోస్ట్‌లు పడుతున్నాయో తెలీదు. ఏ ఫ్రెండ్ ద్వారానో తెలిసినా డ్రాఫ్ట్ కట్టి అప్లైచెయ్యా లంటే సిటీకొచ్చి ఆ పని చెయ్యాలి. అదో

రెండు రోజుల పని. పోనీ, దసరా సెలవు లవీ ఉంటాయంటే ఏదో పని. జనాభాలె క్కలో, వయోజనవిద్యో! ఏదో ఒకటి. మిగి లిన వారం మా అమ్మా, నాన్నలదగ్గరకి వెళ్ళి వాళ్లని చూడాలి. అత్తారింటికి వెళ్ళాలి. పోనీ, వెళ్ళడం మానేద్దామనుకొంటే ముసలి తనంలో వదిలేసామనుకొని బాధపడతారు.

ఈ వెధవ ఉద్యోగానికి వెళ్ళి ఎంత బుద్ధి తక్కువ పనిచేసానా? అన్పిస్తోంది. మీరంతా చెప్తూనే ఉన్నారు. కానీ, గవర్న మెంటు ఉద్యోగం ఆ మాత్రం సెక్యూరిటీ మనకి ఎవరు ఇస్తారు? మళ్లీ ఏజ్ బార్ అయ్యేలోపల ఉద్యోగాలు తీస్తారని నమ్మకం లేదు. సర్కారోళ్ల మనసుల్లో దూరలేము కదా!" అని బాధ పడ్డాడు వాసుదేవ్.

'పోన్లెండి, పి. హెచ్. డి. అయ్యాక ఇక్కడ ఉంటే మాత్రం ఏమి వచ్చేస్తున్నాయి? ఎవ రిమీదా ఆధారపడకుండా ఉద్యోగం వుంది"

"ఉద్యోగం! ఇదేవిపుద్యోగం. భయపడి పారిపోయాగానీ, అసలు నా చదువేంటి? నా ఉద్యోగం ఏంటి? అ, ఆలు చెప్పుకొం టూగడపడం ఎంత భయంకరంగా వుందో? జాబ్ సేటిస్‌ఫేక్షన్ ఉండాలికదా! సబ్జెక్ట్ అంతా మరచిపోయానన్పిస్తోంది. కనీసం మాట్లాడడానికి కూడా ఎవ్వరూ ఉండరు. డబ్బులు కన్నా జాబ్ సేటిస్‌ఫే క్షన్ ఉంటే చాలు. ఒకోరోజు ఎంత డిప్రె షన్ వచ్చేస్తుందో! నిజం చెప్పాలంటే మాస్కూల్ పిల్లలకీ అన్యాయం చేస్తున్నా. నాకా తృప్తిలేను. అందుకే నేనో నిర్ణయానికి వచ్చాను. ఒక 15,000 రూపాయలు నావైఫ్ చేతిలో పెట్టి వాళ్ళమ్మగారి దగ్గర దిగబె ట్టాను. కష్టమో నష్టమో భరించమన్నాను. ఆరునెలలు ఇక్కడే వుండి ఏదో యూనివర్శి టీలో ఉద్యోగం సంపాదిస్తే రీసెర్చి కెరీర్ బాగుంటుంది కదా! ఉద్యోగం రాకుంటే కనీసం రీసెర్చి అసోసియేట్ అయినా రావాలి. అంతవరకూ నీరూమ్‌లోనే ఉండాలి. నీకు రూమ్ సాంక్షన్ అయిందిట కదా!"

"అవును. కానీ ఇక్కడలవాటయి వెళ్ళాల న్పించలేదు. మీరువస్తే మారిపోతాను"

"థేంక్యూ... అక్కావాళ్ళింట్లో వారం పది రోజులయితే ఫరవాలేదుగానీ, లేకుంటే వాళ్లకీ ఇబ్బందే. ఈ విషయం మాట్లాడా లనే జగన్‌చేత కబురుపెట్టాను"

"దీనికి చెప్పాలా? రేపే మారిపోతాను. మీరు ఎప్పుడు వచ్చినా ఫరవాలేదు. మీరు వస్తే మీతోపాటూ నేనూ చదువుతాను" అన్నాడు నిశాంత్.

"ఇంతకీ నీవర్క్ ఎలా ఉంది" అడిగాడు వాసుదేవ్.

"ఏదో నడుస్తోంది. మీరు ఎప్పుడువ స్తారు? "

"వారంరోజులు పోయాక వస్తాను. వచ్చే ముందు తెలియజేస్తాను. ప్రస్తుతం ఊరె ళ్ళాలి"

"ఇప్పుడే వెళ్ళిపోతారా? "

"మళ్ళీ వారంనుండీ ఇక్కడే ఉంటానుగా!" అని వాసుదేవ్ వెళ్ళిపోయాడు.

వాసుదేవ్ వస్తాడంటే చాలాహాయిగా అన్పించింది నిశాంత్‌కి. అతను కూడా తన లాగే రూమ్‌నంటిపెట్టుకొనే ఉంటాడు. సొంతతమ్ముడిలా చూస్తాడు. అతనుంటే ఒంటరితనం పోతుంది. వర్క్ చేసేమూడ్ వస్తుందనుకొన్నాడు.

అంతలోనే మాస్టారు గుర్తొచ్చి బాధగా మూల్గింది మనసు. ఎలాగైనా మాస్టారికి క్లోజ్ అవ్వాలనుకొన్నాడు.

★ ★ ★

రోజూ డిపార్ట్‌మెంట్‌కి వెళ్ళి, సంతకం పెట్టి ఒకగంట అక్కడే కాలక్షేపం చేస్తు న్నాడు నిశాంత్.

నేరస్తుడిలా చూసే మాస్టారి చూపులు తట్టుకోవడం కష్టంగా వున్నప్పటికీ, మానే యడానికి ధైర్యంలేదు. పదిరోజులైనా ఏమాత్రం పట్టించుకోలేదు మాస్టారు.

ఎందుకు వెళ్తున్నాడో తెలియక, నిస్సత్తువగా నీరసంగా, విసుగ్గా అన్పించింది ఒక్క రోజూ ఎంకరేజ్ చెయ్యడనుకొంటూ చాలా నిరాసక్తతతో వున్న నిశాంత్‌కి,

పోస్ట్‌లో స్వామిగారినుండీ ఒక కవరువచ్చింది. తన జాతకం మారిపోయిందని మహానందపడిపోయాడు. కవరు పట్టుకొని ప్రొఫెసర్ జ్ఞానేశ్వర్‌గారి రూమ్‌కి వెళ్ళాడు.

జ్ఞానేశ్వర్ సీనియర్ మోస్ట్ ప్రొఫెసర్. మంచి మనిషి. ఆయన శిష్యుడేస్వామి. ఎవరు అమెరికా వెళ్ళినా అప్పులు ఇచ్చేది జ్ఞానేశ్వరే. డబ్బులున్నవారు కూడా మాస్టారిచేత్తో ఇస్తే మంచిదని తీసుకొంటారు. ఆస్తులుండడమేగాక, ఎదుటివాళ్ళకి సాయపడాలనే మనస్తత్వం ఉండడంవలన, అందరికీ సాయపడతారు.

ఎటువంటి రాజకీయాలతో ప్రమేయంలేకుండా తామరాకుమీద నీటిబొట్టులా ఉండే జ్ఞానేశ్వర్ అంటే డిపార్ట్‌మెంట్‌లో అందరికీ గౌరవమే. అందరూ ఆయన సలహా, సహాయం పొందుతుంటారు. ఆయనికి సబ్జక్టులో కూడా మంచి కమాండ్ ఉంది. జీవితం హాయిగా జీవించడానికే అన్నట్టుగా ఎప్పుడూ ఆనందంగా హాయిగా ఉంటారు.

అటువంటి వ్యక్తిదగ్గరకి నిశాంత్‌లాంటి బిడియస్తులు కూడా నిస్సంకోచంగా వెళ్ళగలరు.

రూమ్‌లో ఎవరూ లేకుండా ఒక్కరూ ఉండడం శుభసూచకంగా అన్పించింది నిశాంత్‌కి.

"సర్! అమెరికా స్వామిగారు అప్లికేషన్ పంపారు"

"ఎవరూ? సదానందస్వామా? నాక్కూ వచ్చింది లెటర్. అప్లైచేస్తున్నావా? "

"మిమ్మల్నడిగి..."

"అప్లై చెయ్యి. ఫైనాన్స్ అదీ నేను సర్దుతానులే. ఇక్కడ వాతావరణంకన్నా నీకు బాగుండొచ్చు ఈమధ్యే కదా శ్రీరాములు వచ్చారు. ఆయన్నొకసారి కలువు. అతని తమ్ముడు అక్కడే ఉన్నాడు కాబట్టి ఎకామిడేషన్ ప్రాబ్లమ్ ఉండకపోవచ్చు"

"శ్రీరాములగారినా? " అన్నాడు కొద్దిగా నిరుత్సాహంగా.

"ఏం ఫరవాలేదు. తప్పకుండా హెల్ప్‌చేస్తారు. నేనూ చెప్తాను గుడ్‌లక్" అన్నారు జ్ఞానేశ్వర్.

"థాంక్యూ సర్"

ఎందుకో ఉక్కిరిబిక్కిరి అయ్యేంత సంతోషంగా అన్పించింది. వెంటనే శ్రీరాములిని కలసి విషయం చెప్పాడు. అతను చాలా సంతోషించాడు.

"వెరీగుడ్... మంచిపని చేస్తున్నావు. ఈ పని చెయ్యక తప్పదని నాకు తెలుసు" అన్నారు శ్రీరాములు.

అప్పుడే వామనరావు వచ్చారక్కడికి. ఆయన్ని చూడగానే శ్రీరాములు,

"ఏంటండీ? మీ నిశాంత్ అమెరికా వెళ్ళిపోతాడట" అన్నాడు.

తను నెమ్మదిగా చెప్దామనుకొంటే, ఈయన అప్పుడే ఈ మాట అంటించేసాడు. వెధవబ్రతుకు. ఎప్పుడూ భయపడుతూ ఉండడమే. అవమానం 14ని మించిపోతోంది అనుకొని, తన ఆలోచనలలో తనుండి ఏమీ మాట్లాడలేదు నిశాంత్.

వామనరావు తీవ్రస్థాయిలో కేకలు ఆరంభించారు. ఆయన మాటలు నిశాంత్ వినడంలేదని అర్థమయింది.

"ఇదిగో... చూడు" అని భుజం తట్టిమరీ,

"చూడుబాబూ! అమెరికాలోనయినా అంతరిక్షంలోనయినా మనకి సత్తా ఉంటేనే అవుతుంది. అమెరికా మోజు ఎక్కువయిపోయింది. అక్కడికి వెళ్ళి మీరు రాసుకొనేది మన జోగినేగా! జోగీజోగీ రాసుకొంటే ఏమవుతుందీ? అదే అవుతుంది. అయినా నాకు చెప్పకుండా ఎక్కడకి వెళ్తావు? గైడ్‌ని, నాకు చెప్పకుండా వీళ్లకి చెప్పడమేమిటి? నీకు

ఇష్టంలేదూ, నా దగ్గరనుండీ మారిపో, అంతేగాని ఇలాంటి బిహేవియర్‌ని నేను ఛస్తే వొప్పుకోను. ఏదో పెద్ద తెలివైనవాడిని అనుకొంటున్నావు. అమెరికావెళ్లి ఉద్ధరించేస్తావు. సత్తా ఉండాలయ్యా! నా దగ్గర రీసెర్చి బాగులేదటా బాబుగారికి..." అంటూ ఇంకా ఏదో అనబోతున్నారు వామనరావు.

బాగా అవమానంగా అన్పించి, ఉక్రోషం, కోపం వచ్చి సహనం చచ్చిపోయింది నిశాంత్‌కి.

"మీదగ్గర బాగులేదు. ప్రతిక్షణం చంపుకు తింటున్నారు. నాకు సత్తా వుందో లేదోగానీ మీదగ్గర మాత్రం చెయ్యను. మారిపో మారిపో అంటున్నారు. మారిపోతాను. మీ గైడెన్స్ నాకు నచ్చలేదు. ఈరోజే మీదగ్గర నుండి మారిపోతాను" అని వామనరావు గొంతుస్థాయిని మించిపోయి అంటున్న నిశాంత్ మాటలకి తెల్లబోయారు.

ఆ కేకలకి చుట్టుపక్కలవారు కూడా చుట్టూచేరారు. ఎంతసేపూ తను తిట్టడమే గాని, ఎవరూ ఎదురు చెప్పడం అలవాటు లేని వామనరావుకి అహం దెబ్బతింది.

"నా గైడెన్స్ నచ్చలేదా? మారిపోతావా? నిన్ను ఎవరు తీసుకొంటారో నేనూ చూస్తాను"

"ఎవ్వరూ తీసుకోకపోతే, పెట్టేబేడా పట్టుకొని మా వూరుపోతాను. ట్యూషన్స్ చెప్పుకొనైనా బతుకుతా తప్ప మీలాంటి వాళ్లదగ్గర స్కాలర్‌గా ఉండి నిత్యం చావను. అయినా అందరూ మీలాగే ఉండరు. గైడ్‌ని మార్చుకొనేహక్కు మాకూ వుంది"

"ఓహో! హక్కుల గురించి మాట్లాడుతున్నావా? నేను సంతకం పెడ్తేనే ఎవడైనా నిన్ను తీసుకోగలరనే విషయం గుర్తుంచుకో"

"ఎలా సంతకం పెట్టరో నేనూ చూస్తాను" అని రెచ్చిపోతున్న నిశాంత్‌ని ఆపడానికి చూశారు శ్రీరాములు.

"అసలు మీవలనే ఇదంతా జరిగింది. మీ తమ్ముడ్ని ఆయన హెరేస్ చేశాడని మీకు కోపం. ఆ కోపం మాద్వారా తీర్చుకోవాలి అనుకొన్నారు. మాతో స్నేహంగా మాట్లాడినట్లు మాట్లాడి, ప్రతీదీ ఆయన చెవులో ఊదేయడమే. మీరు మేధావులు కావచ్చు పేపర్స్ రాయొచ్చు కానీ, కల్చర్‌లో జీరో. మంచితనంలో మైనస్ మార్క్సులో ఉన్నారు. మీలాంటివారివలనే యూనివర్శిటీలు తగలడుతున్నాయి. రీసెర్చి అనుకోవడమే బుద్ధితక్కువ" అని అతితీవ్రంగా చాలా ఆవేశంగా మాట్లాడుతున్న నిశాంత్‌ని ఆపే సాహసం ఎవ్వరికీ లేకపోయింది.

పక్కరూమ్‌లో ఉన్న జ్ఞానేశ్వర్ వచ్చి,

"మిస్టర్ నిశాంత్! ఏమిటీ న్యూసెన్స్. ఇష్టంలేకపోతే కాగితాలు పెట్టి గైడ్‌ని మార్చుకో. ఇలిట్రేట్స్‌లా ఏవిటా అరుపులు. కేంపాస్‌లో ఉన్నామన్న విషయం మరచిపోతున్నారు వెళ్ళిక" అనగానే,

తలెగరేసి, స్థిరంగా 'ఎస్ సర్' అని చకచకా వెళ్ళిపోయాడు.

రూమ్‌కి వెళ్ళి రెండు బకెట్ల నీళ్ళు తలనిండా స్నానంచేసి, ఈరోజుతో గొడవ వదిలిపోయిందనుకొని నిశ్చింతగా నిద్రపోయాడు.



వాసుదేవ్ తన లగేజీ అంతా సర్దుకొన్నాడు. నిశాంత్ సామాన్లు ఎక్కడ వక్కడ

పడిఉండడంచూసి,

నిశాంత్ పుస్తకాలు కూడా నీట్‌గా సర్దాడు.

"చూడు, ఇప్పుడు ఎంత నీట్‌గా ఉందో! రూమ్ చిందరవందరగా ఉంటే మనసు కూడా గాభరాగా ఉంటుంది. ఈ మాత్రం నీట్‌గా వుంచలేమా? " అన్నాడు నిశాంత్ ముఖంలోకి చూస్తూ వాసుదేవ్.

"ఇంట్రస్ట్‌వుంటే ఉంచుకోవచ్చు"

"మనం ఉంటున్నచోటు మీద, తింటున్న తిండి మీదా కూడా ఇంట్రస్ట్ లేకుండా ఉన్నావా? " అంటూ నిశితంగా చూసి,

"ఏపీ అంత డల్‌గా ఉన్నావు. ఏమయ్యింది? " అన్నాడు.

అంతవరకూ ఎవ్వరికీ చెప్పకుండా మనసులోనే బాధ అంతా దాచుకొన్న నిశాంత్ ఇంక ఉండలేక గబగబా జరిగినది చెప్పాడు.

అంతా విన్న వాసుదేవ్ "దానికి బాధ ఎందుకు? హాయిగా అమెరికా వెళ్ళిపో. కానీ... శ్రీరాములిగారిని ఎందుకు అన్నావు. ఆయన మనకి హెల్ప్‌చేయాలి కదా!"

"పోన్లెద్దూ... ఆయనేం చేస్తాడు. అయినా మాగ్రైడ్ హెరేస్ చేస్తాడని అందరికీ తెలుసు. ఈయన మహాగొప్పగా ఉన్నాననుకొంటున్నాడు. ఎంత ఏడ్పిస్తున్నాడో! ప్రతిసారీ, నేను మాట్లాడిన మాటకి మరోరంగు పూసి ఆయన చెవిలో ఊదుతాడు. ఆయన ఎగురుతాడు ఛీ, వెధవ దరిద్రం నేను భరించలేను"

"అసలు వాళ్ళిద్దరికీ పడదు కదా! అస్తమానం ఎందుకు కలుస్తారు? "

"ఏదో ప్రాజెక్ట్‌వర్క్ కలసి చేస్తున్నారు మా ప్రాణానికి గండంలాగ. ఒకరినొకరు తిట్టుకోవడమే. మధ్య మాలాంటి వాళ్ళని పావుల్ని చేస్తున్నారు"

"అయిందేదో అయిందిగానీ, అలా పడుకొంటే ఎలాగ? తర్వాత సంగతి ఆలోచించాలి కదా! ఏదో లాగ అమెరికా వెళ్ళిపో"

"అమెరికానా? ఎక్కడకి వెళ్లను. అమెరికా వెళ్ళినా, అంతరిక్షం వెళ్ళినా సత్తావుండాలి కదా! మాస్టారు అన్నట్టు అక్కడకి వెళ్తే, ఇంకా భ్రష్టుడ్ని అవుతా. అక్కడకి వెళ్ళి ఫెయిల్ అయితే అప్పులు కూడా చుట్టుకొంటాయి. మా సిస్టర్ మ్యారేజికూడా చేయాలి. నాన్నగారికి ఏపీ తెలియదు. డబ్బులు కూడా చూడాలి" అన్నాడు నీరసంగా.

"తర్వాత ఆలోచిద్దాం. ప్రస్తుతానికి సినిమాకి పోదామా? " అన్నాడు వాసుదేవ్.

"నేను రాలేను"

"నేను, అక్కావాళ్ళింటికి వెళ్ళొస్తాను" అన్నాడు వాసుదేవ్.

★ ★ ★

వారంరోజులయినా నిశాంత్ ఏపీ మారలేదు. అలాగే బాగా ఆకలివేస్తే కాస్త తినడం. మళ్ళీ పడుకోవడం గెడ్డం పెరిగినా పట్టించుకోలేదు. అతనిని చూస్తుంటే వాసుదేవ్‌కి బాధన్పిస్తోంది.

ఎంత బతిమిలాడినా బయటకి రాకుండా అలా అన్నీ పోగొట్టుకొన్నవాడిలా ఉండటం చూసి, భరించలేనివాసుదేవ్, ఈరోజు ఎలాగైనా నిశాంత్‌ని బయటకి తీసుకువెళ్ళాలనుకొని పట్టుదలగా తనకి ఇస్తానన్న పార్టీ ఆరోజు ఇవ్వాలని సినిమాకి బయల్దేరదీశాడు.

సినిమా చూసిన తర్వాత వాసుదేవ్ బలవంతాన పార్టీ ఇమ్మనడంతో బార్‌కి వెళ్లారు.

వాసుదేవ్‌కి మందుపార్టీలు అప్పుడప్పుడు అలవాటే. ఎవర్కైనా ఫారెన్‌ఛాన్స్ వచ్చినప్పుడు పిహెచ్.డి. అవార్డు అందినప్పుడు ఫ్రెండ్స్‌తో వెళ్లడం రీసెర్చి చేస్తున్నప్పటి నుండీ అలవాటయింది.

"ఒక్కసారికి ఏపీ కొంప మునిగిపోదు. నువ్వు కూడా టేస్ట్ చూడు" అని బలవం

తాన నిశాంత్ చేత కొద్దిగా తాగించి నవ్వుతూ, సరదాగా-

"మీ గైడ్ గురించి చెప్పు గురూ!" అన్నాడు.

అలవాటైన వాసుదేవ్‌కి తాగినది ఇంకా కిక్ ఇవ్వలేదుగానీ, నిశాంత్‌కి మత్తు వచ్చింది. వికారం మొదలయ్యింది.

"చెప్పు గురూ! గైడ్‌మీద కోపమా? శ్రీరాములుమీదా చెప్పు" అని అడిగాడు వాసుదేవ్.

తాగిన మైకంలో నిశాంత్ ఏవి మాట్లాడుతాడో, ఎలా మాట్లాడుతాడో అనే కుతూహలంతో ఉన్నాడు వాసుదేవ్.

శ్రీరాములనే మాటతో రెచ్చిపోయాడు నిశాంత్. "శ్రీరాముల సంగతి ఎత్తకు. వాడు ఛస్తాడు. ఛస్తేగానీ శనిపోదు. ఛస్తాడు" అని భళుక్కున వాంతి చేసుకొన్నాడు.

వాసుదేవ్ కంగారుపడ్డాడు.

"ఛీ ఛీ... అప్పుడే వాంతులు. మూడ్ అంతా ఖరాబు చేశాడు" అని గొణుక్కుంటూ గబగబా బిల్లుపారేసి బయటకి లాక్కుని వచ్చాడు.

బయటకి వచ్చి పదినిముషాలైనా నిశాంత్ వాగుడూ తగ్గలేదు. వాంతులూ తగ్గలేదు. ఇతనిని తీసుకొని హాస్టల్‌కి వెళ్లడం కష్టం అనుకొన్నాడు.

పక్కనే ఉన్న రిక్షాని పిలిచి, దగ్గరే ఉన్న కజిన్ ఇంటికి వెళదామనుకొని, రిక్షా ఎక్కబోతుండగా-

ఎదురుగా పోలీసు. ఇదో పెంటా, దేవుడా అనుకొన్నాడు వాసుదేవ్.

పోలీసు ప్రశ్నించకుండానే చేతులు పట్టుకొని-

"సార్... ఈ వొక్కసారికి వదిలేయండి. నేను స్కాలర్‌ని. ఆయన మా ప్రొఫెసర్. మందు పార్టీ ఇస్తేగానీ థీసిస్ సంతకం పెట్టనన్నాడు. మీకు తెలియనిది ఏముంది? " అన్నాడు.

పోలీసు, ఆ మాటలకి చాలావరకు కరిగిపోయాడు. మళ్లీ అతడికి మరో ప్రశ్న వేయడానికి అవకాశం ఇవ్వకుండా, జేబులో నుండీ ఏభైరూపాయలు తీసి నెమ్మదిగా చేతిలో పెట్టి గబగబా నిశాంత్‌ని రిక్షా ఎక్కించి, తనూ ఎక్కిపోయాడు.

ఇంటిదగ్గర రిక్షా ఆపించి- తను దిగి ముందుగా, కాలింగ్ బెల్ నొక్కాడు. తలుపు తీసినామె-

"రా, ఇంత లేట్‌గా వచ్చావేం? " అంది.

"పార్టీనుండీ వస్తున్నాం. రూమ్‌కి వెళ్లడం కష్టం. మా ఫ్రెండ్ కూడా వచ్చాడు. కాస్త సైడ్‌రూమ్ ఖాళీయేకదా! ఈ వొక్క రోజూ... సారీ, నేను ఇబ్బంది పెడ్తున్నా"

"ఫరవాలేదు... భోజనం చేస్తారా? "

"వద్దు... పార్టీలో నానా గడ్డీ తిన్నాము. కాస్త మజ్జిగ ఉంటే చాలు నేను తీసుకొంటాను. నువ్వు పడుకో. అసలే వాడు మొహమాటస్తుడు. ఆడవాళ్లెవరూ లేరని చెప్పి తీసుకువచ్చాను" అని ఆమెని హడావుడిగా బెడ్‌రూమ్‌లోకి పంపించాడు.

ఆమె వెళ్ళాక రిక్షాకి డబ్బులు ఇచ్చి నిశాంత్‌ని తీసుకొనివచ్చి, కుర్చీలో కూర్చోబెట్టి చొక్కా, ఫేంట్ తీసి ఉతికి ఫ్యాన్‌కింద ఆరేశాడు.

తనూ స్నానంచేసి, మజ్జిగ తెచ్చి తాగించగానే మరోసారి వాంతి చేసుకొన్నాడు నిశాంత్.

గదంతా చీపురుతో శుభ్రంచేసి వాసుదేవ్ పడుకొనేటప్పటికి రెండు గంటలయింది.

ఉదయం నిశాంత్‌కి ఎనిమిది గంటలకి మెలకువ వచ్చేసరికి విపరీతమైన తల దిమ్ము, తలపోటు నీరసం వచ్చింది. కేవలం డ్రాయర్‌తో ఉన్న తన స్థితి చూసుకొనేసరికి రాత్రి జరిగినది గుర్తొచ్చి, మనసు కుంచించుకుపోయింది.

నేను తాగలేదు, తాగలేదని అనుకోవాలనిపించినా, వాంతవడం లీలగా గుర్తొచ్చింది.

ఫేంట్, షర్ట్ ఆరేసినది ఎవరబ్బా? అను కొని వాసుదేవ్‌ని లేపాడు.

"అబ్బ! పడుకోనియ్యి" అన్నాడు.

"ఎనిమిది గంటలయ్యింది" అని నిశాంత్ గట్టిగా అనగానే దిగ్గున లేచి కూర్చున్నాడు.

"బాసూ! రాత్రి రసాభాస చేశావు"

నిశాంత్ మాట్లాడలేదు. చాలా సిగ్గుప డ్డాడు.

"రూమ్‌కి పోదాం. లేచి డ్రస్ వేసుకో" అన్నాడు.

"నా డ్రస్ ఎవరుతికారు? "

"ఇంకెవరు నేనే. ఉదయం ఇబ్బందికదా!"

వాంతులని అసహ్యించుకోకుండా ఎంతభిమానంగా చేశాడో అనుకొంటూ చొక్కా వేసుకొని-

డబ్బులెన్ని మిగిలాయో, గబగబా లెక్క చూశాడు.

"నువ్వు మాత్రం ఎవరినీ నమ్మవు. రాత్రి షర్ట్ తీస్తుంటే డబ్బులు దొబ్బేస్తావా? అని ఎంత పోట్లాడావో!"

ఆ డబ్బులు నాకు ఎంత విలువైనవో మీకేం తెలుసు, అని మనసులోనే అనుకొని నిశ్శబ్దంగా ఊరుకొన్నాడు. అనవసరంగా పార్టీ ఇస్తానన్నాను. డబ్బులు తగలేశాను. ఇంకెప్పుడూ ఇలాంటి వెధవపనులు చేయ కూడదు, అనుకొన్నాడు.

అనవసరంగా డబ్బులు ఖర్చుపెట్టించా నని వాసుదేవ్ కూడా బాధపడ్డాడు.

నిశాంత్ హుషారుగా ఉండేలా చేద్దామ నుకొని అతనిని మరికొంచెం బాధపెట్టాను. ఇంకెప్పుడూ ఇలాగ చెయ్యకూడదు. ఎలా గైనా డిపార్ట్‌మెంట్‌కి పంపించి అతని వర్క్ అయ్యేటట్టు చెయ్యాలని నిర్ణయించుకొ న్నాడు వాసుదేవ్.

రూమ్ చేరుకొనేసరికి, ముందురోజు ప్రభావంవలన విపరీతంగా నిద్రముంచు కొచ్చి ఇద్దరూ పడుకొన్నారు.

మధ్యాహ్నం రెండు గంటలకి తలుపుకొ ట్టిన శబ్దానికి లేచాడు వాసుదేవ్. మెలకువ వచ్చినా లేవడానికి బద్ధకించాడు నిశాంత్.

తలుపు తీశాడు వాసుదేవ్.

"హలో! వినయ్. బాగున్నావా? ఏంటీ? ఆమధ్య ఏదో పని వుంది. వస్తానన్నావు. కనబడలేదు"

"అవునండీ. పనివుంది. చాలాసార్లు వచ్చానుగానీ, మిమ్మల్ని కలవలేకపో యాను. అందుకే ఈరోజు సాయంత్రం వస్తే, మీరు బయటకి వెళ్తారేమోనని, మిట్ట మధ్యాహ్నం వచ్చి మిమ్మల్ని ఇబ్బంది పెట్టాను."

"ఇంతకీ, ఏమిటి పని? "

"అదే, ఎస్టిమేషన్ సార్"

"ఇప్పుడు కూర్చుందామా? "

"మీకు వీలయితే..."

"నాకు ఖాళీయే. ముఖం కడుక్కొని వస్తాను. మీరు కూర్చోండి. నేను అయిదు నిమిషాలలో బయటికి వెళ్లివస్తాను. నిశాం త్‌తో మాట్లాడుతూ ఉండండి" అని.

"ఇతను, వినయ్, న్యూక్లియర్ ఫిజిక్స్ స్కాలర్. మా అత్తారి వూరతను. జీని యస్" అని పరిచయం చేశాడు.

"మొదటి రెండూ కరక్ట్. కానీ మూడోది తప్పండీ. ఎందుకు చెప్తున్నానంటే, అయిదు నిముషాలు మీతో కాలక్షేపం చెయ్యమ న్నారు కదా! అప్పుడు అసలు నిజం, నా తెలివి బయటపడుతుంది" అన్న వినయ్ మాటలకి నవ్వు వచ్చింది.

మాట్లాడాలికదా, అని అతనే టాపిక్ గురించి, సబ్జెక్ట్ గురించి డిస్కస్ చేస్తూ ఉంటే చైతన్యం ప్రవాహం లాగవచ్చినట్ట యింది నిశాంత్‌కి.

ఎంత హుషారుగా ఉన్నాడో, చాలా తెలి వైనవాడని అనుకోకుండా వుండలేకపో యాడు.

అలా మాట్లాడుతూనే... "సర్, నాకు

మేథ్స్ రాదండీ. కానీ అవసరం. ఒక పేప ర్‌లో నాకు మేథ్స్ పార్ట్ కాస్త సాయం పట్టండీ. అసలు... నేను ఫిజిక్స్‌కి ఎందుకు వచ్చానో తెలుసాండీ. మేథ్స్ రాకపోవడంవ లనే. లెక్కలు చెప్పేవాళ్లని చూస్తే డొక్కలు చీరేస్తారేమో... అన్పించిందండీ" అని లోగొంతుతో చిన్నపిల్లవాడు బూచికథ చెప్తు న్నట్టుగా చెప్పేసరికి ఫకాల్న నవ్వు వచ్చింది.

నవ్వుతూ, "నేను లెక్కా చెప్పలేను. డొక్కా చీరలేను" అన్నాడు నిశాంత్.

"భలేవారే, మీ గురించి వాసుదేవ్ చెప్పారు..."

"ఇంతకీ మీరు ఎవరిదగ్గర వర్క్ చేస్తు న్నారు?" అడిగాడు నిశాంత్.

"నారాయణగారు"

"అదా సంగతి. అదృష్టవంతులు. మీ ఉత్సాహం చూసే అనుకొన్నాను. మంచి గురువు దొరికారని. మీ వర్క్ తొందరగా అయిపోతుంది"

"ఏవి అవడంలెండి. మాకు గైడ్ సహ కారం ఒక్కటే చాలదు. టాపిక్ డిసైడ్ అయ్యాక ఇన్‌స్ట్రుమెంట్స్ తెప్పించుకోవాలి. దానికి ఎస్టిమేషన్ వేసి యు.జి.సి.కి పంపాలి. బేసిక్ సైన్సెస్‌కి హెచ్.ఆర్.డి. నుండీ ఫండింగ్ కాబట్టి హెచ్.ఆర్.డి.కి వెళ్లాలి. అక్కడ నుండీ యు.జి.సి.కి, అక్కడ నుండీ యూనివర్సిటీకి రావాలి. వీళ్లు మేల్కొని వచ్చిందని చెప్పరు. వడ్డీ అయినా దక్కుతుందని. డిపార్ట్‌మెంట్ నుండీ ప్రిన్సిపాల్ ఆఫీస్ క్లర్క్ దగ్గరికి వెళ్లి... వి.సి.టేబుల్ ఎక్కాలంటేనే ఎన్ని నెలలు పడుతుందో చెప్పలేముకదా! మరి అక్కడనుండీ రావాలంటే సంవత్సరాలే. తీరా వచ్చేసరికి ఎస్టిమేషన్ కన్నా కాస్ట్ ఎక్కువయిపోతుంది. అన్ని డబ్బులు మన చేతివి పెట్టలేముకదా! మళ్ళీ యూనివర్సి టీని ముష్టి ఎత్తాలి. వాళ్ల దయ. మన ప్రాప్తం. గైడ్ మంచివాడయి వర్క్ ప్రొడ్యూస్ చెయ్యాలనుకొంటే, ఏదో ప్రోజ క్ట్‌లో ఎడ్జస్ట్ చేస్తారు. ఇక్కడ రాజకీయాల మధ్య చెయ్యడం వాళ్లకీ కష్టమే. అందుకని మేము ముందే ఎక్కువ వేసి కట్టిస్తాం. అయినా వీళ్లు సొమ్ములు వదిలేసరికి ధర పెరుగుతుంది. మళ్లీ మా తిప్పలు మొదలు..." అని వినయ్ చెప్తుండగా-

వాసుదేవ్ చేతినిండా అరటిపళ్లతో వచ్చాడు.

"మేము మధ్యాహ్నం ఫుడ్ కొట్టలేదు. అందుకనే మిమ్మల్ని కూర్చోబెట్టి వెళ్లాను"

"ఎందుకు తినలేదు"

"అదో పెద్ద గాథ. ఇప్పుడెందుకులే" అని కూర్చుని నిశాంత్‌కి, వినయ్‌కి పళ్లు ఇచ్చాడు.

"వినయ్! కుమార్‌కి జె&టిలో ఎని మిది షెడ్యూల్స్ సాంక్షన్ అయ్యాయి. వెళ్లా డన్నారు. సక్సెస్ అయ్యిందా?" అడిగాడు వాసుదేవ్.

"ప్చ్! పెద్ద పాము మింగింది" అన్నాడు విచారంగా.

"ఏమయ్యింది?" అన్నాడు నిశాంత్.

"వైకుంఠపాళిలో పెద్ద పాము మింగడం తెలుసుకదా! మనకి ఎక్విప్‌మెంట్ లేదు గదా! మేము ఢిల్లీకి సినాప్సిస్ అదీరాసి, పంపి హడావుడి చేస్తే- వాళ్లు మనం పది హేను షెడ్యూల్స్ అడిగితే, ఏడో, ఎనిమిదో సాంక్షన్ చేస్తారు. లైటింగ్ చాలకో, మన యోగం బాగులేకో, ఎక్స్‌పర్‌మెంట్ సక్సెస్ అవలేదనుకోండి మళ్ళీ మొదలు. ఎక్కడ వేసిన గొంగళీ అక్కడే అన్నట్టుగా అవు తుంది"

"మళ్ళీ ఛాన్స్ రాదా?"

"వస్తుంది... ఎప్పుడో. రెండు మూడేళ్లు పోయాక, అప్పటికి ఈ ఉత్సాహం వుండక పోతే... ఇంతే సంగతులు. ఈ మూడేళ్లలో పూర్తిగా భ్రష్టులవుతారు. అటు ఎమ్.ఎ స్సీ. వాళ్లలాగ ఉద్యోగం సంపాదించలేరు.

ఇటు సైన్‌టిస్ట్ కాలేక ఉభయ భ్రష్టులయ్యే అవకాశం వుంది. నా బ్రతుకేమవుతుందో? అదే భయం" అన్నాడు దిగులుగా వినయ్.

"మీకేమి? ఖచ్చితంగా సక్సెస్ అవుతారు. మీకు ఈ ఉత్సాహం పొమ్మన్నా పోదు" అన్నాడు నిశాంత్.

"కరెక్ట్. వినయ్‌కి శ్రద్ధ, పట్టుదల ఎక్కువ. అంతేగాక మంచి గురువు దొరికారు" అని వాసుదేవ్-

"మా నిశాంత్ కూడా చాలా తెలివైన వాడు. కానీ ఏంటో? నిశాంత్! నువ్వు ముందు గైడ్ సంగతి తేల్చుకో" అన్నాడు.

"అలాగే, రేపు వెళ్తాను. మీ పని సంగతి చూడండి" అని తప్పుకొన్నాడు నిశాంత్

★ ★ ★

నెలాఖరికి అడ్వర్టైజ్‌మెంట్ వస్తోంది. వంద పోస్టులు కేంపాస్‌లో భర్తీ చేస్తారనే వార్త పాకిపోయింది.

ఎక్కడ చూసినా అదే డిస్కషన్. ఏ డిపార్ట్‌మెంట్‌లో ఎన్ని వస్తాయి? ఎవరికి రావడానికి అవకాశం వుందనే విషయం మీద తీవ్రచర్చలు జరుపుతున్నారు.

ఎవరి ప్రయత్నం వాళ్లు చేసుకోవాలని, కొంతమందివాళ్లకి తెలిసిన ఎమ్.ఎల్.ఏ.ల, మినిష్టర్‌ల రికమెండేషన్ కోసం సొంత వూర్లు ప్రయాణం కట్టారు.

ఏ మెంబర్‌ని ఎలా పట్టాలి? ఎవడి మాటకి బలం వుంది? ఎవరు వి.సి.కి కుడి భుజం? ఏ కులంవాడిమాట అవుతుందనే అంశాలమీద వారి మేధనంతా ఉపయోగించడం ప్రారంభించారు.

డిపార్ట్‌మెంట్‌లో ఎవరు ఛైర్మన్ అవుతారు? వాళ్లు మనకి ఎంతవరకూ చేస్తారు? అనేదానిమీద అందరూ దృష్టి కేంద్రీకరించారు.

వాసుదేవ్ కూడా అదే హడావుడిలో ఉన్నాడు. రూమ్‌లో ఉండడమే తక్కువయింది. ఎప్పుడో అర్ధరాత్రి రావడం. అప్పటికి నిశాంత్ పడుకోవడంతో- నిశాంత్‌తో మాట్లాడీ చాలారోజులయ్యింది.

నిశాంత్ లేచేదాకా వుండి, నిశాంత్ గైడ్ విషయం అడగాలనుకొన్నాడు.

నిద్ర లేస్తే ఏదైనా ఆలోచించాలి. ఎందుకొచ్చిన బాధ అని ముసుగు తియ్యకుండా పడుకొన్నాడు నిశాంత్.

లేస్తాడేమోనని చూసి, చూసి సహనం చచ్చింది వాసుదేవ్‌కి.

"లే, నిశాంత్" అని గట్టిగా కసరి లేపాడు.

"ఏవిటా పడక? ఇంతకీ విడాకులకి సంతకం అయ్యిందా? లేదా? "

"లేదు... పురుగుని చూసినట్టు చూస్తున్నాడు. నేనో జీవిననే గుర్తింపేలేదు. విసుగ్గా వుంది. నేను ఒక నెలరోజులు మా వూరెళ్లి హాయిగా మా నాన్నగారి దగ్గర గడిపివస్తాను"

"అదే మంచిది. గైడ్ విషయం తొందర పడకు. రేపు ఛైర్మన్ అతగాడే అయ్యేడనుకో. ఇంటర్వ్యూలో నొక్కేస్తాడు. ల్యూచర్‌లో పోస్ట్ ఆశే వదులుకోవాలి"

"ఇక్కడ నాకు పోస్టా? అలాంటి అత్యాశ లేదు. అయినా, ఆయన ఏ మహత్తరమైంది నాకు ఇస్తానన్నా కూడా అతని దగ్గర స్కాలర్‌గా ఉండను. ప్రయత్నించి ప్రయత్నించి విసిగిపోయాను. అతడిని వదిలించుకొందుకే ఏదైనా మార్గం కావాలి" అన్నాడు స్థిరంగా.

"అయితే ఒకపని చెయ్యి. ఇలా నీట్‌గా గెడ్డం గీసుకొని నాకేమీ నష్టం లేదన్నట్టు డిపార్ట్‌మెంట్‌కి వెళ్లకు. గెడ్డం పెంచి, దీనంగా కష్టాలన్నీ నీకే వచ్చినట్టుగా వెళ్లేవనుకో. మిగతావాళ్లందరి సానుభూతి వస్తుంది. చూసి చూసి వాళ్లే ఒక్కొక్కరూ, అతను మారిపోతానంటే నీకేవి అని గడ్డి పెడతారు" అని గీతోపదేశం చేశాడు వాసుదేవ్.

"ముందు వూరెళ్తాను. వచ్చిన తర్వాత

మీరు చెప్పినట్లు చేస్తాను"

★ ★ ★

సాయంత్రం అయ్యేసరికి, ఊరెళ్లే అవకాశం పోయింది నిశాంత్‌కి. పెట్టె పట్టుకొని వచ్చిన చిన్న తమ్ముణ్ని చూసేసరికి వొళ్లు మండిపోయింది.

"చెప్పాపెట్టకుండా దేనికి వచ్చినట్టు? నేనే ఛస్తుంటే. డబ్బులు పంపించానుగదా!" అన్నాడు సీరియస్‌గా నిశాంత్.

"నాన్నగారు ఉత్తరం రాసేనన్నారు. ట్యూషన్‌కి ఎనిమిది వందలడిగారు. అందుకని అన్నయ్య దగ్గరకి వెళ్లి నేర్చుకోమని పంపించారు" అన్నాడతను చిన్నబుచ్చుకొని.

చిన్నబుచ్చుకొన్న ముఖం చూస్తే జాలేసింది నిశాంత్‌కి. పాపం! చదువు, చదువు అని చంపుతూ తీరా నేర్చుకొందుకి వస్తే ఇలా కసిరితే ఏమయిపోతాడనిపించింది.

"పోన్లే, సిలబస్ పూర్తిచేసి వెళ్లిపో. ఎక్కువరోజులు రూమ్‌లో ఉంటే బాగుండదు. ఇక్కడంతా రకరకాల వాళ్లున్నారు. వాళ్ల కబుర్లు వింటూ కూర్చోకూడదు. ఎవ్వరితోనూ మాట్లాడకుండా, నీ లెక్కలు సాధ్యమయినంత త్వరగా చేసుకోవాలి" అని చెప్పి, జేబులో ఉన్న వంద రూపాయలు తీసి అతని చేతిలో పెట్టి-

"జాగ్రత్తగా ఖర్చు పెట్టాలి. అయిపోతే ఇస్తాలే" అని చెప్పాడు.

★ ★ ★

నా భోజనం ఏదో హాస్టల్‌లో అయిపోతోంది. వీడి భోజనానికి డబ్బులు చూడాలి. ఎక్కడో ట్యూషన్ సంపాదించాలనుకొన్నాడు నిశాంత్.

వాసుదేవ్ వస్తూనే-

"నువ్వు వూరు వెళ్లలేదా?" అని అడిగాడు.

"లేదు, తమ్ముడు వచ్చాడు"

"నేను ఊరెళ్తున్నా... మా అత్తగారి మేనమామ కొడుక్కి బి.ఒ.యమ్ మెంబర్ నాయుడు బాగా తెలుసు. మన ప్రయత్నం మనం చేసుకోవాలిగా. ముందుగా వెళ్తే ఎవరికీ ప్రామిస్ చెయ్యరు. అందుకనీ..."

"అర్జున్ ఎప్పుడో అన్నాడు. మీరు గట్టి ప్రయత్నంలో ఉన్నారని"

"సరేలే! అర్జున్‌కేవి? బామ్మర్ది యం.యల్.ఏ, ముగ్గురు బి.ఓ.యమ్ మెంబర్లు వాళ్ల కులంవాళ్లే. అతడికి ఎలాగూ వస్తుంది" అన్నాడు వాసుదేవ్.

"ఎవరికి వచ్చినా మంచిదేగా! నేను రాజు రూమ్‌కి వెళ్తున్నా" అన్నాడు నిశాంత్.

రాజు రూమ్ హడావుడిగా వుంది. చాలామంది స్కాలర్స్ పోస్టుల విషయం సీరియస్‌గా చర్చిస్తున్నారు. రిజర్వేషన్స్ అమలులో గతంలో జరిగిన అన్యాయాల గురించి, అవి సరిదిద్దాలని గట్టిగా ప్రెషర్ తేవాలని, ఎలా చెయ్యాలనే విషయంమీద ఎవరి అభిప్రాయాలు వాళ్లు చెప్తున్నారు.

మధ్యలో రాజు పేపర్స్, పెన్ పట్టుకొని కూర్చుని ఉన్నాడు.

నిశాంత్‌ని చూడగానే...

"హలో! రండి బాగున్నారా? చాలా రోజులయింది కలిసి" అని సాదరంగా పలకరించి, ఎక్కడ కూర్చోబెట్టాలో తెలియక,

"బయటకి వెళ్లి మాట్లాడుకొందాం" అన్నాడు.

అరగంటలో వస్తానని మిగిలిన వాళ్లకి చెప్పి బయటకి వచ్చాడు.

"ఇప్పుడు చెప్పండి. ఏవిటి ఇలా వచ్చారు. చూడడానికేనా? ఏమైనా పని వుందా?" అని అడిగాడు రాజు.

"పనంటే పనే. డబ్బులు కావాలి. అప్పు కాదు. ఎవరికో ట్యూషన్ కావాలని అప్పుడు అన్నారుకదా! కాస్త చూడండి"

"ట్యూషన్ చెప్తానంటే చాలామంది వస్తారు. మీరు మరీ నీరసంగా అయిపోయారు. మీ గైడ్‌తో బానే వున్నారా?"

"ఏవీ బాగులేదు. మారిపోదామనుకొం

టున్నా"

"ఏవిటీ? నిజమా!"

"అవును వెక్స్ అయిపోయా. నా వల్ల కాదు"

"తొందర పడడం మంచిదికాదు. జగన్ చూడు ఎంత బాధపడుతున్నాడో!"

"ఏమయింది? నాకు తెలీదు"

"మీతో చెప్పి వుండడు. అప్పుడు మనకి పార్టీ ఇచ్చిన మర్నాటినుండీ గురువుగారితో తగువు ఆరంభం. కొంచెం రఫ్‌గా మాట్లా డుతాడుకూడా! మా మేనగోడలు పెళ్లిచె య్యాలి అన్నారట గైడ్. చెయ్యండి సార్! ఆలస్యం దేనికి అన్నాట్ట. నువ్వు ఊ అంటే నీకే ఇచ్చి చేస్తానన్నాట్ట. వెంటనే నేనెందుకు చేసుకొంటాను? నా పెళ్లి మీ ఇష్టమేంటి? అన్నాట్ట. ఏదో కాస్త సౌమ్యంగా చెప్పి తప్పించుకొంటే బాగుండేది. అలా మాట మాట వచ్చి థీసిస్ సబ్మిషన్ ఆగిపో యింది. పోనీ మారిపోతానంటే సంతకం పెట్టడు. స్కాలర్‌షిప్‌లేదు. ఎక్కడో పార్ట టైమ్ చేస్తున్నాడు. ఆఖరికి మొన్న జాన్‌వా ళ్లని పంపాము"

"ఎక్కడకి?"

"గైడ్ దగ్గరకి"

"జాన్‌వాళ్లనా?"

జాన్‌వాళ్లు అంటే అదో గూండా గేంగ్. వి.సి దగ్గర్నుండీ ప్యూన్‌దాకా భయపడా ల్సిందే. ఏ పనైనా ఏంది? చేస్తావా? చెయ్యవా? అనేసరికి చచ్చినట్టు చెయ్యవల సిందే. వాళ్లని పోషించేవాళ్లూ కేంపాస్‌లో వాళ్లే. ఎప్పుడు డబ్బు ఎంత కావాలంటే అంతా వాళ్లకి ఇస్తారు. వాళ్లు వెళ్లారంటే చాలా గొడవ అవుతుంది.

అందుకనే నిశాంత్ ఆత్రంగా,

"ఇంతకీ ఏం జరిగింది" అన్నాడు.

"సంతకం పెట్టారుగానీ ఏవిటి లాభం? జగన్‌ని తీసుకొందుకి ఎవ్వరూ ఒప్పలేదు గైడ్ లేనిదే ఎలా సబ్మిట్ చేస్తాడు?"

"ఒక్కరూ తీసుకోలేదా?"

"లేదు... జగన్ తప్పుకూడా ఉందిలే. గైడ్ మీద వి.సికి కంప్లైంట్ చేశాడు. అంతే కాదు సి.ఎస్.ఐ.ఆర్‌కి, యు.జి.సికి, సి.ఎమ్‌కి కూడా లెటర్స్ రాసాడు. వాటికి చాలా ఖర్చుపెట్టాడు. ఎన్ని పేజీలో! లాంగ్వేజ్ కరక్షన్‌కని చూపించేవాడు. కాస్త తగ్గిద్దా మన్నా వినలేదు.

జాన్‌వాళ్లు వెళ్లే ముందే వి.సి, గైడ్‌ని పిల్చి ఎక్స్‌ప్లనేషన్ అడిగారుట. తర్వాత జగన్‌ని పిలిచి, వి.సి. తెగ చీవాట్లు వేశా రుట. యు.జి.సికి రాయడమేమిటని చాలా చికాకుపడ్డారుట.

ఈ విషయాలన్నీ అందరికీ తెలిసిపో యాయి. కాంట్రవర్షల్ అనేసరికి అందరికీ భయమేకదా! ఎవ్వరూ తీసుకోలేదు. అంతే గాక వర్క్ అంతా ఆయన చేయించాక వీళ్లు సంతకం పెట్టడం అంటే ఎవ్వరూ వొప్పుకో వడంలేదు. చాలా డల్ అయ్యాడు.

ఈ గొడవ లేకుంటే సబ్మిట్ చేసేవాడు. ఇప్పుడు తీసే పోస్టులలో ట్రై చేసుకొనేవాడు" అన్నాడు రాజు.

"ఎంతమందికని పోస్టులు వచ్చేస్తాయి. అందరికీ ఇక్కడే రావాలంటే ఎలా?" అన్నాడు నిశాంత్.

"ఇక్కడ వుంటేనే మనకి ఎడ్యుకేషన్‌మీద ఇంట్రస్ట్ వుండి, ఫాలో అప్ ఉంటుంది. బయటకి వెళ్తే ఈ వాతావరణం వుండదు"

మా డిపార్ట్‌మెంట్‌లో రమణమూర్తి తెలీదా? అతనికి 51 సంవత్సరాలు. స్టూడెంట్ హాస్టల్‌లో ఉంటాడు. ఏడు సంవత్సరాలు ఏదో ప్రాజెక్ట్ వర్క్ చేశాడు. ఆ తర్వాత నుండీ టెర్రస్‌మీద ట్యూషన్స్ చెప్పుకొని బతుకుతున్నాడు. డాక్టరేట్ అయిన దగ్గరనుండీ ప్రతిసారీ అప్లై చేస్తు న్నాడు. కేంపాస్ వదలకుండా, పెళ్లి కూడా చేసుకోకుండా, ఒక్కరోజు పాఠం చెప్పినా ఇక్కడ చాలని ఉన్నాడు" అన్నాడు రాజు.

రాజు మాటలబట్టీ అతడూ ఇక్కడ పోస్టు

కోసం చూస్తున్నాడని తెలిసింది.

రాజు అప్పటికే గవర్నమెంట్ పోస్టులు రెండు వదిలేశాడు. అతడు తెలివైనవాడు.

అందుకనే నిశాంత్, "మీకు వస్తుంది లెండి. గేరంటీగా" అన్నాడు.

"వస్తే అనుకోవాలి. నా మాటకేంగానీ నా సలహా మాత్రం గైడ్‌తో పెట్టుకోకండి. ఫ్యూచర్ వుండదు" అని చెయ్యి పట్టుకొని నొక్కుతూ చాలా అభిమానంగా చెప్పాడు.

ఆ మాట వినసొంపుగా లేదు నిశాంత్‌కి.

"ఎలా ప్రయత్నాలు చెయ్యాలనా రూమ్‌లో మీటింగ్? " అన్నాడు నవ్వుతూ.

"రిజర్వేషన్స్ గురించి పోస్టులు టిక్ చేయిస్తే బాగుండునని మా బాధ. టిక్ చెయ్యకపోతే వి.సికి కావలసిన వాళ్లకి, మినిష్టర్ తాలుకావాళ్లకి, డబ్బులు ఖర్చుపెట్టిన వాళ్లకి పోతాయి. అంటే మీ డిపార్ట్‌మెంట్‌లో వాళ్లకి కావలసిన వ్యక్తి ఉన్నాడనుకో, అక్కడ రిజర్వేషన్ మానేసి, అది ఏ సోషల్‌వర్క్‌లోనో చూపిస్తారు. అలా మొత్తం యూనివర్శిటీ యూనిట్‌గా తీసుకొంటే అదీ నష్టం."

"అలా అయితే ముందే వాళ్లకి కావలసిన వాళ్లకి చూసుకొని టిక్ చేసుకోవచ్చుగదా? "

"ఇంటర్వ్యూలు అయ్యాక, బామ్మర్ది అనో, పి.ఎమ్ చుట్టము అనో ఏవీ చెయ్యలేరు. మొదటిసారి ఏదో సర్దగలరుగానీ తర్వాత తర్వాత రోస్టర్ ప్రకారం వెయ్యాల్సి వస్తుంగి"

"దీనికి వి.సి ఒప్పుకొంటారా? "

"ఏమీ ఒప్పుకోరు. అది అందరికీ తెలుసు'

"మరి ఈ గొడవ ఎందుకు టైమ్‌వేస్ట్"

"భలేవారే, మనము ఎవరం అడుగుతున్నామో వాళ్ల ముఖాలు గుర్తుంటాయికదా! సాధ్యమయినంతవరకు వాళ్లకి పోస్టు ఇవ్వడానికి చూస్తారు. దానికోసమే ఈ తాపత్రయం. మీకు ఎన్ని సంవత్సరాలయినా రాజకీయాలు ఎక్కువు. చాలా సేపయింది నేను వచ్చి వాళ్లు వెయిట్ చేస్తుంటారు" అని ఒక్క క్షణం నిశ్శబ్దంగా ఊరుకొన్నాడు.

"నేను ఇక్కడ స్థిరపడాలి. ఇక్కడ వుంటే గదా! ఏమైనా చెయ్యగలం. అందుకనే ఈ బాధ! వెళ్లిరానా? " అన్నాడు రాజు.

"ఊ... నేను చెప్పినది మరచిపోకండి" అన్నాడు నిశాంత్.

రాజు మాటలు విన్నాక డిపార్ట్‌మెంట్‌కి వెళ్లాలో మానాలో నిర్ణయించుకోలేకపోయాడు నిశాంత్. దానికి తోడు తమ్ముడు ఉండడంతో అతనికి లెక్కలు చెప్పడం, ట్యూషన్ కుర్రాడికి చెప్పడంతో కాలక్షేపం చేస్తున్నాడు.

అప్పుడప్పుడూ వినయ్ వచ్చి కబుర్లు చెప్పేవాడు. లేబ్ బాధలేదుగదా! ఓన్‌గా వర్క్ చేయండని వినయ్ అనడంతో పుస్తకం తీసి లెక్కలు చేసుకోవడంతో ఉత్సాహంగానే అన్పించింది.

నెలా పదిహేను రోజుల తర్వాత తమ్ముడు వెళ్లిపోవడంతో మళ్లీ విసుగు ప్రారంభమయింది. ఎంత ఆలోచించినా గైడ్‌ని మార్చుకోక తప్పదన్పించి వాసుదేవ్ ప్లాన్ ప్రకారం నడచుకోవాలనుకొన్నాడు నిశాంత్.

* * *

సమీరకి పరీక్షలు ఆరంభం. ఆరోజు మొదటి పరీక్ష. పేపర్ ఇస్తారనేసరికి హాలంతా నిశ్శబ్దంగా అయింది.

అప్పుడు నలుగురులోపలికి వచ్చారు. అందరి దృష్టీవాళ్లమీదే పడింది. చక్కగా ముస్తాబై మహా హుషారుగా వచ్చారు. అదో అలవాటైన పనిగా లోపలికి వచ్చినవాళ్లని చూసి, ఇన్విజిలేటర్స్ అనుకొన్నారు. అందులో ఇద్దరు నెంబర్ చూసుకొని, కూర్చోగానే ఇద్దరు-

"మళ్లీ కలుద్దాం గురూ!" అని వెళ్లిపోయారు.

క్వశ్చన్ పేపర్ చేతికి రావడంతో

అందరూ ఏకాగ్రతగా ఎవరి పేపర్ వాళ్లు రాయడం మొదలెట్టారు.

మరో పది నిముషాల తర్వాత లెక్చరర్ వెంకట్ "ఏవిటా పని" అన్నారు గట్టిగా.

అందరూ తలపైకెత్తి ఏవిటా అని చూశారు.

ఆఖర్ని వచ్చిన ఇద్దరూ పుస్తకాలు చూసి రాస్తూ కన్పించారు.

"చూసి రాయడానికా పరీక్ష?" అని వెంకట్ గట్టిగా అన్నాడు.

"చూడు గురూ! 55% లేకుంటే ఏవి చేసుకోవాలి ఈ సర్టిఫికేట్. అందుకనే మా ప్రయత్నం. ఆ ఛాందసుడు ఎంత చెప్పినా 55% ఇవ్వడంలేదు. కనుక వేరు మార్గంబు లేదు" అన్నాడు చాలా స్టైల్‌గా.

ఆ మాటకి మరీ కోపం వచ్చింది వెంకట్‌కి.

"ఇది పరీక్ష. నీ ఇష్టం కుదరదు. నేను వొప్పుకోను"

"వదిలేయ్ గురూ. నీ పని చూసుకో"

"ఏంటి వదిలేది. ముందు పుస్తకం ఇయ్యి" అని చేతిలో పుస్తకం లాక్కోబోయాడు. దాంతో కూల్‌గా లేచాడతను.

"ఏంటీకత! ఈ తారకేశ్వర్‌కే శ్రీరంగ నీతులు చెప్తున్నావు. నీ యవ్వారం నాకు తెలియనిదా! నువ్వు నా క్లాస్‌మేట్‌వనే సంగతి మరచిపోకు. నువ్వు ఒక్క ఎమ్.ఏ చేసి రీసెర్చికి వెళ్తే నేను మూడు ఎమ్.ఎలు, బి.ఎల్ చేసినోడిని. నాకు అందరి జాతకాలు తెలుసు. నీకు ఎలా ఉద్యోగం వచ్చిందో నాకు తెలియదా? చీఫ్ మినిష్టర్ పి.ఎ. మీ మామగారయినపుడేగదా వచ్చింది. అసలు గురూ! నీ థీసిస్ ఎవరు రాశారో నాకు తెలియదా? 10,000 రూపాయలకే చీప్‌గా సంపాదించినోడివి. నేను మాత్రం 55% ఎమ్.ఏ. సర్టిఫికేట్ తెచ్చుకోగూడదా?" అన్నాడు తారకేశ్వర్.

స్టూడెంట్స్ అందరి దగ్గరా మోరల్‌గా దెబ్బకొట్టేసరికి ఏమి చెయ్యాలో తెలియ లేదు. నీరుగారిపోయాడు.

ఇంతలో అదృష్టవశాత్తూ బయటకి వెళ్లిన కో-ఇన్విజిలేటర్ లోపలికి వచ్చారు.

అతనికి సంగతి బోధపడింది.

"ఇది పద్ధతికాదు"

"అవునో! కాదో! మీ చేత పాఠాలు చెప్పించుకొందుకి రాలేదు" అన్నాడు తారకేశ్వర్ మహా నిర్లక్ష్యంగా.

"ఏమి చేసుకొంటారో చేసుకోండి" అనేసరికి, డిగ్రీ పరీక్షలాగ పోలీసులు కూడా దగ్గర లేకపోయేసరికి ఏమిచేయాలో పాలుపోలేదు.

అప్పటికే వెంకట్, హెడ్ దగ్గరకి వెళ్లి ఇంకో రూమ్ మార్చుకొన్నారు. ఆ రూమ్‌లోకి అప్పారావు అనే మాస్టరు వచ్చారు.

రాగానే- "ఎనీ ప్రాబ్లమ్?" అంటూ విషయం తెలుసుకొన్నాడు.

"చూసీ చూడనట్టు పోనీద్దురూ! ఈ డిగ్రీలు ఏమైనా ఉపయోగమా ఏమిటి?" అని కొట్టి పారేయడానికి చూశాడు.

"నేను మాత్రం వొప్పుకోను. ఇప్పుడే హెడ్‌కి రిపోర్ట్ చేస్తాను. కష్టపడి చదివిన వాళ్లంతా వెఱ్ఱి వెధవలా?" అని కోపంగా హెడ్ దగ్గరకి వెళ్లారు.

హెడ్ రంగాచారి జరిగినదంతా విని,

"తారకేశ్వర్ చాలా ప్రమాదకరమైన మనిషి. నాకే మొన్న వార్నింగ్ ఇచ్చాడు. ఏవిచేస్తాం?"

"అలా అంటే ఎలాగండీ? ఎగ్జామ్ కండక్ట్ చెయ్యలేమని రాయండి"

"అలాగే రాస్తా! ఏమవుతుంది. ఏ సోషల్ వర్కు వాళ్లకో అప్పచెప్తారు. వాళ్లు అలాగే రాసుకోనిస్తారు. మనని చాతగాని వెర్రి వెధవాయల్లా చూస్తారు".

"ఎందుకండీ కబుర్లు. నేనేమీ చెయ్యను అని చెప్పండి. ఇలాగ మాత్రం వుంటే నేను ఇన్విజిలేషన్ చెయ్యను"

"సర్లెండి. లీవ్ పెట్టేయండి" అనడంతో

అతను నిశ్శబ్దంగా వెళ్లిపోయారు.

ముప్పావు గంట వేస్ట్ అయింది స్టూడెంట్స్‌కి. వెనకాతలవాళ్ళు చూడకుండా రాస్తున్నారు. తారకేశ్వర్ మాత్రం దర్జాగా చూసి రాస్తున్నాడు. అది చూసి వాటర్‌కని చెప్పి వెళ్లి మరికొందరు పుస్తకాలు తెచ్చుకొని రాయడం మొదలెట్టారు.

వాటికన్నిటికీ అతీతంగా అప్పారావు మాత్రం ఏదో పాట హమ్ చేసుకొంటూ వరండాలోనే ఉండిపోయాడు.

భయం వున్నవాళ్లు, అవినీతి అని భావించేవాళ్లు మాత్రం వాళ్లకి వచ్చినది వాళ్లు రాసుకొంటున్నారు, తిట్టుకొంటూనే. పది నిముషాలయ్యేసరికి చూడకుండా రాస్తున్న వాళ్లకి బాగా కోపమొచ్చింది.

"మేము ఇలా రాయము సార్ చాలా అన్యాయం" అన్నారు.

అప్పారావు హెడ్‌ని పిలిచాడు. హెడ్ వచ్చాడు.

"రాయడం మీకే మంచిది. మళ్లీ ఎప్పుడు పెడ్తారో తెలియదు. చూసి రాసిన వాళ్ల పేపర్లు విడిగా పంపుతాము" అని కబుర్లు చెప్పాడు.

దాంతో, పరీక్ష మానేయడానికి భయం. ఒకవేళ పరీక్ష ఇదే అంటే ఒక సంవత్సరం వేస్ట్. వాదోపవాదాలు అనవసరం అనుకొని, వచ్చినదేదో రాసేసి బయటకిపోయిన తర్వాత కలసి ఆలోచిద్దామనుకొని ఎవరి మటుకు వాళ్లు పరీక్ష రాసేసారు.

సమీర, మిగిలిన వాళ్లు హాల్‌నుండి బయటకి వచ్చిన వెంటనే తారకేశ్వర్‌ని, రంగాచారిని, లెక్చరర్‌ని తిట్టుకొని తిట్టుకొని ఏదో చెయ్యాలి చేతులు ముడుచుకుని కూర్చోకూడదని మొదటి గంటా చాలా ఆవేశపడ్డారు.

తరువాత తారకేశ్వర్ పచ్చిరవుడీ అని, అందరూ కలవరని, ఇప్పటికే పి.జి. అయ్యేసరికి మూడు సంవత్సరాలు పడుతోందని, అకడమిక్ ఇయర్ వేస్ట్ అని అనుకొన్నారు. డిపార్ట్‌మెంట్ ప్రెసిడెంట్, సెక్రటరీ తారకేశ్వర్ ఫ్రెండ్స్ కాబట్టి మనమేమీ చెయ్యలేము అనుకొన్నారు.

ఆఖరికి రెండు సంవత్సరాలుంటే స్టూడెంట్స్ ఏం చేయగలరు? స్థిరంగా ఉండే స్టాఫ్ అలాంటి పనులకి సపోర్ట్ చేస్తున్నప్పుడు... అనుకొని, మనమేమీ చెయ్యలేమనే నిర్ణయానికి వచ్చారు.

అందరూ వెళ్లిపోయినా లంచ్‌అవర్ బస్సులుండవని సమీర మాత్రం అక్కడే కూర్చుంది.

తన ప్రక్కకి వచ్చి కూర్చుని హలో అనే దాకా నిశాంత్‌ని పోల్చుకోలేదు సమీర.

"మీరా" అంది ఆశ్చర్యంగా.

బాగా పెరిగిన గడ్డంతో ఉన్న నిశాంత్‌ని విచిత్రంగా చూసింది.

"ఏమి? అలా ఉన్నారు" అని అడిగింది.

"ఎలా ఉన్నాను? చెప్పండి" అన్నాడు ఉత్సుకతతో.

"ప్రపంచంలో ఉన్న అన్ని కష్టాలు మీకే వచ్చినట్టుగా..."

"హమ్మయ్య! సక్సెస్ అయ్యేనన్నమాట"

"ఏంటీ? " అంది అర్ధంగాక.

"మా గైడ్‌ని వదుల్చుకోవాలంటే ఇలా ఉంటేనే అందరి సానుభూతి నామీదకి వచ్చి, నిశాంత్ సంగతి చూడండి అంటారు. అప్పుడు చచ్చినట్లు మా గైడ్ సంతకం చేస్తారు. ఇది మా ఫ్రెండ్ మాస్టర్‌ప్లాన్. ఇప్పటికి పది రోజులనుండీ ఇలాగే వెళ్తున్నాను. మా మాస్టారు ముఖం కందగడ్డలాగ పెట్టుకొన్నారు. ఈ రోజు వుండబట్టలేక 'ఏమొచ్చిందని ఆ వేషాలు' అని గట్టిగా కేకలు వేశారు. ఆయన కోపం చూస్తే చాలా ఆనందమన్పించింది. మిగతా మాస్టర్లు కూడా నన్నే సపోర్ట్ చేస్తున్నారు" అని చెప్పాడు నిశాంత్.

"ఇంతకీ ఆ గెడ్డం ఏ డ్రామా కంపెనీ నుండి తెచ్చారు? "

"ఛా, అచ్చంగా సొంత గెడ్డం అండీ! సరే గానీ టీ తాగుదామా? " అన్నాడు.

"వద్దు" అంది ఠక్కున.

"ఏమీ? " అన్నాడు టీ త్రాగకపోవడమే మిటా అని.

"నాకు టీ ఎప్పుడు పడితే అప్పుడు తాగా లన్పించదు. టీ తాగడం ఒక మంచి అను భూతి"

"బాబోయ్! టీ తాగడానికి కూడా కండి షన్సే! నాకు మాత్రం బోర్‌కొట్టినపుడు, హాయిగా ఉన్నప్పుడు, ఏ టైమ్‌లోనయినా ఆకలేసినపుడు, అప్పుడు ఇప్పుడు, ఇక్కడ అక్కడ, వాళ్లతో వీళ్లతో అనేమీ లేకుండా టీ కన్పించినపుడల్లా, టీ వాసన వచ్చినప్పుడల్లా, ఎవరైనా టీ తాగుతారా? అన్నప్పుడు అర్జెం టుగా తాగేయాలనిపిస్తుంది. తాగేస్తాను"

"అబ్బ! చాలా సింపుల్‌గా చెప్పారుగానీ వెంటనే తాగండి. నాకేం అభ్యంతరంలేదు"

నిశాంత్ టీ కప్పు తెచ్చుకొని తాగుతుం డగా తారకేశ్వర్ వాళ్లూ అటుగా వచ్చారు.

వాళ్లని చూపించి, "అతను మీకు తెలుసా? " అంది సమీర.

"ఎవరూ? "

"అదిగో ఆ జీన్‌పేంట్"

"ఆ తారకేశ్వర్... అని..."

"అతను ఈ రోజు పరీక్ష రాయడానికి వచ్చాడు" అని జరిగినదంతా చెప్పింది.

"అతను పెద్ద గూండా. మెస్‌లో వంటవా డినికొట్టి, చంపేంత పనిచేసి జైలుకి వెళ్లాడు. అసలు రెండు హత్యలు కూడా చేశాడట. వాళ్లవాళ్లంతా ఐ.ఎ.ఎస్.లు, ఎమ్.ఎల్. ఎలు అవడం వలన బయటకి వచ్చేశాడు. ఇతని మీద చాలా ఎలిగేషన్స్ పేపర్‌లో కూడా వచ్చాయి. పాత వి.సి.ని పడగొట్టడా నికి బాగా వర్క్ చేశాడు" అని చెప్పి వెంటనే,

"ఇంతకీ మీరు అతనితో పోట్లాడారా? " అన్నాడు నిశాంత్.

"లేదు, అసలు బుర్ర పనిచేస్తేగా! అదే బాధగా వుంది. కనీసం ఎవ్వరం పెదవి విప్పలేకపోయాం" అంది విచారంగా.

"దానికి విచారం దేనికి? వాళ్లని సంస్క రించడం మనలాంటి వాళ్లవలన కాదు. బాగా పవర్ ఉన్నవాళ్లు, మంచివాళ్లయితే వాళ్ల తిక్క కుదురుస్తారు. అనవసరంగా పిచ్చిపిచ్చి ఆలోచనలు పెట్టుకోక, చదువు సంగతి చూసుకోవడం మంచిది" అన్నాడు నిశాంత్.

మౌనంగా కూర్చుంది సమీర.

"ఇంటికి వెళ్లొచ్చుకదా!" అన్నాడు నిశాంత్.

"వెళ్తాను... అమ్మావాళ్లు కూడా ఎదురు చూస్తుంటారు" అని లేచింది సమీర.

సమీర చాలా డల్‌గా ఉందని, బస్‌స్టాప్ దాకా వచ్చి బస్ ఎక్కించాడు నిశాంత్.

★ ★ ★

సైంటిస్ట్ పోస్టులు పడ్డాయి. పిహెచ్‌డి అయి ఉంటే నేనూ అప్లయి చేసుకొనేవాడిని కదా! అని జగన్ చాలా వ్యథ చెందాడు. సైంటిస్ట్ నవ్వాలనే తన కోరిక ఇక జీవి తంలో తీరదేమోనని దిగులుపడ్డాడు. దాని కితోడు కేంపాస్ నోటిఫికేషన్ వస్తుందనే వార్త. అది విన్న దగ్గరనుండీ జగన్‌కి టెన్షన్ పెరిగిపోయింది.

ఎలాగైనా థీసిస్ సబ్మిట్ చెయ్యాలని చాలా తీవ్రంగా ఆలోచించాడు. సిగరెట్టు మీద సిగరెట్టు కాల్చి కాల్చి తెగ ఆలోచిం చాడు. ఆలోచిస్తున్నకొద్దీ కోపం, కసి, పట్టు దల పెరిగిపోయాయి.

ఒక్కరూ డిపార్ట్‌మెంట్‌లో తనని స్కాల ర్‌గా తీసుకొందుకి అంగీకరించకపోవడం మరీ బాధాకరంగా అన్పించింది. తన దగ్గర తన గైడ్‌ని 'పిచ్చాడండీ బాబూ! ఎలా భరి స్తున్నారో మీరు' అంటూ గైడ్‌ని తిట్టి తన మీద సానుభూతి చూపిస్తున్నట్టుగా ప్రవ ర్తించి, తనని రెచ్చగొట్టిన వాళ్లలో ఒక్కరు కూడా తన సంగతి పట్టించుకోకపోవడంతో

కసిగా ఎలాగైనా సబ్మిట్ చేసి తీరుతాను అనుకొన్నాడు.

ఆఖరికి తన దూరపు బంధువు చుట్టం ఆర్గానిక్ కెమిస్ట్రీ ప్రొఫెసర్‌ని కలిసి, ఒక పదిహేను రోజుల్లో తనగోడు అంతా విన్పించి అతని సానుభూతి సంపాదించాడు. అతనిచేత సంతకం పెట్టించి సబ్మిట్ చెయ్యాలనే తన కోరిక నెమ్మదిగా బయటపెట్టాడు. అది విన్న ప్రొఫెసర్ ముకుందం,

"బాగుండదు... వర్క్ అంతా ఆయన చేశాక నేను సంతకం పెట్టడం ఏమిటి?" అన్నారు.

"ఫరవాలేదండీ. అతను పెట్టనపుడు నా లైఫ్ ఏమవుతుంది? ఒక్కసారి నా గురించి ఆలోచించండీ"

"అది పద్ధతికాదు! అతన్నే ఏదోలాగ బతిమిలాడుకోవడం మంచిది. అతను చేయించిన వర్క్..."

"ప్లీజ్‌సార్! అతనిని నేను అడగలేను. నాకా డిపార్ట్‌మెంట్ అంటేనే రోతగా ఉంది. అతనితో కలిసి రాసిన రెండు పేపర్స్ పబ్లిష్ అయ్యాయి. అవి నా థీసిస్‌నుండి తీసేస్తాను. మిగతాది నేను చేసినదే... ప్లీజ్" అంటూ కాళ్ళమీద పడినంత పనిచేశాడు జగన్.

"నిజమే... అలాగే చేద్దాము. కానీ నా వలన నీకు సంతకం మినహా లాభం ఏంటి? నీ సబ్జక్ట్ నాకేమీ తెలియదు. తర్వాత ఒక పేపర్ కూడా పబ్లిష్ చేయడం అవదు. కేవలం డాక్టర్ అన్పించుకోవడం మినహా రీసెర్చి ప్రోగ్రెస్ ఉండదు. నువ్వు చాలా పెద్ద పొరపాటు చేస్తున్నావన్పిస్తోంది. మరోసారి ఆలోచించు"

"లేదుసార్ ఆలోచించలేను. నా వర్క్ అయిపోయి సంవత్సరం దాటిపోతోంది. ఇప్పటికి అతీగతీ లేదు... ప్లీజ్"

"సరే, నా మాట విని మరొక్కసారి ప్రశాంతంగా ఆలోచించు. అప్పుడు కూడా నేనే సంతకం పెట్టాలన్పిస్తే... చేస్తాను. నాకేమీ అభ్యంతరం లేదు" అన్నారు ముకుందం.

★ ★ ★

జగన్‌కి విజయం సాధించేనని చాలా గర్వంగా అన్పించింది. గాలిలో తేలిపోతున్నట్టుగా అయింది. చాలా స్పీడ్‌గా టైప్ చేయించి రాత్రి పగలు తేడా లేకుండా శ్రమపడి, అన్ని ఫార్మాలటీస్ పూర్తి చేసుకొని నెల రోజులలో థీసిస్ సబ్మిట్ చేశాడు.

సబ్మిట్ చేసిన రోజు మిఠాయి కొని డిపార్ట్‌మెంట్‌లో అందరికీ పరిచయం ఉన్నవారికి, లేనివారికి కూడా ఆనందంగా పంచాడు.

ఆ హడావుడి చూసిన గైడ్ శివానందానికి మాత్రం బీపీ పెరిగిపోయింది. కష్టపడి అయిదు సంవత్సరాలు చేయించిన వర్క్... మెటీరియల్ కలక్షన్, సెమినార్ చెయ్యడం, ఆలోచించడం... అన్నీ ఎంత కష్టపడి నేర్పాను? ఆఖరికి నా ఆలోచనలన్నీ... దానంగా తీసుకొని నన్నే నన్నే... అన్‌పాపులర్ చేశాడు. ఇతని చేత పి.హెచ్.డి సబ్మిట్ చేయిస్తే రేపు ప్రొఫెసర్ పోస్ట్‌కి ఏ అడ్డూలేదనుకొన్నాను. అన్నీ నాశనం చేశాడు. అతడూ సర్వనాశనం అయ్యాడు. పైగా వెధవ గొప్ప అహంకారం.

ఎక్కడైనా ఎలాగ ఉద్యోగం సంపాదిస్తావో నేనూ చూస్తాను. కర్ణుడి విద్యలాగే అవుతుంది. నీకు ఎందుకూ ఉపయోగపడదు... అనుకొంటూ... ఇంకా అక్కడే ఉండి అతనిని చూస్తుంటే తను బరస్ట్ అయి మరికొంచెం అన్‌పాపులర్ అవుతానని భయపడి, గబగబా రూమ్ లాక్ చేసి బయటపడ్డాడు.

★ ★ ★

అడ్వర్టైజ్‌మెంట్ రెండు రోజులలో వస్తుందనగా నిశాంత్‌ని పిల్చారు వామన

రావు. అప్పటికే వాసుదేవ్ తనకి తెలిసిన డీన్‌ఆఫ్ అకడమిక్ అఫైర్స్ చేత వామనరావుకి చెప్పించాడు.

"ఏమిటి నిర్ణయించుకొన్నావు? మరోసారి ఆలోచించు. నా దగ్గర వర్క్ చేయకూడదనే నిర్ణయించుకొన్నావా? " అన్నారు కూల్‌గా.

"ఎస్ సర్"

"అయితే కూర్చో, ఆఖరి సారి టీ తాగుదాం"

టీ తాగుతూ, "నాకు సైన్ చేయడానికి అభ్యంతరం లేదుగానీ ఎవరి దగ్గరకి మారతావు. వాళ్లు ఒకమాట చెప్తే సంతకం పెడ్తాను"

ఆయన అనడంలో నిన్నెవరు తీసుకొంటారులే అనేది ధ్వనించింది. అది గుర్తించాడు నిశాంత్.

"అలాగే" అని చెప్పి బయటకి వచ్చాడు.

అంతవరకూ తనని ఎంకరేజ్ చేసిన వాళ్లలో ఒకరిద్దరిని అడిగాడు. కానీ వాళ్లు ఇప్పటికే మాకూ, ఆయనకీ పడదు. ఇప్పుడు నిన్ను తీసుకొంటే మేమే కచ్చగట్టి అలా చేయించామంటారని నసిగారు. దానికితోడు మా దగ్గర ఖాళీ కూడా లేదు అన్నారు.

వామనరావు మీద వాళ్లభిప్రాయం చెప్పారు గానీ ఆ మాటలకి నిశాంత్ మారిపోయి వాళ్ల దగ్గరికి వస్తానంటాడని అనుకోలేదువాళ్లు.

దాంతో నిశాంత్‌కి నిస్పృహ వచ్చింది. ఎవ్వరూ తీసుకోరు అన్నట్టుగా వామనరావు చూసేచూపు తట్టుకోలేక ఆఖరిగా ఈశ్వరరావుగార్ని చాలా సిగ్గుపడుతూ అడిగాడు.

"నాకేం అభ్యంతరంలేదు. కానీ నేను తొందరలో రిటైరయిపోతాను. తర్వాత స్టేట్స్ వెళ్లిపోదామనుకొంటున్నా" అని నిశాంత్ ముఖం చూసి,

"సర్లే, అప్పుడే చూద్దాం" అనగానే హమ్మయ్య అనుకొని వెళ్లిపోయాడు నిశాంత్.

మర్నాడు నీట్‌గా గడ్డం గీసుకొని శుభ్రంగా తయారయి సాధించాను సుమీ అన్నట్టుగా వెళ్లిన నిశాంత్‌ని చూసి లోలోపల మండిపోయాడు వామనరావు.

నవ్వు ముఖంతో సైన్ చేస్తూ,

"ఇది ఒప్పుకొంటూ వి.సి. ప్రొసీడింగ్స్ వచ్చేసరికి చాలా టైమ్ పడుతుంది. సి.ఎస్.ఐ.ఆర్‌కి కూడా పంపాలి. ఫార్మాలటీస్ పూర్తయ్యేసరికి చాలా టైమ్ పడుతుంది. నీకేం తెలియదు కూడా" అన్నారు వామనరావు.

"ఏమయినా ఫరవాలేదు" అనుకొన్నాడు నిశాంత్ మనసులోనే.



అడ్వర్టైజ్‌మెంట్ రాగానే ఉద్యోగం వచ్చినంతగా ఆనందించాడు వాసుదేవ్. తనకు లేబ్ టెక్నీషియన్‌గానయినా కనీసం వస్తుందని, తర్వాత లెక్చరర్‌ని అయిపోవచ్చునని కలలుగన్నాడు. అతనే నిశాంత్ చేత కూడా బలవంతాన అప్లై చేయించాడు. వి.సి. తలుచుకొంటే ఏదో డిపార్ట్‌మెంట్‌లో ఇరికించగలడని, వి.సిని ఏదోలాగ ఇన్‌ఫ్లుయన్స్ చేయగలమని చాలామంది అప్లై చేశారు.

★ ★ ★

జోగారావు డాక్టరేట్ అయి మూడేళ్లయింది. మొదట రాలేదు. ఈసారి ఖచ్చితంగా సంపాదించాలనుకొన్నాడు. వాళ్ల ప్రొఫెసర్ సూర్యం గేంగ్‌లోనివాళ్లు.

వెంటనే అందరూ ఒకసారి సమావేశమ య్యారు.

అదే టైమ్‌కి తారకేశ్వర్ రిజల్ట్స్ వచ్చాయి. రంగాచారి పేపర్‌లో 55% మార్క్స్ రాలేదు. మండిపోయింది తారకేశ్వర్‌కి. వార్నింగ్ ఇచ్చినా వినలేదు అనే కోపంతో ఆ విషయం ప్రొ. సూర్యంతో చర్చించడానికి వచ్చాడు.

ఏ కరస్పాండెన్స్‌లోనో దూరుస్తారను కొంటే ఇలా చేశాడు చూడండి. గట్టిగా అడి గితే నేను మార్కులు వేశాను. ఎక్స్‌టర్నల్ చేసిన పని అంటాడు" అన్నాడు తారకే శ్వర్.

వెంటనే సూర్యంగారి ప్రొఫెసర్ బ్రెయిన్ ఆలోచించింది. వీళ్లంతా పోస్టులు కావాలం టారని ఎందుకైనా మంచిదని,

"అసలు నేను చెప్పినది మీరేమైనా చేస్తు న్నారా? సర్ నాకో రెండు వేలు... అని పట్టుకు పోతారుగానీ" అన్నాడు గట్టిగా.

"అదేంటి? అలా అంటారు. మొన్నేగా ప్రిలిమినరీ రిజల్ట్స్ వచ్చాయి. మీ కజిన్, మనోళ్లు పాస్ అయ్యారు. దగ్గరుండి ఇన్వి జిలేషన్ కాన్వకేషన్ హాల్లో వేయించుకొని హెల్ప్ చేశాముకదా! కరస్పాండెన్స్ ఎగ్జా మ్స్‌లో మీవూరి కుర్రాళ్లు బుక్ అయితే మాఫీ చేయించాము. ఈమధ్య అన్నీ చిన్న చిన్నవే అనుకోండి. అయినా మీరు చెప్పి నది ఏది చెయ్యలేదు? చెప్పండి" అన్నారు అమర్యాదగా.

ఇలాంటి సమావేశాలలో వాళ్లకి చదువు కొన్న వాళ్లమని, మేధావులనే ముసుగు, సంస్కారమనే ముసుగు వేసుకొని తిరుగు తున్నామనీ ఏవీ గుర్తుండవు. అమానవ, అనాగరిక, గూండాలులాగే మాట్లాడుకొం టారు.

వాళ్లు అలా చేశాము, చేశాము అని చెప్పు కోవడం సహించలేకపోయాడు సూర్యం.

"చేసినవి చెప్పుకోవడం కాదు... చెయ్య నివి? ఆ నైజీరియన్ దగ్గర నాకన్నా ఎక్కువ సీసాలు మీరే కొట్టేసారుకదా! వెంటనే సీటు ఇవ్వలేదని ప్రిన్సిపాల్ మీద గొడవ చెయ్యమంటే చేశారా? "

"ఎలా సర్? మీరు చెప్పినట్టే పదిమం దిమి వెళ్లాము. ఆయన చాలా కూల్‌గా ఇవ్వమని అనలేదుగా! ఇస్తానని, అప్పుడే ఫైల్ తెప్పించి సంతకం పెడితే మేమేమి చేస్తాము? "

"అవున్లే, వాళ్ల వాడికొకడికి ఇచ్చుకోవాలని మరో పదిసీట్లు పెంచి, ఈ నైజీరియన్‌కీ ఇచ్చారు. అది గాకుంటే ఇంకోటి. పి. హె చ్. డి అడ్మిషన్స్ ప్రతి సంవత్సరం చెయ్యడం లేదు, అన్యాయం అని వి.సి కారు, ప్రిన్సి పాల్ కారు ఆపలేరా? అది కూడా చాత కాదా? " అని రెచ్చిపోయాడు ప్రొ. సూర్యం.

"సర్ సిల్లీగా ఎందుకు మాట్లాడుకోవడం. ఇప్పుడు జరగబోయేది చూడండి. మా డిపా ర్ట్‌మెంట్‌లో నాకు ఖచ్చితంగా పోస్ట్ రావాలి" అన్నాడు జోగారావు.

"నాకూ ఏదో ఒకటి చూడండి. ఫిలాస ఫీలో ఇప్పించండి. బయటకి వెళ్తే ఆ వెధవ డిగ్రీ ఎందుకూ పనికిరాదు" అన్నాడు తార కేశ్వర్.

"నువ్వు చేసిన డిగ్రీలన్నీ పనికి వచ్చేస్తా యనే తవరు కష్టపడుతున్నారా? " అన్నాడు ప్రొ. సూర్యం చాలా హేళనగా.

"అందుకే ఈసారి పి. హెచ్. డి సీటు ఇప్పించండి. తర్వాత చూసుకొందాం. లేకుంటే మావూరు పోతాను. ఈ కేంపాస్ గోల నాకెందుకూ? " అన్నాడు తారకేశ్వర్, సూర్యం హేళనకి రియాక్టవుతూ.

"అదిగో, ఆ ఆవేశమే ఆలోచనని చంపే స్తుంది. ఈసారికి నీకు పిహెచ్. డి., జోగా రావుకి ఉద్యోగం ఖాయం. అయితే నేను చెప్పేది చెయ్యాలి."

"ఏంటండీ? " అన్నాడు జోగారావు.

"మీ డిపార్ట్‌మెంట్‌లో రంగాచారి

హెడ్‌గా ఉంటే కష్టం"

"ఎలా? ఆయన మొన్నేగా హెడ్ అయ్యింది"

"రిజైన్ చేయించాలి. అతను రిజైన్ చేస్తే మన అప్పారావు అవుతాడు. ప్రాబ్లమ్ ఉండదు. అప్పారావుకి కూడా ప్రొఫెసర్ పోస్టు కావాలి కదా!"

"ప్లేన్ చెప్పండి"

"ఏముంది... తారకేశ్వర్‌కి ఎలాగా 55% రాలేదు గదా! వార్నింగ్ ఇచ్చినా వినలేదు. రాత్రి అతని ఇంటిమీదకి పదిమంది పొండి. కొబ్బరిచెట్లూ అవీ దులిపి, కాస్త బెదిరించండి. ఇంకా లొంగకుంటే అతగాడికి కులం ఇచ్చిన అహంకారం ఉండనేఉంది. అతని కుల అహంకారం అందరికీ తెలుసు. కాబట్టి మరీ లొంగకుంటే సోషల్‌బోయ్‌కాట్ చేస్తున్నామని కలక్టర్‌కి కాగితం పెడ్తున్నామని చెప్తే చాలు. గురుడు దిగివస్తాడు. నా కర్మ బాగులేదు. ఇదంతా నాకెందుకు ప్రాప్తం లేదనుకొని పోతాడు. కాస్త త్వరగా కానీయండి"

"అలాగే సర్, డబ్బులు"

"రేపు తారకేశ్వర్ వస్తే బేంక్‌లో తీసిఇస్తాను" అనడంతో థేంక్స్ చెప్పి వెళ్ళారు.

★ ★ ★

ఇంగ్లీష్ డిపార్ట్‌మెంట్‌లో బోసు కూడా తన ప్రయత్నాలు ప్రారంభించాడు. వి.సి. ప్రాపకం జాగ్రత్తగా సంపాదించడమేగాక, ముగ్గురు సిండికేట్ మెంబర్లని కూడా మేనేజ్ చేశాడు.

డిపార్ట్‌మెంట్‌లో థీసిస్ సబ్మిట్ చేస్తే మంచిది అనడం కష్టమన్పించింది. రాజుని యథాప్రకారం వ్రాసిపెట్టమని బతిమిలాడాడు. కానీ ఉద్యోగ ప్రయత్నంలోనే ఉన్న రాజు తనూ సబ్మిట్ చెయ్యాలని, టైమ్ లేదనడంతో ఇరవైవేలు దాకా ఖర్చుపెట్టి, ఎవరి చేతనైనా రాయించాలని ప్రయత్నించాడు. ఆఖరికి - అంత హడావుడిగా ఎవ్వరూ చెయ్యలేమనడంతో, తనే సాహసించి, బైబిల్‌మీద అప్పటిదాకా వచ్చిన పుస్తకాలు తీసుకొని రెండు నెలల్లో, జబ్బుశక్తికొద్దీ, 350 పేజీలు ఎక్కించాడు.

ఆ మూడు వందల ఏభై పేజీలు చదవడానికి వాళ్ళగైడ్‌కి అసలు సాహసంలేకపోయింది.

అందుకనే టైప్ చేయించి, బైండ్ చేయించు అన్నారు.

నీట్‌గా బైండ్ చేయించి, సబ్మిషన్‌కు కావాలసిన ఫార్మాలటీస్ అన్నీ పదిరోజులలో పూర్తిచేశాడు. మిగిలిన వాళ్ళకయితే, సెక్షన్ క్లర్క్‌నుండీ, సూపరిడెంట్‌వరకూ తెచ్చిన కాగితాలు కాక మరొకటేదో కాగితం కావాలని తిప్పుతారు. బోసు కాబట్టి ప్రతి కాగితం క్షణాల్లో తెచ్చుకోగలిగాడు.

సబ్మిట్ చేసేదాకా చూద్దాంలే అనుకొన్న గైడ్‌కి కొంచెం భయమేసింది రిస్క్ తీసుకొంటున్నానేమోనని. అందుకని, బోసుని పిల్చి బయటికి వెళ్ళకుండా వుంటే మంచిదని చెప్పారు. ఆ విషయం బోసుకీ తెలుసు.

సాధారణంగా థీసిస్‌తో పాటూ సెక్షన్స్‌కి తిరిగి, తిరిగి పంపించుకొంటేనే వెళ్తాయి. లేకపోతే అశ్రద్ధ చేస్తారు. అందువలనే సబ్మిట్ చేసిన దగ్గర్నుండీ రోజూ సెక్షన్‌కి వెళ్ళి అడుగుతూనే ఉంటారు.

బోసు కూడా ఇరవై రోజులతర్వాత క్లర్క్‌ని కలిసాడు.

"థీసిస్ ఏమయ్యింది? " అన్నాడు.

"ఇలా సబ్మిట్ చేసారో లేదో, అలా అయిపోవాలంటారు. ఎలాగవుతాయి" అన్నాడు విసుగ్గా క్లర్క్.

"అవకపోతే పోయింది. అసలు ఎప్పుడు అవుతుంది? "

"వారంపోయాక" అన్నాడతను.

వారంపోయాక మళ్ళీ వెళ్ళాడు బోసు.

అప్పుడు క్లర్క్ "రేపు చూస్తాను" అన్నాడు కాస్త తగ్గి.

మర్నాడు ఆరుగురితో కలిసి వెళ్ళాడు బోసు.

"పంపించారా? " అన్నాడు.

గ్రూప్‌గా వస్తే ఎవరికయినా భయమే. ఏమి గొడవచేస్తారో. ఏవి నాశనం చేస్తారో నని. అందుకని సూపరింటెండెంట్ కలగ జేసుకొన్నాడు.

"తొందరగా కానీ వాళ్ళపని. ఎన్నాళ్ళు చేస్తారు? " అన్నాడు వాళ్లు వెళ్ళిపోవాలనే ఉద్దేశంతో.

అది విన్న బోసు సూపరింటెండంట్ ఎదురుగా కూర్చున్నాడు.

"పంపిస్తామని అంటున్నాంకదా!" అన్నాడు చిరాగ్గా సూపరింటెండంట్.

"అదే వద్దని చెప్దామని" అన్నాడు బోసు.

"ఏంటీ? " అన్నాడు అర్థంగాక.

"థీసిస్ సబ్మిట్ చేసామన్పించుకొందుకే చేసాము. ఇంటర్వ్యూలు అయ్యేదాకా అది ఎక్కడకీ వెళ్లకూడదు"

"అదేంపద్ధతి. అలా కుదరదు. ఎప్పుడు అవుతాయో, తర్వాత మీరే మామీద రిపోర్ట్ చేస్తారు" అన్నాడు సీరియస్‌గా.

"అలాగా! 'ఇట్ రీజ్ నాట్ వర్దీ' అని రిపోర్ట్ వస్తే చాలా నైపుణ్యంగా నాట్ రిమూవ్ చేసి పిహెచ్‌డిలు ఇచ్చేస్తున్న డిపార్ట్‌మెంట్స్ వాళ్ళున్నారు. వాళ్ళకి మీ సహాయం వుందనీ తెలుసు. మాకు తెలియ దనుకొంటున్నారు. చెప్పనా? పూర్తి డీటైల్స్" అనగానే ఒక్కక్షణం గుండె గుభేల్ మందతనికి.

అతని ముఖం చూసి బోసు చిరునవ్వుతో లేచాడు

★ ★ ★

కేంపాస్‌లో ఉద్యోగంకోసం ఎవరి ప్రయత్నాలు వారు చేసుకొంటుండగా అడ్వర్టైజ్‌మెంట్ మీద కోర్టుకి వెళ్ళి స్టే తెచ్చారు కొందరు. దాంతో అందరికీ అయోమయం.

వాసుదేవ్‌కి ఏవి చేయాలో అర్థంకాలేదు. వి.సి. స్టే వెకేట్ చేయిస్తారని అందరికీ తెలుసు. ఎంతయినా కోర్టు అంటే టైమ్ పడుతుంది. కాబట్టి వాసుదేవ్ మళ్ళీ వస్తానని నిర్ణయించుకొని వెళ్ళిపోయాడు.

పోస్టులు భర్తీ చేయడానికి టైమ్ పడుతుంది కాబట్టి వర్క్ ఇబ్బందిలేకుండా పి.జి. సెంటర్ వాళ్ళు టీచింగ్ అసిస్టెంట్‌గా టెంపరరీగా తీసుకొంటారని నిశాంత్‌ని అప్లై చెయ్యమన్నారు ఈశ్వరరావు.

సంవత్సరం దాటిపోయినా, జగన్ థర్డ్ రిపోర్ట్ రాలేదు. దిగులుగా, గెడ్డం పెంచి తిరగడం మినహా-గైడ్ లేకపోవడంతో ఏవీ చేయలేకపోయాడు.

సంతకం పెట్టిన ప్రొ. ముకుందానికి ఆ ప్రొఫెసర్‌తో వ్యక్తిగత పరిచయం లేకపోవడం, పెద్దగా ఆసక్తిలేకపోవడంవలన అయ్యో పాపం? అనడంతప్ప ఏవీ చేయలేదు.

శాస్త్రి థీసిస్ తిరిగి వచ్చిందని తెలిసిన జగన్‌కి అసలు నిద్రపట్టలేదు.

'ఆల్ రెడీ ఎగ్జిస్టింగ్ రిజల్ట్స్‌నే ప్రూవ్ చేసారని రిపోర్ట్‌రాసి, - థీసిస్ తిరిగి పంపుతూ- దీనికి డాక్టరేట్ ఇవ్వడం న్యాయం కాదన్నారు శాస్త్రి థీసిస్‌కి.

అది విన్న దగ్గరనుండీ తన థీసిస్ తిరిగి వచ్చేస్తుందేమో అనే ఊహతో నిద్రపట్టక, టెన్షన్‌తో కడుపులో వికారం మొదలయి, ఆలోచనలతో పిచ్చివాడ్నయిపోతానేమోననే భయంతో, మనసు ఎంత విప్పుకొందుకి చూసినా సాధ్యంకావడంలేదు.

శాస్త్రికయితే గైడ్ ఉన్నాడు. మళ్ళీ అతని చేత వర్క్‌చేయించి, ఎలాగైనా డాక్టరేట్ తెప్పించగలడు. నాది తిరిగివస్తేనో!... తన వర్క్‌కి లేట్ హడావుడి... అని ఊహించుకొని వణికిపోయాడు. తను చేసిన వర్క్ కొత్తది. మంచిది. ఖచ్చితంగా మంచి రిపోర్ట్ వస్తుందనుకొని కొంత ఊరట పొందినా,

అసలే తను దురదృష్టవంతుడు. ఎవ్వరి కోపరేషన్‌లేదు. సక్సెస్ అవనేమో!

అలా భయం, గాభరాలతో నలిగిపోయిన జగన్ మూడు రోజులు బయటకి రాకుండా, నిద్రాహారాలు లేకుండా వుండటంతో నీర సంగా తయారయ్యాడు.

నాలుగోరోజు శాస్త్రిది తిరిగిరాలేదు. తనకి తప్పుడు వార్త తెలిసినట్టుగా... కలగని నిశ్చింతగా ఫీలయ్యాడు.

మెలకువ వచ్చిన తర్వాత, కలలో విషయం నిజమవ్వాలని భావిస్తూ శాస్త్రి నోటంటే నిజము తెలుసుకోవాలని వెళ్ళాడు.

శాస్త్రిని చూసిన వెంటనే,

"మీ థీసిస్ తిరిగి వచ్చిందా? నిజమే? " అన్నాడు జగన్.

శాస్త్రి నవ్వుతూ "అవును" అన్నాడు.

ఆ మాటకి తట్టుకోలేకపోయాడు జగన్.

"మీరు చాలా మంచి వర్క్ చేసారు కదా? "

"ఏడు సంవత్సరాలు. నేను వర్క్‌చేసి అత్యద్భుతంగా చేశాననే అనుకొన్నాను. కానీ వాళ్ళు అనుకోలేదు"

"ఎందుకు వచ్చిందంటారు? " అని అడి గాడు జగన్ అందులో ఏదన్నా రాజ కీయం ఉందేమో అనే ఉద్దేశంతో.

ఆ ప్రశ్నకి శాస్త్రి చిరునవ్వునవ్వి,

"ప్రారబ్ధంకొద్దీ వచ్చింది. లలాటలిఖితం. కర్మసిద్ధాంతం వంటబట్టించుకోవాలి. 'కర్మ' అనే రెండక్షరాలని నమ్మాలి. నమ్మేమ నుకో, నిశ్చింతగా, సత్యవంతంగా వచ్చినది అనుభవిస్తాము. భారతావనిలో పుట్టారు గానీ మీకెవ్వరికీ అంటలేదు. ప్రతి వొక్కరూ... శాస్త్రీ! నీ థీసిస్ తిరిగొ చ్చిందా? అంటున్నారు."

ఇది సాధారణ విషయం. తిరిగివస్తే వచ్చింది. మళ్ళీ చెయ్యాలి. వీటన్నిటికీ సిద్ధపడే మనము రీసెర్చి రొంపిలోకి దిగాము. యూనివర్శిటీ పుష్కరకాలం దాటి నాతో అనుబంధం పెంచుకోవాలను కొంది. అందుకే వుంచుకొంది. మీకందరికీ ఎందుకయ్యా? బాధ" అని తనదైన హాస్య ధోరణిలో మాట్లాడుతూ,

పక్కనున్న బోటిల్ తీసి గడగడా తాగాడు.

అది బ్రాందీకాదు. విస్కీకాదు, సారా కాదు, కల్లుకాదు. అందుకే ఆశ్చర్యపో యాడు జగన్.

"ఏవిటది? "

"ఇదా, చూడు. హోమియోపతి మందు. వేసవిలో బ్రాందీ గడగడా తాగితే నేను ఛస్తానట. రూమ్‌లో వాళ్ళు తాగడానికి వొప్పుకోలేదు. అయినా గురూ! బ్రాందీ కొనగలిగే మొహమా నాది. కాదుకాబట్టి, వాళ్ళ మాట వినినట్టుగా నటించి బ్రాందీ మానేసా" అని సీసా చూపించాడు.

"ఇదీ ఆల్కహాలే. ఓ చుక్క గుళికల్లో వేసి ఇస్తారు" అని తేలికగా చెప్తూ మరో సీసా తాగేసాడు శాస్త్రి.

జగన్ భయపడ్డాడు.

"బాబోయ్! హోమియోపతిమందు. అలా తాగితే చాలా ప్రమాదం" అన్నాడు.

అతని మాటలు ఏమాత్రం పట్టించుకో లేదు శాస్త్రి.

"మనం పరిశోధకులం. అవునా? మన పని ఏంటి? కొత్తకొత్త విషయాలు కని పెట్టి,

మన ప్రజలంతా తక్కువ డబ్బుతో ఎక్కువ శాశ్వత సౌఖ్యాన్ని పొందేటట్టు, తక్కువ శ్రమతో ఎక్కువ సౌఖ్యం ఎక్కువ మంది పొందేవిధానాలు, నాగరికంగా ప్రజ లంతా పయనించడానిగ్గానూ,

పరికరాలు కావచ్చు, సిద్ధాంతాలు కావచ్చు, భావజాలం కావచ్చు, అందివ్వాలి.

అందుకే, ఒక పరిశోధకుడిగా నేనూ ఏదో చేశాను. అది పనికిరాదన్నారు. అది పనికిరాదనేలోగా, ఖాళీగా కూర్చుని దేశా నికి భారం కాకూడదని,



ఇది కనిపెట్టేనని చేతిలో సీసా చూపిం
చాడు.

"ఇది చీఫ్ మరియు బెస్ట్" తెలుసా!
అని అంటున్న శాస్త్రి మాటలకి, అసలే
టెన్షన్‌లో ఉన్న జగన్‌కి మరి కొంచెం
కడుపులో కెలికినట్లయింది.

"వస్తా గురూ!" అని గబుక్కున లేచాడు
జగన్.

బయటకి వచ్చిన జగన్‌కి సముద్రంలో
పడిపోదామా అన్పించింది. అన్ని సమస్య
లకి పరిష్కారం చావు వొక్కటే అని అను
కొన్నాడు.

అంతలోనే,

తను చదివిన ఫిలాసఫీ, మహాభా
రతం... అన్నీ గుర్తొచ్చి, ధైర్యం తెచ్చుకొం
దుకి ప్రయత్నించాడు. పాండవులంతటి
వాళ్ళకే అన్ని కష్టాలొచ్చాయి. జీవించే
వాళ్ళకన్నా, జీవనపోరాటం చేసేవాళ్ళ జీవి
తాలే స్ఫూర్తిదాయకంగా, చైతన్యవంతంగా
వుంటాయనుకొని,

జారిపోయిన గుండె ధైర్యాన్ని మళ్ళీ

తెచ్చుకొన్నాడు.

★ ★ ★

టీచింగ్ అసిస్టెంట్ పోస్ట్ వచ్చిన నిశాంత్ పి.జి. సెంటర్‌కి వెళ్ళడానికే నిర్ణయించుకొన్నాడు. ఎందుకంటే, అతను డిపార్ట్‌మెంట్‌లో చేస్తున్న వర్క్ ఏమీ లేదు. అప్పటికే నెగ్లిజెన్స్, నిరాసక్తత వచ్చేసాయి. దానికితోడు గైడ్‌ని మార్చుకొన్న దగ్గరనుండీ, ఏదో తెలియని గిల్టీనెస్.

ఒకరకమయిన డిప్రెషన్‌లో పడిపోయిన నిశాంత్, డిపార్ట్‌మెంట్‌కి వెళ్లడం ఇంచుమించు మానేసాడు. గైడ్ ఈశ్వరరావుగారు కూడా, అతడు వచ్చినా, రాకున్నా అడగరు. అతని బాధ్యత అతనికి తెలుసుగదా, అన్నట్టుగా ఊరుకొంటారు.

అందువలనే, బద్ధకంగా అక్కడ ఉండడంకన్నా జీతం తక్కువయినా పి.జి. పాఠాలు చెప్పుకోవడం, అదృష్టంగా భావించి, పి.జి. సెంటర్‌లోకి వెళ్ళిపోయాడు నిశాంత్.

★ ★ ★

'పట్టాభికి కేంపాస్‌లోనే టీచింగ్ అసిస్టెంట్ పోస్ట్ వచ్చింది. అతను మహానందపడిపోయాడు. నాలుగు నెలలజీతం లేదనుకొని, ఆ డబ్బుతో గైడ్‌కి మందు పార్టీలు ఘనంగా ఇచ్చి థీసిస్ సంతకం చేయించాడు.

డాక్టరేట్ వచ్చిన పట్టాభి, కేంపాస్ రిక్రూట్‌మెంట్‌లో, తనకే లెక్చరర్ పోస్ట్ వస్తుందనుకొని, దానికోసం ఎదురుచూడడం ఆరంభించాడు.

★ ★ ★

కోర్టులో కేసువలన, పాత అడ్వర్టైజ్‌మెంట్ కాన్సిల్ అయి, కొత్తది వచ్చేసరికి, సుమారుగా సంవత్సరం దాటిపోయింది. అడ్వర్టైజ్‌మెంట్ వచ్చిన ఎనిమిది నెలలకి ఇంటర్వ్యూలు అయ్యాయి.

అందరూ ఎవరికి చేతనైన ప్రయత్నాలు వాళ్ళు చేసుకొన్నారు. మరోపక్క ఇంటర్వ్యూ ప్రిపరేషన్ టెన్షన్‌తో గడిపిన వాళ్ళంతా, ఇంటర్వ్యూలు అవగానే కాస్త ఊపిరి పీల్చుకొన్నారు.

ఇంటర్వ్యూ అయిన దగ్గరనుండీ ఎవరికి తెలిసిన రీతిలో వాళ్ళు పేనల్‌లో ఎవరున్నారో తెలుసుకోవడంలో మునిగిపోయారు.

కొంతమంది పేనల్‌లో ఉన్నారంటే కొంతమంది లేరని... ఇలా రకరకాల వార్తలు. పేనల్‌లో ఉన్నారని చెప్పిన వారి మాటలే చాలామందికి నిజమనుకోవాలనిపించి, చాలా ఆశగా ఎదురుచూడ మొదలెట్టారు.

అందరూ ఊహించినట్టుగానే వి.సి. టరమ్ అయిపోతుండగా, మీటింగ్ పెట్టి రిజల్ట్స్ ఇచ్చారు.

వాసుదేవ్‌కి, నిశాంత్‌కి, రాజుకి, జగన్ జోగారావుకి, పట్టాభిలకి రాలేదు. బోసు అర్జున్‌కి వచ్చాయి.

మిగిలిన వాళ్ళకి ఏవో రిజర్వేషన్స్ వలనా వీటివలనా రాలేదనుకొన్నా, పి.హెచ్.డి. ఉండీ, ఎస్.సి. రిజర్వేషన్ ఉన్న రాజుకి రాకపోవడం చాలా బాధాకరమైంది అందరికీ.

ఇంగ్లీష్ డిపార్ట్‌మెంట్‌లో బోసుకి వచ్చింది. సెంట్రల్ యూనివర్శిటీ నుండి వచ్చిన జయమాల అనే ఆవిడకి పోస్ట్ వచ్చింది. ఆమెకి డాక్టరేట్ లేదు. ఎమ్.ఫిల్ కూడా లేదు, అని కొందరు- ఉందని కొందరు అన్నారు. రాజుకి వస్తుందనుకొన్న పోస్ట్ ఆమెకి వచ్చింది. ఆమె హైమెండేషన్‌తో వచ్చింది. ఆమె సెంట్రల్ యూనివర్శిటీలో పి.జి. టీచింగ్ ఇన్ ఇంగ్లీష్ అనే డిప్లొమాచేసింది. ఆమె కోసం స్పెషల్ మీటింగ్‌పెట్టి పి.జి టీచింగ్ ఇన్ ఇంగ్లీష్ డిప్లొమా, ఎమ్.ఫిల్‌తో ఈక్వల్ అని ఒక రిసల్యూషన్ పాస్‌చేసి ఉద్యోగం ఇచ్చేసారు.

మన యూనివర్శిటీలో కూడా టీచింగ్ డిప్లొమా ఉంది. ఆ డిప్లొమా, ఈ డిప్లొమాతో సమానంగానీ, ఎమ్.ఫిల్‌తో ఎందుకు సమానం చేయాలని, అంతా గుర్తించి అడిగేసరికి, సంవత్సరం దాటిపోతుంది. ఒకసారి పోస్ట్ వచ్చిన తర్వాత కోర్టునుండీ వాళ్ళు ప్రొటెక్షన్ ఈజీగా తెచ్చుకొంటారు. ఈలోగా ఆమెకి యూనివర్శిటీ సెంటర్‌గా నెట్ రాస్తే వచ్చేస్తుంది.

యూనివర్శిటీలో సెలక్షన్ లిస్ట్ పెట్టిన మర్నాడునుండీ నాలుగయిదు రోజులు, పేపర్‌వాళ్ళు రిజర్వేషన్స్ అమలు అవలేదని, అన్యాయం జరిగిందని, పేనల్స్ మార్చేసారని తాజాతాజాగా బాక్సులు కట్టి మరీ వేశారు.

జోగారావులాంటివారు అసోసియేషన్ తరఫున కోర్టుకి వెళ్ళేరు.

పి.జి. సెంటర్‌లో ప్రొఫెసర్, రీడర్ జాయిన్ అవకపోవడంతో- టీచింగ్ అసిస్టెంట్ పోస్ట్‌లో కంటిన్యూ అయ్యాడు నిశాంత్.

పట్టాభి మాత్రం తనకి ఉద్యోగం రాకపోయేసరికి, తట్టుకోలేక తాగి అందర్నీ తిట్టాడు.

బాగా నిరాశతో తిరుగుతున్న తనని చూసి వాళ్ళ హెడ్ వి.సి. దగ్గరికి తీసుకొని వెళ్ళి అతని విషయమంతా చెప్పారు.

వి.సి. చాలా సానుభూతిగా విన్నారు. నాలుగేళ్ల సర్వీసు వృధా అయినందుకు విచారించారు. కానీ ప్రస్తుతం కేంపాస్‌లో ఉద్యోగం రావడం కష్టం కాబట్టి, డిగ్రీ కాలేజీలో ఎయిడెడ్ వేకెన్సీకి రికమెండ్ చేసి-

మానవతా దృష్టితో పట్టాభికి పోస్ట్ ఇప్పించారు.

★ ★ ★

జగన్ థీసిస్‌కి మంచి రిపోర్ట్స్ వచ్చాయి. పిహెచ్.డి. డిగ్రీ వచ్చింది. కేంపాస్‌లో ఉద్యోగం మాత్రం రాలేదు.

ఇతర యూనివర్శిటీలు రెండింటికి ఇంటర్వ్యూలకి వెళ్లాడు జగన్.

ఒక యూనివర్శిటీలో ఎక్స్‌టర్నల్‌గా శివానందం రావడంతో ఆశ వదులుకొన్నాడు.

ఇంకో యూనివర్శిటీలో, అతను వర్క్ చేసిన సబ్జెక్ట్ గురించి అడుగుతూ-

ఆ ఫీల్డ్‌లో శివానందం బాగా వర్క్ చేశారురదా! అని ప్రశ్నించడంతో నిదానంగా ఇతను కాంట్రవర్షల్ అని వాళ్లకి తెలిసి పోస్ట్ ఇవ్వలేదు.

యూనివర్శిటీలలో ఎలాగా రాదనుకొన్న జగన్ ఒక పెద్ద కంపెనీలో సైంటిస్ట్ పోస్ట్‌కి ప్రయత్నించాడు. కానీ తన వర్క్‌తో జగన్ లైఫ్ లీడ్ చెయ్యడమా? అనే కసితో శివానందం రాకుండా అడ్డుకొన్నాడు.

అటువంటి పరిస్థితులలో జగన్‌కి జూనియర్ లెక్చరర్ పోస్ట్ రావడంతో జాయిన్ అయ్యాడు.

తనకున్న ఇంటలెక్చువల్ పవర్‌ని వాడుకొందుకి అవకాశం లేక, వస్తున్న థాట్స్‌ని క్లేరిఫై చేసే గురువులేక లేబ్ ఎక్విప్‌మెంట్ లేక అనుక్షణం అసంతృప్తిగా జీవించడానికి సిద్ధపడ్డాడు జగన్.

★ ★ ★

జూనియర్ లెక్చరర్‌గా జాయినయిన సమీరకి కమల అనే ఫిజిక్స్ లెక్చరర్ పరిచయం అయింది.

ఆహ్లాదకరంగా నవ్వుతూ, చైతన్య స్రవంతిలా గలగలా మాట్లాడే ఆమె వస్తే వసంత ఋతువు వచ్చినట్టుగా ఉంటుంది. అందుకే ఆమెతో మీ పేరు కమల అని కాకుండా వసంత అని పెడ్తే బాగుండేది. అంటూ ఉంటుంది సమీర.

అలాంటి కమలని ఒకరోజు ప్రిన్సిపాల్ తీవ్ర స్థాయిలో తిడ్తూ ఉంటే- ఆమె ఏదో చెప్పడానికి ప్రయత్నిస్తోంది.

సైన్ చేయడానికి వెళ్ళిన సమీరని చూసి-

"నా బదులు ఈమె చేస్తుందండీ, ఇన్విజి

లేషన్" అంది కమల.

"మీ బదులేమిటి? ఆమెకీ వుంది వర్క్. ఎవ్వరూ రాకుంటే ఎలా కండక్ట్ చేస్తాను. అందరికీ ఉంది బాధ్యత" అని కసిరినట్టుగా మాట్లాడేరు.

"నేను ఎప్పుడు మీరు రమ్మంటే అప్పుడు వస్తున్నాను. చెప్పకుండా మానేసిన వాళ్లని ఏమీ అనరు. ఈరోజు నాకు అవదని చెప్తున్నా విన్పించుకోవడంలేదు. మా అబ్బాయికి మీసిల్స్. ఇంట్లో ఒక్కడ్నీ పనమ్మాయి మీద వదిలి వచ్చాను. ఓ పక్కనా ఎమ్. ఫిల్ డిసర్టేషన్ మరో వారంలో సబ్మిట్ చెయ్యాలి. మా గైడ్ స్టేట్స్ వెళ్లిపోతున్నారు. సెలవు అడిగితే మీరు ఇవ్వరు. ఏవి చెయ్యను? అందుకే చెప్తున్నా. మీరు ఏవి చేస్తే చెయ్యండి. నేను ఇన్విజిలేషన్ చెయ్యను. వారంరోజుల బట్టీ వర్క్ సఫర్ అయినా చేశాను. ఇక చెయ్యను" అని వేగంగా వెళ్లిపోయింది.

కాలేజీ బయటకి వచ్చిన సావిత్రికి బాబుని చూసి రావాలన్పించింది. బలవంతాన మనసు తిప్పుకొని డిపార్ట్‌మెంట్‌కి వెళ్లింది.

ఇంటికి వెళ్తే- నామీద బాబుని వదిలేసి ఆయన వెళ్ళిపోతారు. లేకుంటే తనే ఏదో పడ్తాననుకొంది. ఒక పిల్లడిని కని, వాడి పెంపకానికి వంతులాడుతున్నానా అన్పించి మనసు బాధగా మూల్గింది.

దాంతో మనసు పాడై కంప్యూటర్ ముందు కూర్చున్నా ఏవీ చెయ్యలేకపోయింది.

బయటకి వెళ్ళి టీ తాగివచ్చి నిగ్రహంగా వర్క్ ఆరంభించింది.

మళ్లీ కంప్యూటర్ ఖాళీ దొరకకపోతే కష్టమని రాత్రి పన్నెండుదాకా కూర్చుని వర్క్ చేసింది. ప్రొఫెసర్ కూడా అక్కడే తనతో వుండి వర్క్ చేస్తూవుండడంతో ఇంటికి వెళ్లాలి అని అనలేకపోయింది.

ఇంటికి వచ్చేసరికి పన్నెండున్నర అయింది. దారి పొడవునా ఏదో భయం. టెన్షన్. చిన్నప్పటినుండీ అదే భయం. కాస్త చీకటిపడ్డాక ఇంటికి వస్తే-

వీధి గదిలో ఈజీఛైర్‌లో కూర్చుని- తదేకంగా చూసే తండ్రి ముఖం

ఎప్పుడూ గుర్తొచ్చి గుండెల్లో గుబులుగా అన్పించి, గిల్టీగా ఫీలయ్యి, తప్పు చేసినట్టుగా- ముడుచుకుపోతుంది.

అదే ఫీలింగ్‌తో, దిగులుగా కాలింగ్‌బెల్ నొక్కింది.

కోపంగా వున్న భర్త ముఖం చూసి గభాల్న లోపలికి వచ్చి తలుపులు వేసింది.

ఆమెని చూడగానే "కొడుక్కి జబ్బుగా వున్నా రాచకార్యాలు తగలడ్డాయా? అర్ధరాత్రిదాకా? " అన్నాడు కమల భర్త.

"ఎల్లుండి మాస్టారు వెళ్లిపోతారుగా..." అని చెప్పబోయింది.

"అయితే, ప్రొఫెసర్ పక్కన పడుకొంటే గానీ డిగ్రీ ఇవ్వనన్నాడు. నువ్వు పడుకొని వచ్చావు" అని కఠినంగా అన్నాడు.

ఆ మాటకి, అంతసేపూ వున్న భయం పోయి దానిస్థానే కసిరేగింది కమలకి.

"అవును, వాడి పక్కనే కాదు. ఈ సృష్ట్యాదినుండీ పుట్టిన ప్రతి ప్రాణీ- చిన్నా చితకా, ముసలీ, ముతకా అందరి పక్కనా పడుకొన్నా. పడుకొంటాను కూడా. ఏమిచేస్తావు? "

అప్పటికే బాగా డల్‌గా ఉన్న కొడుకు అది విన్నాడు. భయం భయంగా-

"మమ్మీ!" అన్నాడు లోగొంతుతో

ఆ పిలుపు వినగానే సావిత్రి చాలా సిగ్గుపడి దైన్యంగా-

"బాబీ" అంది.

పక్కకి వచ్చి కూర్చుని, తలమీద చేయి వేసి తన ఆలస్యానికి సంజాయిషీ ఇస్తూ, వస్తున్న దుఃఖాన్ని ఆపుకొంది.

"ఏమైనా తిన్నావా? " అని అడిగింది.

"డాడీ, ఆపిల్స్ తెచ్చారుగా!"

"అయితే, పడుకో నాన్నా" అని-

"ఇంతకీ డాడీ భోజనం చేశారా? " అంది.

"ఏమో తెలీదు" అన్నాడు.

అయ్యో ఆకలికి అసలే ఆగలేరు. అందుకే బాగా కోపం వచ్చింది అనుకొంది.

అలా అనుకోవడంతో హాయిగా అన్పించింది. పరిస్థితులవలన ఆయన చెడ్డవాడిగా ప్రవర్తించారుగానీ లేకపోతే చాలా మంచి వారని- తప్పంతా పరిస్థితులదే అనుకోవడం వలన మనసు కొద్దిగా ఊరట పొందింది.

ఊరడిల్లడంతో- మరచిపోయిన ఆకలి గుర్తొచ్చి బాబు నిద్రపోయాడని, రూఢీ చేసుకొని వంటగదిలోనికి వెళ్లింది.

డైనింగ్ టేబుల్‌మీద ఉదయం తిన్న కంచం అని తెలియచెప్పినట్టుగా ఎండిపోయిన కంచం, రాత్రి తిన్న కంచం. మూత లేని పెరుగుగిన్నె, నేతిచెమ్చాతో ఆవకాయ వడ్డించుకొన్నారని చెప్తున్న- ఎర్రటి నేతితో గిన్నె, అడ్డదిడ్డంగా గ్లాసులు, తరిగిన ఉల్లిపాయ తొక్కలతో టేబుల్ చాలా చీదరగా అన్పించింది.

దీనికితోడు, భర్త రెండుపూటలా బాగా తినే తనమీద కేకలు వేశాడన్పించి, తప్పుడు పరిస్థితులు కావు. తప్పుడు మనిషి అన్పించడంతో, మనసంతా మొద్దుబారిపోయింది.

కనీసం టేబుల్ క్లీన్ చెయ్యొచ్చుగదా! అనుకొంది. ఏ పనులూ చెయ్యకుండా తయారుచేసిన అత్తగారిమీద కోపం వచ్చింది కమలకి.

బాబుకి ఒంట్లో బాగులేదని చెప్పి, రెండు రోజులు ఉండమంటే వుండలేదని మరో సారి అనుకొంది.

చూలింత, బాలింతగా ముప్పైఏళ్లు గడిచాయి. నేను ఇక ఏ పిల్లవాడికీ చెయ్యను. అత్తలకి సేవలు చేసి చేసి తీరా మేము అత్తలమయ్యేసరికి-

ఉద్యోగస్తులయిన కోడళ్లకి సేవలు చెయ్యాల్సివస్తోందనే అత్తగారి మాటలు జ్ఞాపకం వచ్చాయి.

ఆడబడుచులు, మరుదులు, అందరూ ఈవిడ కన్నపిల్లలేకదా, నేను ఎందుకు చెయ్యాలి? ఈసారి ఏ పండగకైనా, ఎవ్వరైనా గుమ్మం తొక్కితే చూస్తానని చాలా కసిగా అనుకొంది కమల.

మరుక్షణంలో తన ఆలోచనలకి తనకే సిగ్గనిపించి తనమీద తనకే అసహ్యం అనిపించి ఏమీ చెయ్యలేని నిస్సహాయతతో ఏడుస్తూ మంచంమీద పడుకొని కరవుతీరా ఏడ్చింది.

ఏడుపు ఆగిన తర్వాత మళ్లీ ఆకలి అన్పించింది. అమ్మా, నాన్న తినమని బ్రతిమిలాడినా మొండికేసి ఎంత బాధ పెట్టేదాన్నో?

తనకోసం, మండుటెండలో పుచ్చకాయ పట్టుకొని నడిచివచ్చిన తండ్రిని చూసి-

"ఎవడు తెమ్మన్నాడు, ఈ ఎండలో? అదంతా పెద్ద అభిమానం అనుకోవాలి కాబోలు" అంటూ తను చిన్నబుచ్చినప్పుడు, ఒక్కక్షణం చిన్నబోయి వెంటనే-

"ఎండలోనే దీని రుచి, తినమ్మా" అని కట్‌చేసి ముక్కలు పెట్టినా తిననంటే-

మరోగంట పోయాక మళ్ళీ బ్రతిమిలాడి తినబెట్టిన తండ్రిని తలచుకొని తలచుకొని కుమిలిపోయింది కమల.

ఇప్పుడు కనీసం 'తిన్నావా? ' అని అడిగే వాళ్లే లేరు నాన్నా! అనుకొని... అలా ఆలోచనలతోనే నిద్రపోయింది.

★ ★ ★

అర్జెంటుగా రమ్మనమని జలజ కబురు పెట్టింది. ఆదరాబాదరాగా వెళ్లింది సమీర.

సమీరని చూసిన వెంటనే గట్టిగా పట్టుకొని, "నేను చచ్చిపోదామనుకొంటున్నా" అన్నది ఏడుస్తూ జలజ.

జలజ మాటలు సీరియస్‌గా తీసుకోకుండా, నవ్వుతూ-

"ఎందుకట? " అంది.

"పెళ్లిచూపుల్లో సెంచరీ కొట్టేశానా? ఆఖరిదాంట్లో కూడా ఫెయిల్ అయ్యాను. ఇంట్లో అంతా అమ్మ కూడా... ఎప్పటికీ

వదలడంలేదు అనుకొంటున్నారు. అన్నయ్య, అమెరికాలో ఎవడో ఉన్నాట్ట, వాడిని చేసుకోమని వత్తిడి చేస్తున్నాడు"

"చేసుకోవచ్చుగదా"

"చాల్లే! వాళ్లు అక్కడే సెటిల్ అయ్యారు. వాళ్లు ఎలాంటివారో! మా రెండో అక్కకి బొంబాయి సంబంధం చేశారా? బ్రోతల్ హౌస్ నడిపేవాళ్లు. భరించలేక, కూతురిని ఇవ్వమని వాళ్లన్నప్పటికీ, పాపని అక్కడే వదలి, పారిపోయివచ్చి, ఇక్కడ ఇంటర్ కేస్ట్ మేరేజ్ చేసుకొంది. అనుభవంలోకి వచ్చినా, అమెరికా సంబంధం చేసుకోమని చంపేస్తున్నారు. పైగా ఇంత వయసొచ్చింది. ఎవడు నిన్ను చేసుకొంటాడు... అంటున్నారు.

అసలు అప్పుడే నన్ను ప్రేమించిన చంద్రని చేసుకొంటే హాయిగా ఉండేదాన్ని. అప్పుడే చిన్నక్క పెళ్లి. అమ్మ ఏడుపు, అన్నయ్య ఇంట్లోంచి వెళ్లిపోవడం... భయపడి మానేశా. దానికితోడు నా చదువు..." అని ఆగకుండా చెప్పుకుపోతున్న జలజ మాటలని కట్ చేస్తూ-

"ఇంతకీ ఏం చెయ్యాలని మీ ఉద్దేశం? " అంది సమీర.

"నిజంగా చచ్చిపోవాలనుకొంటున్నా. వెధవ బ్రతుకు..." అంది చాలా ఫ్రస్ట్రేషన్‌తో జలజ.

"చచ్చిపోతానంటారేంటి, అస్తమానం. అవునులెండి. అసలు మనిషికి ఏదైనా సాధించడంవలన వచ్చే తృప్తితో మర్నాడు బ్రతకాలన్పిస్తుంది. మీ ధ్యేయం పెళ్లి. అదీ ఎవరో చెయ్యాలి. అది జరగడంలేదు. విసుగ్గా వుంది జీవితం. దానిబదులు చేతిలో ఉన్న పిహెచ్.డి. చెయ్యొచ్చుగదా! చంటి పిల్లలా అమ్మ వద్దంది... అంటారు" అంది చాలా చిరాగ్గా సమీర.

"అమ్మ గురించే కాదు. నాకూ భయమే. పెళ్లవదేమోనని. నిర్లజ్జగా చెప్తున్నాను. ఈ ఒంటరితనం నేను భరించలేను. లోన్లీనెస్. చాలా భయంకరం. అది నేను భరించలేను. ఇప్పటికే చంద్రని పెళ్లి చేసుకోకుండా పొరపాటు చేశానేమో అని బాధపడ్తున్నా"

"చంద్ర అడ్రస్ తెలుసుగదా! అతడికి పెళ్లయిందో, లేదో తెలుసుకోవచ్చుగదా"

"చంద్రనా! అబ్బే! వద్దు..." అంది జలజ.

ఆమె మాటకి సమాధానం చెప్పకుండా "మాధురిలా ఉంది" అని "మాధురీ" అని కేకేసింది.

వస్తున్న మాధురిని, ఆమె పక్కన నడుస్తున్న అబ్బాయినీ చూసింది జలజ.

"అతను మాధురి బోయ్‌ఫ్రెండ్. తెగతిరుగుతుంది. హాయిగా ప్రేమించి పెళ్లాడేస్తారు. మనవాళ్లు మనని ప్రేమించానివ్వరు. వాళ్లకి పెళ్లి చేయడం చాతకాదు" అంది జలజ.

దగ్గరకి వచ్చింది మాధురి.

"హాయ్ సమీరా! నా పెళ్లి కార్డు ఇదిగో. పెళ్లికి తప్పకుండా గిఫ్ట్ పట్టుకొని రావాలి" అంది నవ్వుతూ మాధురి.

"ఏం కావాలో చెప్పు చిరుద్యోగిని అని మరచిపోకుండా. ఇంతకీ సంసారం పెడతావా? అతనో హాస్టల్‌లో, నువ్వో హాస్టల్‌లోనేనా? " అడిగింది సమీర.

"హాస్టల్ తిండి తినీతినీ నాలిక పట్టా అయిపోయింది. హాయిగా ఇల్లు తీసుకొని ఉంటాం. అతనికి ఫెలోషిప్ వస్తుంది. నీలాగే, నేనూ పార్ట్‌టైమ్ చూసుకొంటా. శ్రద్ధగా పిహెచ్.డి, తర్వాత డి.లిట్. ఎన్ని చేసినా మళ్లీ మనకి చిరుద్యోగాలు, చిరుజీతాలే వచ్చేవి. అందువలన వస్తాయో, రావో తెలియని ఉద్యోగాల కోసం ఎదురుచూస్తూ కూర్చునే బదులు, హాయిగా పెళ్లి చేసుకొంటే, వయసయినా వేస్టవదు" అంది మాధురి, చివరి మాటలు జలజ వినకుండా.

"నిజమే, వస్తాయంటావా? " అంది ఉద్యోగాల గురించి జలజ.

"ఆ, ఎందుకు రాదూ! సబ్మిట్ చేస్తేనే హెచ్.డి. వస్తుంది. కానీ, మనం ఆహ్వానించకపోయినా వయసు వస్తుంది"

"కావాలంటే కడుపూ వస్తూంది..." అని న్నుగీటి నవ్వుతూ, "మళ్ళీ కలుద్దాం" అని ాధురి వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళగానే, "ఛీ, వెధవమాటలు ఈ ుల్లతోనా నీకు స్నేహం" అంది జలజ.

"మాధురి తెలివైనది. తనకేమి కావాలో ుచ్చితంగా తెలుసు. అది సంపాదించుకొంుంది. సరే, తన గురించి ఎందుకుగానీ, చంద్రాకి ఫోన్ చేస్తాను. మీకు నచ్చినప్పుడు ేసుకోవడం మంచిది" అని బలవంతం ేస్తున్న సమీర చేతులు పట్టుకొని కూర్చోబెట్టింది జలజ.

చాలా కోపం వచ్చింది సమీరకి.

"పెళ్ళో, పెళ్ళో అంటారు. దానికి ప్రయత్నం చెయ్యకూడదు" అంది తీవ్రంగా.

"ప్లీజ్, చంద్ర మాత్రం వద్దు"

"చంద్రని చేసుకోవడానికి అప్పుడు భయపడ్డారు. తెలియనితనంవలన. ఇప్పుడు కూడా పిరికితనమే. నాకు చాలా అసహ్యం

'అసహ్యం' అన్న మాట భరింపలేకపోయింది జలజ.

"సమీరా! చంద్రని కాదన్నది నేను కేవలం భయంవలన మాత్రమే కాదు. అది కూడా ఒక కారణం కావచ్చు. అసలు నువ్వు అనుకొన్నట్టు నా ధ్యేయం పెళ్ళి కాదు. నిజానికి న్యూ ఎకనామిక్ పోలసీస్‌మీద మంచి రీసెర్చి చెయ్యాలనుకొన్నాను. నా థీసిస్ ఈ కాలానికి, సొసైటీకి ఉపయోగ పడాలనుకున్నాను. అది నిజంగా చాలా మంచి వర్క్. ఈ విషయం చంద్రతో డిస్కస్ చేస్తే ఎమ్.ఏ. చేశావు. చాల్లెద్దూ అన్నాడు. అతి తేలికగా నా మాట కొట్టిపారేస్తూ, నేనేదో డిగ్రీ కోసమే తాపత్రయపడిపోతున్నట్టు. అందువల్లే అతనిని వదులుకొన్నాను. అతనికి నామీద ప్రేమ వుందంటాడు. కానీ నాకు ఇష్టమయినది, నేను చాలా గొప్పగా భావించేదానికి, అతను ఏ మాత్రం ప్రాముఖ్యతనివ్వడు.

అయితే ఇప్పుడు పెళ్ళి కావాలని ఎందుకనుకొంటున్నానో తెలుసా? లోన్లీనెస్. నాకు సపోర్ట్ చేసేవాళ్ళు ఎవరూ లేరు. ఐసోలేషన్ ఫీల్ అవుతున్నా. దానికితోడు ఇంట్లో వాళ్ల గోల. మన వ్యవస్థలలో పెళ్ళికాని ఆడపిల్లమీద ఇంట్లో అందరూ, బంధువులూ కూడా పెత్తనం చేస్తారు. సలహాలు ఇస్తారు. పెళ్ళయితే, ఉమ్మడి కుటుంబాలు పోయాయి కాబట్టి మొగుడి పెత్తనం మాత్రమే ఉంటుంది. ఒక్కడి కాళ్ళావేళ్ళాబడి అయినా మన ఇష్టం జరిపించుకోవచ్చు. నా రీసెర్చి ప్రశాంతంగా అవడానికే పెళ్ళి కావాలనుకొంటున్నా...

అసలు రీసెర్చికి ఎంకరేజ్‌మెంట్ ఉందా? అటు ఇంట్లో వాళ్ళగోల. ఇటు కేంపాస్‌లో మరో గోల. మా ఆలోచనలని సమర్థిస్తూ ధైర్యం చెప్పి, ముందుకి నడిపి మానసిక ధైర్యాన్ని ఇచ్చేవాళ్లు కావాలి. గైడ్ ఇవ్వగలరు. కానీ నా దురదృష్టం కొద్దీ, ప్రతిక్షణం నా శరీరంమీద అతని దృష్టి పడకుండా జాగ్రత్తగా మేనేజ్ చేసుకురావడంతోనే జీవితం అయిపోతోంది. ఇక సీరియస్ డిస్కషన్ ఎక్కడా? "

"ప్చ్! చంద్రని పెళ్ళిచేసుకొని మరో ఊరెళ్ళిపోయి, ఇండివిడ్యువల్‌గా వర్క్ చేసుకోవలసినది" అంది సమీర.

"లేదు సమీరా! చాలా కష్టం. మనకి ఒక ప్లాట్‌ఫారమ్ లేకుండా వర్క్‌కష్టం. ఏమారుమూలో కూర్చునిచేస్తే అందరూ చేసినదే ఇప్పుడు కొత్తగా చేస్తున్నామనుకొని చేసే ప్రమాదం వుంది. అసలు మెటీరియల్ సంపాదించడం ఎలా? ఇక్కడ ఇంత ఎక్స్‌పోజర్ ఉంటేనే కొన్ని రిజల్ట్స్ అలాగే అవుతున్నాయి. అదీగాక, ఒకోసారి మన ఆలో

చన 100% కరక్టే అని పొరబడతాము. డిస్కషన్స్, సెమినార్స్‌లో ఆలోచన కరక్ట్ చేయబడుతుంది. కొత్త ఆలోచనలు తెలుస్తాయి"

"అవును మా ప్రొఫెసర్ మీ భావాన్నే చక్కగా చెప్పారిలా,

ఒక రూపాయి నువ్వు ఇయ్యి. ఒక రూపాయినేనిస్తా. మనిద్దరిదగ్గరా మళ్లీ ఒకే రూపాయి ఉంటుంది. నువ్వో ఆలోచన నాకియ్యి. నేనో ఆలోచన నీకిస్తాను. మనిద్దరి దగ్గరా రెండేసి ఆలోచనలుంటాయి"

"ఎవరు చెప్పారు? ఆ... ముద్దుపెట్టించుకొన్న సీనియర్ ప్రొఫెసరేనా?"

"అవును"

"ఏవిటో ఈ వైరుధ్యాలు. ఎన్ని ఆశలతో కేంపాస్‌లో ఉన్నాం. గైడ్ దగ్గర అనుక్షణం శీల రక్షణ జాగరూకతతో సరిపోతోంది. ఫరవాలేదనుకొందుకి, నా మనస్సు వొప్పుకోదు. పెరిగిన వాతావరణం అంగీకరించదు. అందుకే ఒక ఏబైవేలో, లక్షో ఇచ్చేసి పెళ్ళిచేసుకొంటే ఏ గొడవా వుండదు. పెళ్లయిన వాళ్ళంటే కాస్త ఆ దృష్టి వుండదు. కట్నం ఇవ్వడం నీ దృష్టిలో, చట్టం దృష్టిలో తప్పు కావచ్చు. కట్నం తీసుకోకుండా చేసుకొనేవాళ్ళకోసం వెయిట్ చెయ్యలేను. నాకు మాత్రం నా వర్కే ముఖ్యం" అని చాలా ఆవేశంగా, ఆర్తిగా రొప్పుతూ మాట్లాడుతున్న జలజ మాటలు, నిశాంత్ రాకతో ఆగిపోయాయి.

"దేనిగురించీ? సీరియస్ డిస్కషన్" అన్నాడు నిశాంత్.

"కట్నాలు గురించి. నాలాంటి వాళ్లవలనే కట్నాలు విజృంభించేస్తున్నాయని మా సమీర అభిప్రాయం. అందరూ వ్యతిరేకిస్తే ఖచ్చితంగా పోతాయట. మీ అభిప్రాయం ఏంటి?" అంది జలజ.

"వ్యతిరిక్తత చూపడానికి, త్యాగాలు చేయడానికి, ఇది స్వాతంత్ర్యోద్యమం కాదు. దయితే బ్రిటీష్ వాడనే ప్రత్యక్ష శత్రువున్నాడు. ఇదివేరు. సాంఘిక సిద్ధాంతాలనేవి సాపేక్షాలు. సాంఘిక సిద్ధాంతం ఇచ్చిన ఆదర్శం పట్టుకొనేకన్నా, ఆలోచించడం పరిస్థితులబట్టి వస్తే మంచిది. కట్నం తీసుకోనంతమాత్రాన మగాడి అహంకారం పోతుందను కొందుకి లేదు. నేను కాబట్టి తీసుకోలేదు అనుకోవచ్చు అందువలన, బేసిక్‌గా వాళ్ళకి మనకి, పరస్పర విరుద్ధ జీవనవిధానం కాకుండా ఉండేలా చూసుకోవాలి. లేకుంటే స్వభావాల ఘర్షణలో అనుక్షణం బాధపడాలి" అని చెప్పిన నిశాంత్ మాటలకి చాలా సంతోషించింది జలజ.

"కరక్ట్... పరస్పర విరుద్ధ జీవనవిధానం' ఆమాటే నాకు రాలేదు. దానివలనే, దానివలనే... నేను చంద్రని కాదన్నాను. ఎస్. కరక్ట్. థేంక్యూ నిశాంత్! నేనేమీ తప్పుచేయలేదు. నా చదువే ముఖ్యం. ఖచ్చితంగా ఈ రోజునుండీ, ఎవరు ప్రోత్సహించకపోయినా, వ్యతిరేకించినాసరే, నా వర్క్ నేను చేసుకొంటా" అంది జలజ రిలీఫ్‌గా. ఘర్షణలు మనసులోనుండి పోవడంవలనేమో, ఆమె ముఖం చాలా తేటగా ఉంది.

"హమ్మయ్య! ఎంత సుదినం?" అంది సమీర.

"నీకు వేళాకోళంగా ఉంటుంది కానీ, నేను మేడమ్ క్యూరీ అంత మేధావిని, అంత ఆసక్తి ఉన్న దానిని అయితే వ్యతిరిక్త పరిస్థితులని పట్టించుకోకుండా నావర్క్ ఎప్పుడో చేసుకొందును. కాదు కాబట్టే ఈ బాధ"

"మేధావితనం... అవీ పక్కన పెట్టండి. మొత్తానికి మీరూ వర్క్ చెయ్యాలనే తపన చంపుకోలేకే హౌస్‌వైఫ్‌గా సెటిల్ అవలేదు. ఈరోజు పూర్తిగా ఒకనిర్ణయానికి వచ్చారుకాబట్టి గొడవలేదు. అయితే, మనం నిశాంత్‌గారికి థేంక్స్ చెప్పాలన్నమాట" అంది సమీర.

"అవును, ఒకోమనిషికి ఒకోపరిస్థితి వలన రియలైజేషన్ వస్తుంది. నాకు నిశాంత్‌గారి

మాటలవలనే వచ్చింది. బుద్ధుడికి బోధి వృక్షం కింద జ్ఞానోదయం అయినట్టుగా" అంది నవ్వుతూ జలజ.

"ఈ శుభసందర్భంలో టీ తాగుదామా?" అంది సమీర.

టీ తాగుతుండగా, "హలో!" అని పలకరించాడు ఎమ్.ఇ. చేస్తున్న శ్రీకాంత్.

"హలో! రండి" అని నిశాంత్ జలజని. సమీరని పరిచయం చేశాడు.

టీ చప్పరిస్తూ, "ఏంటండీ? ఎప్పుడు వచ్చింది డాక్టరేట్" అన్నాడు శ్రీకాంత్.

నిశాంత్‌కి పి. హెచ్. డి. డిగ్రీరాకపోయి వుండొచ్చు అనే ఊహకూడా లేదు శ్రీకాంత్‌కి.

ఆ మాటకి చివుక్కుమన్పించింది నిశాంత్‌కి.

"లేదండీ... ఎమ్. ఫిల్. కన్‌వర్షన్ పెట్టుకొని, ఎమ్. ఫిల్ చేసి పి. హెచ్. డి. మానేసాను"

"ఏంటీ? " అన్నాడు మహాఆశ్చర్యంగా.

జలజా, సమీరా కూడా ఆశ్చర్యపోతూ, "ఏంటీ మీరు..." అన్నారు ఒకేసారి.

"నాకు చేతకాదన్పించింది. అనవసరంగా కష్టపడడం. నిజానికి నాకన్నా నాయర్ నయం. చూడండి, అరగంటలో సమోసాలని డబ్బుల్లోకి అవలీలగా మార్చేశాడు. ఏదో చదివి ఉద్ధరించేస్తామనే భ్రమలో ఉంటూ, ఉద్యోగాలు ఇవ్వడంలేదని, ఇవ్వడంలో జరిగే అన్యాయాలు ఎత్తిచూపుతూ, కాలక్షేపం చేస్తున్నానని, నేను చదువు సంగతి మరచిపోవడం మంచిదనుకొన్నా" అన్నాడు నిశాంత్.

"మీరు చెప్పేది బాగానే ఉంది. కానీ నాయర్‌లా మీరూ చెయ్యగలరు. కొద్దిగా తర్ఫీదు పొందాలి. అహంకారం వదిలేయాలి. సమోసా రాకుంటే జీళ్లు అమ్ముకొంటాం. కానీ జాబ్ శాటిస్‌ఫేక్షన్ ఉండొద్దూ" అన్నాడు శ్రీకాంత్.

"సరే, రీసెర్చి చేశాము. ఏంటి ఉపయోగం? థీసిస్‌లు కుప్పలు కుప్పలుగా పడిపోవడం అంతేగా!"

"ఉపయోగం అంటారా? రీసెర్చికి, సమోసాకి అదేతేడా. వర్క్ చెయ్యడం ఒక ఎత్తు ఉపయోగించుకోవడం మరొక ఎత్తు. తర్వాత తరమైనా ఉపయోగించుకోవచ్చు. మనకి ఎన్ని తెలీవు. ఒకప్పుడు ఎందుకూ పనికిరావు అనుకొన్నవి, ఇప్పుడు అద్భుతంగా వాడుకొంటున్నాం. ఉపయోగం ఉందా లేదా అని తేల్చిచెప్పలేంకదా? "

"కానీ అంతా న్యూటన్స్, ఐన్‌స్టీన్‌లూ కారుకదా! ఎంకరేజ్‌మెంట్ ఉంటేగానీ చెయ్యలేం. రీసెర్చే కాదు. జీవనోపాధి ఇవ్వని మన గ్రాడ్యుయేషన్... అవీ... అసంతృప్తిగా ఉంది" అన్నాడు నిశాంత్.

"అది నిజమే. లైఫ్ లీడింగ్ చదువులు పెడితే బాగుణ్ను. ఎగ్రికల్చర్, సోలార్ ఎనర్జీలాంటివి మెయిన్‌టాపిక్‌లయితే బాగుణ్ను. సిలబస్ ఫ్రేమింగ్ అలాగే ఉందిలెండి. మావాళ్ళు ఒక జోక్ వేస్తుంటారు.

బైపాస్ సర్జరీ గొప్పది కదా అని భారీ పెట్టుబడులతో అందరికీ బైపాస్ చేసేస్తారట. ఫేమిలీ ప్లేనింగ్ ఆపరేషన్ మరచిపోతారట. దానికోసం ఇతర దేశాలమీద ఆధారపడతామట" అని చెప్పిన శ్రీకాంత్ మాటలకి స్పందిస్తూ,

"అది జోక్ కాదండీ వాస్తవమే" అంది జలజ.

"నిజమేనండీ ఏ ప్రొఫెసరో ఫారెన్ వెళ్తాడు. అక్కడ అద్భుతమైన సిలబస్ ఉంది. మనకి స్టేండర్డ్ లేదని అదంతా పెట్టేస్తారు. ఏ జపాన్‌కో అవసరమైన వాటిని మనచేత చదివిస్తారు. మనకవసరమయిన వాటి గురించి పట్టించుకోరు. ఏది అవసరం, ఏది ఎక్కువ మందికి కావాలి లాంటి ఆలోచన ఉంటే బాగుణ్ను. ఇప్పుడున్న కొన్ని సబ్జక్ట్స్, స్పెషల్స్‌లోకి పంపి న్యూట్రిషన్, అగ్రికల్చర్, కంప్యూ

టర్స్‌లాంటివి కంపల్‌సరీ చేస్తే బాగుణ్ణు" అన్నాడు శ్రీకాంత్.

"మీ ఆలోచన చాలా బాగుంది. కేంపాస్‌లో అవకాశంవస్తే మనమేదైనా ప్రయత్నించొచ్చు అది గగనకుసుమం. నేషనల్ లెవిల్‌లో ఒక పరీక్షపెట్టినా బాగుణ్ణు" అంది జలజ.

"దాని గురించే మేము చాలా తీవ్రంగా ప్రయత్నిస్తున్నాం. యు.జి.సికి, పి.ఎమ్.కి కూడా రిప్రజెంటేషన్స్ వెళ్లాయి. చాలా సీరియస్‌గా ప్రయత్నిస్తున్నాం. ఏమి జరుగుతుందో? దీనికి ఒప్పుకోవడం చాలా కష్టం. ఎవరి అధికారం ఎవరు వదిలేసుకొంటారు?" అని శ్రీకాంత్ వాచీ చూసుకొన్నాడు.

"నిశాంత్! వర్క్‌పూర్తి చెయ్యండి. కొత్త ఆర్థికవిధానాలవలన బేసిక్ సైన్స్‌కి విలువ పెరుగుతుంది" అన్నాడు.

"అలాగే, మీలాంటివాళ్ళని చూస్తే మళ్ళీ ఉత్సాహం వస్తుంది" అన్నాడు నిశాంత్.

"భలేవారే!" అని నవ్వి "వెళ్లొస్తాన"న్నాడు శ్రీకాంత్.



మత్స్యలింగం సివిల్స్ రిజల్ట్స్ వచ్చాయి. కానీ అతనికి రాలేదు. ఆఖరి ఛాన్స్ కూడా అయిపోయింది. రెండుసార్లు ఇంటర్వ్యూదాకా వెళ్ళి, అక్కడ పోవడంతో దుఃఖం విపరీతంగా వచ్చింది.

ఆ పరాజయాన్ని తట్టుకోలేకపోయాడు. రూమ్‌లో ఉంటే ఆ పుస్తకాలు, మెటీరియల్ అంతా కన్పించి మరికొంచెం బాధ పెడ్తున్నాయని బీచ్‌కి వెళ్లాడు.

సముద్రం... అందం ఏవీ కన్పించలేదు. ఒకటే బాధ. ఎంత మెటీరియల్ కలక్ట్ చేశాను? ఎన్ని పుస్తకాలు కొన్నాను? ఎన్ని రోజులు రాత్రి పగలు తేడా లేకుండా కష్టపడ్డాను అని పదేపదే తలచుకొని,

అక్కడా ఉండలేక సినిమాకి వెళ్ళాడు.

సినిమాకి వెళ్ళినా అతనితోపాటే, అతని మనసు, బాధ, భావం అన్నీ రావడంతో భరింపలేక కళ్ళు మూసుకొన్నాడు.

ఇంకా ఇంటర్వ్యూలు అవనట్టు, తను బాగా ప్రిపేరవుతున్నట్టు కలగన్నాడు. కలలలో ఎంతసేపు గడపగలరు? సినిమా అవగానే పక్కనున్నవాళ్ళు,

అతనికి ఏదో మేలుచేస్తున్నట్టుగా లేపారు. దానితో కలచెదరి మళ్ళీ నిస్పృహ మొదలయ్యింది.

అలాగ, పదిరోజులు దారీ తెన్నూతెలియని వాడిలాగ తిరిగి తిరిగి, తిరగడానికి కూడా విసుగు పుట్టింది.

ఆఖరికి డిపార్ట్‌మెంట్‌కి వెళ్ళి పి.హెచ్.డి. అయినా పూర్తిచెయ్యాలనుకొన్నాడు. డిపార్ట్‌మెంట్‌కి వెళ్ళడానికీ సిగ్గన్పించింది. ఎలాగో, మనసు చిక్కబెట్టుకొని వెళ్ళాడు.

అప్పారావుని, పక్కనే ఉన్న శాంభవిని కూడా విష్‌చేశాడు.

"ఏంటోయ్! బహుకాలదర్శనం. అయిందా సివిల్స్ చదువు" అన్నారు అప్పారావు.

చిన్నబుచ్చుకొన్నాడు మత్స్యలింగం.

అది చూసి, "ఏదో ఆశ. లైఫ్ సెటిల్‌మెంట్ బాగుంటుంది కదా! అని" అన్నారు శాంభవి కలగజేసుకొని.

"అది కావాలనుకొన్న వాళ్లు, ఇంట్లో

కూర్చుని చదువుకోవాలి. పి. హెచ్. డిలో దేనికి చేరాలి? వీళ్ళకి ఫెలోషిప్ ఎందుకి స్తోంది? అయినా, ఇంట్రస్ట్‌తో చెయ్యాలి గానీ, ఇలా రెండు పడవలలో కాళ్ళు వెయ్యడం నాకు నచ్చదు. అయినా నాకెం దుకులెండి... మీ స్కాలర్‌ల విషయం" అన్నారు అప్పారావు.

ఆ మాటకి వింతగా "అదేంటీ? " అన్నారు శాంభవి.

"మీరు, అతనిని బాగా అర్థంచేసుకోగ లరు. మీరే, అతనిని స్కాలర్‌గా తీసుకొని వర్క్ చేయించండి. సైన్ చేసేస్తాను మారి పోవోయ్!" అన్నారు అప్పారావు తేలికగా.

ఆ మాటలకి చాలా పౌరుషంగా,

"అలాగే... అతనికీ, మీకూ అభ్యంతరం లేకపోతే నేనే చేయిస్తాను" అన్నారు శాంభవి.

మత్స్యలింగం గుండెల్లో రాయిపడింది. బంతిలాగ ఒక తాపుతన్నాడు. ఈవిడదగ్గర పడ్డాను. ఈమె మంచిదేగానీ... నాటాపిక్ ఆమెకి నచ్చదు. మళ్ళీ టాపిక్ మారిస్తే, మొదటంతా తను కలక్ట్‌చేసిన మెటీరియల్ అంతా వేస్ట్ అయిపోతుంది. అమ్మో! మళ్ళీ మొదలంటే...? తను ఎంతదురదృష్టవం తుడో?

ఈ అప్పారావుని అప్పుడే ఏదో మంచిచే సుకొంటే పోయేదేమో! అనుకొన్నాడు.

సరే... కానున్నది కాకమానదు కదా! చూద్దాం. ఏం జరుగుతుందో? వస్తుందను కొన్న సివిల్స్ రాలేదు. ఇవన్నీ లెక్క ఏంటి? అనుకొంటూ అతినిరాశగా రూమ్‌కి చేరుకొన్నాడు.

రూమ్‌లో తన పేరు మీదున్న కవరు విప్పి, చదివి, ఆశ్చర్యపోయాడు.

తను ఎప్పుడో ఇంటర్వ్యూకి వెళ్ళి మరచి పోయిన ఎమ్. ఆర్. వో ఉద్యోగానికి పోస్టింగ్ ఆర్డర్స్.

అవి మరోసారి చదివి.

"నాకింక రీసెర్చి గోలలేదోచ్!" అని రూమ్మేట్‌ని గిరగిరా తిప్పాడు.

★ ★ ★

"గుడ్‌మార్నింగ్ సర్" అంది జలజ.

"మార్నింగ్. మీరా! వర్క్ అయ్యాక కన బడడమే మానేసారు" అన్నారు ప్రొ. సూర్యం.

"ఎక్కడ అయింది నావర్క్. నా రిపోర్ట్ రాలేదుగా! ఈరోజు ఫోన్ చేస్తారేమోనని వచ్చాను"

"ఆ, చేద్దాంలే"

"మళ్ళీ దొరకరేమో... ఇప్పుడే చేస్తే"

"బయటకి వెళ్ళి చెయ్యాలి" అన్నారు సూర్యం.

"ఖాళీ లేదాసర్, మీకు"

"లేదన్నా వినేటట్టులేవుగా"

"అదేంటిసర్! అలా అంటారు. ఎన్నిసార్లు వెళ్ళిపోలేదు నేను. కుదరదంటే వెళ్ళిపో తాను" అంది జలజ వస్తున్న కోపాన్ని లోలోపల మింగేసి.

"సర్లెండి, వెళ్దాం పదండి" అన్నారు సాలో చనగా.

స్కూటర్ తాళాలు తీస్తే భయమేసింది జలజకి. స్కూటర్ ఎక్కమంటాడేమోనని.

వెంటనే గబగబా తన లూనా తీసింది.

"పెట్రోలుపోయించాలండీ. లూనామీద వస్తాన"ంది.

"నన్నూ తీసుకువెళ్తారా? లూనామీద" అన్నారు సూర్యం నెమ్మదిగా.

లోపల మండిపోతూనే పైకి నవ్వుతూ,

"కష్టంసార్. లాగదు" అని లూనా స్టార్ట్ చేసింది.

పబ్లిక్ టెలిఫోన్ దగ్గర ఆగారు. పట్టప గలు హైదరాబాద్ మాట్లాడితే ఎంతవుతుందో జలజకి బాగా తెలుసు. అప్పటికే మూడుసార్లు చేసారు.

డయల్‌చేసి రింగ్ అవగానే మాస్టారికి ఇచ్చింది.

"హలో! నేను, ప్రొఫెసర్ సూర్యం"

"... ... ..."

"బాగున్నారా? "

"... ... ..."

"ఏంటీ ఈమధ్య ఇక్కడకి రావడంలేదు"

"... ... ..."

"పిల్లలకి ఎమ్. సెట్ అంటే పెద్దలకి జైలే. ఎక్కడకీ కదలడం అవదు. తప్పదుగా!"

"... ... ..."

"ఏవిటీ? బిల్ పంపలేదా? "

"... ... ..."

"ఏ బిల్ ఇంతకీ? "

"... ... ..."

"ఊహూ!"

"... ... ..."

"అదా!"

"... ... ..."

"ఏప్రిల్‌లో వైవాకి వచ్చిందా? "

"... ... ..."

"దాని టి.ఏ., డి.ఏ. పంపకపోవడమేమిటి? పంపేవుంటారే!"

"... ... ..."

"లేదా? "

"... ... ..."

"సారీ, మీ యూనివర్శిటీ ఇంతఘోరంగా ఉండదేమో కదూ!"

"... ... ..."

"అహహ..."

"... ... ..."

"అక్కడా అంతేనా!"

"... ... ..."

"తప్పకుండా దగ్గరుండి పంపిస్తా"

... ... ...

"ఆ! సెమినార్ బాగానే అయ్యింది"

... ... ...

"మనం విమర్శించినా, ప్రశ్నించినా తట్టుకోలేరు"

... ... ...

"అవునవును... ఆవిడ గుర్తుందా? "

... ... ...

పక్కన నిల్చుని వింటున్న జలజకి వాళ్ళు ఎక్కడకో వెళ్ళిపోతున్నారనిపించింది. మరో రెండు నిముషాల తర్వాత కంప్యూటర్‌వైపు చూసిన జలజకి బిల్లు ఇవ్వవలసింది తనే నని గుర్తొచ్చి, అది ఆపడానికి శతవిధాల రాని దగ్గు తెచ్చుకొంది.

ఆ దగ్గుకి పక్కకి తిరిగారు సూర్యం.

"ఆ, ఇంతకీ, విషయమేమిటంటే... మా స్కాలర్ రిపోర్ట్ రాలేదు"

... ... ...

"జలజ... అనీ"

... ... ...

"ఆ, అవలేదా? "

... ... ...

"చాలా డిసర్టేషన్స్ వచ్చాయా? "

... ... ...

"కష్టమే"

... ... ...

"వాళ్ళకేం తెలుసు. ఏదో మనం అశ్రద్ధతో వదిలేసామనుకొంటారు."

... ... ...

"సరే... కొందరిలా రైలు ప్రయాణంలోనే చూసేసి అయిందనిపిస్తే, మనలాంటివాళ్లం పంపలేముకదా!"

... ... ...

"ఎప్పుడొచ్చిందీ గుర్తులేదా? "

... ... ...

"ఆ, క్లర్క్‌ని అడుగుతారా? "

... ... ...

"రేపా, అలాగే"

... ... ...

"మళ్ళీ చేస్తాలెండి"

"ఇంతకీ వర్క్‌షాప్‌కి మమ్మల్ని పిలుస్తారా? "

... ... ...

"ఇంకా ఏమీ అనుకోలేదా? "

... ... ...

"అవునులే, పంపుతారు. మీరేగదా!"

... ... ...

"కాస్త ముందు తెలిస్తే... మావాళ్ళు ఏదో టూర్ ప్రోగ్రామ్ పెట్టారు. అలా వెళ్ళిపోవ చ్చుకదా!"

... ... ...

"ఏం ఫరవాలేదు"

... ... ...

"సరే, ఉంటాను"

... ... ...

"ఆ, రేపు కలుద్దాం"

... ... ...

"ఫోన్లోనే! అహహ..."

... ... ...

"ఊహూ"

... ... ...

"సరే... రెండు లోపలే చేస్తాను, ఉంటాను" అని ఫోను పెట్టేసరికి చకచకా బిల్ వచ్చి, జలజ చేతిలో పడింది.

ఆయన, బిల్ ఎంతయిందో కూడా పట్టిం చుకోకుండా,

"విన్నారుగా, రేపు చేద్దాం" అని చక్కా వెళ్ళిపోయారు.

★ ★ ★

"హాయ్! బాగున్నారా?" అన్నాడు నిశాంత్.

"థీసిస్ బైండింగ్ అయిన దగ్గరనుండీ మీకోసమే చూస్తున్నా. కనబడలేదు" అంది జలజ.

"సబ్మిట్ చేసారా?"

"ఊ..."

"కంగ్రాట్యులేషన్స్"

"థేంక్యూ... ఎకనాలడ్జ్‌మెంట్‌లో మా గురువర్యుల తర్వాత మీకే థేంక్స్ చెప్పాను. అది చూపిద్దామని..."

"నాకెందుకండీ మధ్యలో"

"మేథమెటికల్ పార్ట్ అంతా మీవలనే అయ్యింది. మీరులేకుంటే... ఇప్పటికీ అవదు"

"దానికి ఏముందండీ. మీరు చాలా అమాయకులు. ఆర్కియాలజీ స్కాలర్‌కి నేనే పూర్తిగా చేశాను. అందులో 50% మేథమెటికల్ పార్టే. థేంక్స్ నోటితో కూడా చెప్పలేదు. ప్రస్తుతం నేను పరిచయంలేన ట్టుగా ఉంటాడు. కాబట్టి నేనే మీకు థేంక్స్ చెప్పాలి, మీరు నన్ను గుర్తుంచుకొన్నం దుకు. సరేగానీ, ఈమధ్య సమీరగార్ని కలి సారా?" అని అడిగాడు.

"లేదు... నా హడావుడిలో నేనున్నా. ప్రస్తుతం వైవాకి డబ్బులు కూడబెడుతున్నా"

"దానికి ఎక్కువ ఖర్చు ఉండదనుకొంటా!"

"అయ్యో! ఖర్చులేకేమి? అధమం, ఏ మేఘాలయాలోనో రూమ్ బుక్ చేయాలి. ముందురోజు డిన్నర్ ఇవ్వాలి. అదోసంప్ర దాయం. వచ్చిన వాళ్ళతోపాటూ, మనవా ళ్ళకి కలిపి మర్యాదలు. ఇవన్నీ ఎలా అవు తాయి. పనికిమాలినవన్నీ మా డిపార్ట్‌మెం ట్‌లోనే! కాదులెండి, చాలా డిపార్ట్‌మెంట్స్ ఇలాగే ఏడిసాయి"

"వినయ్ అని ఫిజిక్స్ స్కాలర్. అతని వైవా ఈమధ్యే అయింది. ఏ ఖర్చూలే కుండా, వాళ్ళ గైడ్ బాగా ఏర్పాటుచేశారు. మన యూనివర్శిటీ ఏదో సెమినార్ ఏర్పా టుచేసింది. దానికోసం వచ్చిన ప్రొఫెసర్స్‌నే ఎక్స్‌టర్నల్‌గా పెట్టి వైవాచేశారు" అని చెప్పాడు నిశాంత్.

"సరే, గైడ్ అనుకొంటే ఎందుకవదు? ఇంతకీ వినయ్‌గారి గైడ్ ఎవరు?"

"లక్ష్మీనారాయణగారు!"

"ఆయనా! రియల్ సైంటిస్ట్. అంకితభా వంతో పనిచేస్తారుటగదా!"

"వినయ్ కూడా జీనియస్"

"ఇప్పుడేం చేస్తున్నారు, వినయ్‌గారు"

"కొన్నాళ్లు పార్ట్‌టైమ్ లెక్చరర్‌గా చేసి చాలా బాధపడ్డాడు. మొన్నీమధ్యే ఆర్.ఏ. వచ్చింది. అతనికి ఇంట్రస్ట్ అయిన వర్క్

చేసుకొంటున్నాడు."

"సైన్స్‌లో అయితే ఈ ఆర్.ఏ. ఫరవాలే దేమోగానీ, ఆర్ట్స్‌లో కొన్ని డిపార్ట్‌మెంట్స్‌లో అయిదేళ్ళు ఆర్.ఏ. ఫెలోషిప్ అనుభవించి, అది అయ్యాక పుట్టలోంచి బయటకివచ్చేస రికి లెక్చరర్ పోస్ట్ ఎలిజిబిలిటీ కూడా అయి పోయి, ఆ పేటరన్ వేరయిపోయి, ఏవి చెయ్యాలో తెలియక నిరుద్యోగిగా వుండా లంటే ఎంతకష్టం" అన్నది జలజ.

అప్పుడే తనకోసం వస్తున్న మాస్టార్ని చూశాడు నిశాంత్.

"మా మాస్టారు లోకేష్‌గారు వస్తున్నారు. ఆయన దగ్గరే వర్క్ చేస్తున్నా. ఆయన స్పీడ్, హార్డ్‌వర్క్ చూసి మొదట షివరింగ్ వచ్చిందనుకో. పది సంవత్సరాలు అమెరి కాలో వర్క్‌చేసి వచ్చారు. చాలా మంచిమ నిషి. ఆయన్ని ఒకరోజు చూడకపోయినా బెంగగా ఉంటుంది. రీసెర్చి గైడ్ మాత్రమే కాదు. నాలైఫ్ గైడ్ అనుకోవచ్చు మన సమస్యలు మనవైపునుండీ చాలా ఆర్ద్రతతో ఆలోచిస్తారనిపిస్తుంది" అని చెప్పాడు నిశాంత్.

దగ్గరగా వచ్చి పలకరించారు లోకేష్.

"ఈవిడ డాక్టర్ జలజ" అని పరిచయం చేశాడు.

"ఇంకా డాక్టర్‌ని అవలేదు. సబ్మిట్ చేసా నంతే. వాళ్ళు ఇవ్వాలికదా!" అంది జలజ.

"ఇవ్వడమేమిటి?" అన్నారు లోకేష్.

"ఇక్కడంతా వేరులెండి. పాలిటిక్స్ మీకేమి తెలియదు. అన్నీ సమస్యలే. అక్కడ చాలా బాగుంటుంది కదండీ!"

"అక్కడంటే? ... అమెరికాలోనా? ... ఎక్కడైనా మనుష్యులే కదా! సమస్యలనేవి ఎక్కడైనా వుంటాయి. మన బిహేవియర్‌ని బట్టీ సొల్యూషన్ దొరుకుతుంది"

"అక్కడ రీసెర్చి ప్రశాంతంగా అవుతుంది గదండీ! గైడ్‌తో ప్రాబ్లమ్స్ అవీవుండవను కొంటా!" అంది జలజ.

"సోర్సెస్, ఎక్విప్‌మెంట్ ఎక్కువగానీ, టెన్షన్ ఎక్కడైనా తప్పదు. అక్కడ మరీ టెన్షన్ ఎక్కువ. పట్టుకోవాలి. ఇక్కడ, గైడ్‌ని విలన్‌లాగ చూస్తున్నారనిపిస్తోంది. నిజానికి గైడ్ సమస్యలు గైడ్‌కీ వుంటాయి. తనకేదో అస్పష్టమైన ఆలోచన వస్తుంది. ఆ ఆలోచన చెప్పడం కష్టం. అసలు ఒక ఆలో చన ఏథీరీగానో, ప్రొడ్యూస్ చెయ్యడం ఎంత కష్టం. ప్రసవవేదన పొందాలి. అలాంట పుడు ఎంత చిరాకుగా ఉంటుంది. ఆ ఆలో చన స్కాలర్ అందుకోడు. ఒకోసారి, ఈ సిల్లీవిషయం గొప్పగా చెప్తున్నాడనుకొని గైడ్‌ని చాలా చిన్నచూపు చూస్తాడు స్కాలర్ కూడా! దాంతో ఇద్దరిమధ్యా గేప్ వస్తుంది. థాట్ కోహరెన్స్ కుదరదు. అలాంటపుడు అర్థంచేసుకోని స్కాలర్‌మీద చాలాకోపమొస్తుంది. కోపబడితే చిన్నపి ల్లల్ని తిడుతున్నట్టు తిడుతున్నారనుకొం టారు. వాళ్ళలో రీసెర్చి ఎబిలిటీ పెరగడా నికి మేమే కారణం. అయినా ఒకమాట అన కూడదు.

నిజానికి ఇద్దరికీ ఫిట్ అయితే ఇవి ప్రాబ్లమ్స్ కావు. థాట్ ఫాలోఅప్ ఉన్న ప్పుడు మిగిలినవేవీ వాళ్ళూ పట్టించుకోరు. అది తగ్గినపుడు అన్నీ సమస్యలే" అన్నారు లోకేష్.

"పూర్తిగా స్కాలర్‌దే తప్పు. అణగిమణగీ ఉండాలంటారు. అంతేగా!" అంది జలజ.

"వర్క్‌కావలసినది స్కాలర్‌కే గదా!"

"నిజమే... వర్క్ అవడం లేదు. థాట్ కొహరెన్స్ లేదు. ఇద్దరికీ కుదరడంలేదు. నేను మారిపోతానన్నప్పుడు, గైడెన్స్ అక్కర లేదన్నప్పుడు వదిలేయాలి కదా!" అంది జలజ ఆవేశంగా.

"అప్పుడు గైడ్‌కీ ఇగో ఉంటుంది. అదీ గాక కొద్దిరోజులకి అలవాటవుతుంది. కొత్తలో చాలా కష్టపడాలి. తొందరపడి వెళ్ళిపోతున్నాడనిపిస్తుంది. ఇంత వర్క్‌చేసిన నేను ఇతనికి పనికిరానా? అన్పిస్తుంది"



"మరి దానివలన స్కాలర్ ఎంత సఫర్ అవుతాడు? "

"అందుకే గైడ్‌ని ఎన్నుకొనేటపుడే ఆలోచించుకోవాలి. ఎక్కడ ఆలోచన లోపిస్తే అక్కడ ఫెయిలవక తప్పదు"

"ఎక్కడో ఒక ఆలోచన లోపిస్తే ఇక జీవితమంతా బాధపడాలా? మన రీసెర్చిలో ఎన్ని రిజల్ట్స్ తప్పు అవవు? అంతమాత్రాన"

"అసలు అంతంత చదువుకొని సబ్జక్ట్‌లో ఉద్దండులన్పించుకొని ఎందుకండీ ఇలా ప్రవర్తిస్తారు" అన్నది జలజ బాధగా.

"మీరు ఒకటి గుర్తుంచుకోవాలి. వాళ్ళు సబ్జక్ట్‌లో గొప్పవాళ్ళే కావచ్చు. కానీ, అన్ని విషయాలలో కావాలని లేదుగా. అందుకే జ్ఞానం పొందడం అనేది ఒక స్థితికాదు. అదొక ప్రోసెస్ అంటే ప్రతిక్షణం జ్ఞానం పొందుతూ, జ్ఞానవంతంగా వుండాలి. ఒక ప్రొఫెసర్ ఒక అమ్మాయిని రేప్ చేసాడనుకోండి. దాని అర్థం ఏంటి? అతను సబ్జక్ట్‌లో జ్ఞానం పొందాడు. కానీ, మానవవిలువలలో, మానవత్వంలో అజ్ఞానుడు. అంతే కదా!"

"ఈ అజ్ఞానం వలన నష్టంలేదా? ఎందుకు అలాంటి వాళ్ళు కేంపాస్‌లో వుండాలి? "

"మంచితనానికి, క్యారక్టర్‌కి కొలమానం అంత ఖచ్చితంగా ప్రస్తుతం లేదుగా. వాళ్ళు సబ్జక్ట్ స్ట్రెస్ వలన మానవవిలువలు,

సంస్కృతి గురించి ఆలోచించలేకపోవచ్చు ఆలోచించకపోవడం వాళ్ళ తప్పే, కాద నను.

"ఎన్ని చెప్పండి. తను వర్క్ చెయ్యడం వేరు. ఎదుటి వాళ్లచేత చేయించడం వేరు. వాళ్ళ బుర్రలోకి ఎక్కించడమనేది చాలా కష్టం. తనకంటూ ఒక సబ్జెక్ట్ హోమ్‌ఫీల్డ్ ఏర్పడేవరకూ స్కాలర్‌కి అన్నీ టెన్షన్స్. తన కంటూ ఒక ఫీల్డ్‌వుంటే, ఎప్పుడు కావా లంటే అప్పుడు అందులో లేండ్ అవుతాడు. ఎవరు, ఎలా మాట్లాడినా ధైర్యంగానే ఉంటుంది. అంతవరకూ ప్రతీదీ హింసలాగే ఉంటుంది. నా స్టూడెంట్ అనేభావన వస్తే, మీ హోమ్‌ఫీల్డ్ సమకూర్చుకోవడంలో మన స్ఫూర్తిగా హెల్ప్ చేస్తారు. ఒక ఫీల్డ్‌లో మీరు గ్రిప్ సంపాదించేటట్టు చెయ్యడం నిజంగా చాలా కష్టం. ఈ పని చెయ్యడం కోసం, వాళ్ళు ఎన్ని వదులుకోవాలి. భార్యా బిడ్డలతో కాలక్షేపం కుదరదు. ఒకోరోజు ఇది యేదో అయితే వెళ్ళిపోతాడనుకొంటే... అది అవదు. కదలడు. అలాంటపుడు చిరా కువస్తుందా, రాదా? "

"మనం ఎందుకు చిరాకుపడుతున్నామనే స్పృహ అప్పుడు వుండదు. ఇప్పుడు వేరే ఎనలైజ్ చేస్తున్నాము కాబట్టి ఈ కారణాలు కన్పిస్తున్నాయి."

"గైడ్‌కి క్లాస్ వర్క్, ఎగ్జామ్‌వర్క్ ఉంటుంది కదా! ఎన్ని డిసర్టేషన్స్ చద వాలి. ఎన్ని సెమినార్స్‌కి వెళ్లాలి. మాకెంత వర్క్‌ప్రెషర్ ఉంటుంది. ఇవన్నీ మీరు కౌంట్ చేస్తారా? " అని అడిగారు లోకేష్.

"ఎంతమంది చేస్తున్నారు పెర్‌ఫెక్ట్‌గా! మీలాంటివారు తిట్టినా, కొట్టినా కూడా ఎవ్వరూ ఏమీ అనరు. తర్వాత ఎంత ఫ్రెండ్లీగా ఉంటారు. మీలాంటివాళ్ళ దగ్గర స్కాలర్ కూడా ఫ్రీగానే ఉంటాడు. ఏమీ రానివాళ్ళకే ఇక్కడుద్యోగాలు ఇస్తున్నారు. ఎంత మెరిట్ చూపించినా, ఇక్కడుద్యోగం ఇవ్వరు" అంది నిరాశగా జలజ.

"మరీ అలా అనకండి. అన్యాయాలు జరుగుతున్నాయి. కాదనను. కానీ అస్సలు మెరిట్ చూడరని నిరాశపడకూడదు. నాకు కేవలం ఇక్కడ పోస్ట్ మెరిట్‌మీదే వచ్చింది. నేను ఇక్కడ పి.హెచ్.డి. చెయ్యలేదు. నాకు ఎవ్వరూ తెలీదు. ఎలావచ్చిందం టారు? "

"అరో కొరో మంచి పన్లు చేస్తుంటారు మా వాళ్లు. కానీ, ఒకటి మాస్టారూ! మీరు రీడర్‌గా జాయిన్ అయిన దగ్గరనుండీ రీసె ర్చివర్క్ చేస్తూనేవున్నారు. మీకు అందరిలా జీతం వస్తుంది. అంతేకదా! అదే, ఈ రీడర్ బేనర్ వేల్యూతో ఎమ్‌సెట్ చెప్పిన వాళ్ళకి లక్షలు వస్తాయి. నిజానికి, మీరు చేసేది దానికన్నా ఉన్నతమైనది, విలువైనది. అయినా మీ కష్టానికి గుర్తింపు వుండదు"

"అవున్లెండి. కష్టానికి గుర్తింపు వుంటే, ప్రత్యేకంగా బాగుంటుంది. ఉద్యోగాలివ్వ డంలో కూడా జాగ్రత్తపడాలి. ఆల్ ఇండియా లెవిల్‌లో ఏదో ఎగ్జామ్ పడుతుందిటకదా! మంచివాళ్ళకి అవకాశం వస్తుంది. ఈ స్థానిక కులరాజకీయాలు తగ్గుతాయి. అప్పుడు మీకు తప్పక పోస్ట్ వస్తుంది. గుడ్ లక్" అన్నారు లోకేష్.

"థేంక్యూ సర్. చాలా బాగా వుంది మీతో డిస్కషన్"

"నాదో చిన్న సలహా. మనము ఏపని ప్రేమగా చెయ్యగలమో, ఏ పని చేస్తే ఆనం దమొస్తుందో ఆ పని చెయ్యడమే మంచిది. పరిశోధనలో ఆసక్తివుంటే మనఃస్ఫూర్తిగా చెయ్యండి. డబ్బులొస్తున్నాయా, తగిన గుర్తింపు వుందా లేదా? అని ఆలోచించ కండి" అన్నారు లోకేష్.

ఆ సలహాకి సంతోషించిన జలజ,

"నిశాంత్! ఆలశ్యమయితే అయిందిగానీ, నిజమైన మంచి గురువు దొరికారు" అంది.

"నిశాంత్‌గారూ! టైమ్ అయింది

వెళ్దామా? " అన్నారు లోకేష్.

"మాస్టారూ! నిజంగా నిశాంత్‌గారి ముఖంలో దిగులు పోగొట్టి హుషారు తెప్పించారు. రియల్లీ యు ఆర్ గ్రేట్" అని జలజ డైరెక్ట్‌గా పొగిడేస్తుంటే, పొగడ్తలంటే ఇష్టపడని లోకేష్‌గారు ఇబ్బందిగా ముఖం పెట్టి, విననట్టుగా ముందుకి వెళ్ళిపోయారు.

★ ★ ★

మూడు సంవత్సరాల తర్వాత విశాఖ వచ్చింది జలజ.

సమీరకి ఫోన్ చేసి కేంటిన్ దగ్గరకి రమ్మనమంది. నిశాంత్, రాజు కూడా వచ్చారు.

సమీరని చూస్తూనే,

"హాయ్! బాగున్నావా? " అని జలజ ఆనందంపట్టలేక దగ్గరగా తీసుకొంది సమీరని.

వెంటనే సమీర "బాబోయ్! వదిలేయండి. కేంపాస్‌వాళ్ళు చూస్తారేమోనని భయంగా వుంది"

"అన్యాయం" అంది జలజ.

"మా జాతిమొహాలు ఇప్పుడు ఎలా వున్నాయి? " అని అడిగాడు నిశాంత్.

"మీకేమి? మనలో మనమాట. మాస్టారూ! మీరు జాతిభేదం పొందారు. మీ దగ్గరుండే స్కాలర్స్ మొహాలు ఎలా వున్నాయి? అని అడగండి" అంది సమీర.

"మా దగ్గర స్కాలర్స్ హుషారుగానే ఉంటారు. ఎందుకంటే నేను బెస్ట్ గైడ్ దగ్గర వర్క్‌చేసాను. ఎంత నేను చెడ్డవాడినయినా ఆ ప్రభావం ఉంటుంది కదా!" అన్నాడు నిశాంత్.

"నిజమే, వాళ్ళ మాస్టారు చాలా మంచివాళ్ళు మంచేకాదు. ఏదో చెయ్యాలి అనే తపన కలగజేస్తారు. నిజంగా ఆయన మాటలవలనే నేను ఇంత హేపీగా ఉన్నాను. రెండుమూడుసార్లు కలిసేం. ఆయన మాటలవలనే నేనుఆనందంగా ఇలా ఉన్నాను" అని చెప్పిన జలజ,

"మీ మాస్టారిని తీసుకురావలసింది నిశాంత్!" అంది.

"మాస్టారు కెనడా వెళ్ళారు. లేకుంటే పిల్చేవాడిని సమీరగారూ! మరీ అనుమానించకండి మమ్మల్ని" అన్నాడు.

"ఊరికే అన్నాను... ప్రస్తుతం నేనూ స్కాలర్‌నే"

"మీ ముఖంలో జాతిలక్షణాలు కనబడటంలేదు" అన్నాడు రాజు.

"ఇంతకీ, మనవాళ్ళంతా ఎవరేం చేస్తున్నారో? " అంది జలజ.

"వినయ్ తెలుసు కదా! అతను, మా ఫ్రెండ్ సుమబాల ఫారెన్‌లో సెటిల్ అయ్యారు. ఇద్దరిదీ ఒకే యూనివర్శిటీ"

"ఆహా! తేజా విషయం తెలుసా? సమీరా!"

"తేజ గుడ్ హవుస్‌వైఫ్ అయ్యారు. కృష్ణగారు రెసిడెన్షియల్ కాలేజీలో సెటిల్ అయ్యారు. మాధురికి గ్రూప్ వన్ ఆఫీసర్ పోస్ట్ అయింది. వాళ్లాయనకిమాత్రం ఇంకా జాబ్ రాలేదు" అంది సమీర.

"జోగారావు వ్యవసాయంలోకి, విజయ్ కాంట్రాక్ట్స్‌లోకి దిగిపోయారు" అని చెప్పాడు రాజు.

"మన శ్రీధర్ ఆటోమొబైల్ కంపెనీ పెట్టాడు. ఆ హడావుడిలోనే ఉన్నాడు. మనం ప్రతి సంవత్సరం ఒక్కసారైనా కలవాలి" అన్నాడు నిశాంత్.

"తప్పకుండా. కలిస్తే మనమేం చెయ్యాలనుకొన్నామో, ఒకసారి గుర్తుచేసుకుంటాం." అన్నారు రాజు, జలజ.

ఈసారి ఎక్కువటైమ్ లేదంటూనే, మరో రెండు గంటలు ఆయా యూనివర్శిటీస్, అక్కడ జరిగే వర్క్, ఎలా వుంటే బాగుంటుంది... ఇలా మాట్లాడుకొన్నారు.

"మళ్ళీ కలుద్దాం. ట్రైన్ టైమయిందన్న" జలజని రైలు ఎక్కించి వీడ్కోలు చెప్పారు.

★

# చతుర ప్రపంచం

## పిరమిడ్ పవర్

విజ్ఞాన శాస్త్రపరిచయం కలగకముందే ఈజిప్టులో పిరమిడ్స్ నిర్మించబడ్డాయి. వాటిని చూస్తే వాటి నిర్మాతలు ఎంత ఆరి తేరిన శిల్పులో అర్థమవుతుంది.

ఈజిప్టులోని పిరమిడ్లు ఇప్పటికీ శాస్త్రవేత్త లకు, చరిత్రకారులకు ఓ ఆశ్చర్యకరమైన విషయంగా వుండిపోయింది. అసలు ఈ గానీ కనుపించదు. ఇలా సంవత్సరాల తర బడి మృతదేహాలు తాజాగా వుండటానికి గల కారణం ఆయా శవాలపై పూయబడిన రసాయనిక పదార్థమా? లేక ఓ ప్రత్యేక నమూనాలో పిరమిడ్లు నిర్మించి అందులో శవాలను భద్రపరచడంవల్లనా? అన్నవి ఇప్పటికీ ప్రశ్నలుగానే వున్నాయి.

అయినా శాస్త్రవేత్తలూ, చరిత్రకారులూ ఇప్పటికీ వీటిపై పరిశోధనలు చేస్తూనే




పిరమిడ్లు పురాతన ఈజిప్టు రాజుల, రాణుల భౌతిక కాయాలను భద్రపరిచే నిర్మాణాలుగా ఎందుకు మలచబడ్డాయి? మిగతా కట్టడాలులాకాక ఇవి ఓ ప్రత్యేక నమూనాతో ఎందుకు నిర్మించబడ్డాయి? అన్నవి నేటికీ ప్రశ్నలుగానే మిగిలిపో యాయి.

శతాబ్దాల తరువాత కూడా ఈ పిర మిడ్స్‌లో భద్రపరచబడిన అస్థిపంజరాలు ఇప్పటికీ తాజాగా వున్నాయి. దుర్వాసన గానీ, అక్కడి వాతావరణంలో కాలుష్యం వున్నారు. ఈ పరిశోధనలలో ముందుగా కుక్కలని వుంచడానికి చతురస్రాకా రంలోను, దీర్ఘచతురస్రాకారంలోను, పిర మిడ్స్ ఆకారంలోనూ కట్టడాలను నిర్మిం చారు. అందులో వున్న కుక్కలను తరవాత పరిశీలిస్తే పిరమిడ్స్ ఆకారంలో వున్న నిర్మాణాల్లోని కుక్కలు మిగిలిన కుక్కల కంటే ఆరోగ్యవంతంగా వున్నాయి.

అలాగే ఛీజ్‌ని తీసుకుని చతురం, దీర్ఘ చతురం, గుండ్రని, పిరమిడ్ ఆకార నిర్మా ణాల్లో వుంచి అటుపైన పరిశీలిస్తే పిరమిడ్ ఆకార నిర్మాణంలోని ఛీజ్ మిగతావాటిలో వుంచిన దానికన్న తాజాగా, పరిశుభ్రంగా వున్నట్టు తేలింది. అంటే మిగతావాటికంటే

మరికొంతకాలం నిలవుండేలా కనిపించింది. దాంతో శాస్త్రవేత్తలు ఓ నిర్ణయానికొచ్చారు. అదేమిటంటే పిరమిడ్ ఆకారనిర్మాణంలోనే మానవులకి, జంతువులకి, చెట్టు చేమలకి ప్రయోజనాన్నిచ్చే సౌకర్యం వుండివుండాలని. దీన్ని సాంకేతికంగా 'పిరమిడ్ పవర్' అన్నారు.

ఈ శక్తిని తెలుసుకున్న ఈజిప్టు ఆచార్యులు వాళ్ళ విలువైన వస్తువుల నన్నిటినీ పిరమిడ్స్‌లో భద్రపరిచారు. వాటిని తమ తరువాతి తరం వారు కూడా ఉపయోగించుకోవాలన్నది వారి ఆకాంక్ష.

ఈ పిరమిడ్ నాగరికత ఈజిప్టునుంచి ఆఫ్రికా అడవులకు కూడా పాకింది. వాళ్ళు తమతమ నివాస గృహాలను పిరమిడ్ ఆకారంలో నిర్మించుకున్నారు. దానివల్ల వాళ్ళ ఆరోగ్యాలు బావుండి ఎక్కువకాలం బతకగలమని నమ్మారు. అలాంటి పిరమిడ్ గృహాలు అమెరికాలోని రెడ్ ఇండియన్ కమ్యూనిటీలో కూడా కనిపిస్తాయి.

పురాతన చైనా కట్టడాల్లో కొన్ని ఆసుపత్రులు, ఆరోగ్యకేంద్రాలు కూడా పిరమిడ్ ఆకారంలో నిర్మించబడి వున్నాయి. అంటే పూర్వపు చైనా శాస్త్రకారులు కూడా ఈ విషయాన్ని ఎరిగివున్నట్టు తెలుస్తోంది.

ఈజిప్టులోని కొన్ని దుకాణాల్లో పిరమిడ్ ఆకారపు టోపీ అమ్మేవారు. అవి పెట్టుకోగానే తల నెప్పి మటుమాయమవుతుందనే వారు అక్కడి ప్రజలు.

ఈ పిరమిడ్స్‌కి సంబంధించిన మరో విచిత్రాన్ని కూడా కనుగొన్నారు ప్రజలు. ఎప్పుడైనా ఓ పిల్లిగానీ, కుక్కగానీ ఈ పిరమిడ్లవైపు వెళ్ళి అక్కడ చనిపోతే దాని శరీరం ఎండిపోతుందిగానీ, కుళ్ళడం, దుర్గంధం రావడం జరగదు. అది చూస్తే దీని వెనకనున్న అసలైన శాస్త్రీయకారణాన్ని పూర్తిగా తెలుసుకోవలసివుంది అనిపిస్తుంది.

---

## అగ్గిపుల్లల సైనికుడు

కొన్ని వందల సంవత్సరాలకు పూర్వం ఇంగ్లాండుకు చెందిన బేరన్స్, డ్యూక్స్ పెద్ద పెద్ద భవనాల్లో నివశించేవారు. ఆ భవనాల్ని సాయుధులైన సైనికులు కాపలాకాసేవారు.

ఇంగ్లాండులోని కేంబ్రిడ్జ్‌కి చెందిన 25 ఏళ్ల మోరిస్ జెఫ్రిజ్ అనే వ్యక్తి అలాంటి భవంతుల్లో నివశించలేదుగానీ, అతని ఇంటిముందు ఆరడుగుల ఎత్తున్న పురాతన సాయుధ సైనికుడి విగ్రహం మాత్రం దర్శనమిస్తుంది. నిజానికి ఆ విగ్రహం అలా నిలబడి అహర్నిశలూ కాపుకాయాల్సిన నిధి అతడింట్లో ఏంలేదుగానీ ఆ విగ్రహం దానికదే ఓ గొప్ప విలువైన శిల్పం అన్నది చాలామందికి తెలియదు.

అది అగ్గిపుల్లలతో తయారు చేయబడిన సైనికుడి బొమ్మ. దీనికి 60 వేల అగ్గిపుల్లలను వాడాడు మోరిస్. 80 ట్యూబులను ఈ బొమ్మను నిలబెట్టడానికి ఉపయోగించాడు.

"ఈ బొమ్మ తయారు చేయడం వెనక ఉద్దేశం ఏమిటి?" అని అడగ్గా అతడు చెప్పిందేమంటే, "నాకు ఎప్పటికప్పుడు కొత్తరకం వస్తువులను తయారు చేయడం ఇష్టం. అంతేగాక పురాతన డ్యూక్ భవనాలను సాయుధ సైనికులు కాపలాకాసినట్లు, నా ఇంటిని ఓ బొమ్మ సైనికుడయినా కాపలాకాయాలనేది నా కోరిక. అందుకే దీనిని తయారు చేశాను. అయితే దీనికి విపరీతమైన సహనం, పట్టుదల అవసరం. అవి నాకున్నాయి కాబట్టే దీనిని పూర్తి చేయగలిగాను'' అన్నాడు.

మొదట్లో ఈ మాచ్ స్టిక్‌లతో చిన్నచిన్న బొమ్మలను తయారు చేశాను. కానీ రానురాను ఓ పెద్ద వస్తువును చెయ్యాలనే కుతూహలం కలిగి ఈ సైనికుడి బొమ్మను తయారు చేశానన్నాడు మోరిస్.

అతడికి మధ్య యుగాలనాటి చరిత్రంటే

ఇష్టమని అంటాడు. ఆ కాలంనాటి రాజులు, వీరులు, డ్యూకులు ఎంత వైభవోపేతంగా జీవితాల్ని గడిపారో అని తలుచుకుని మురుస్తాడు. కేంబ్రిడ్జ్‌లోని ఫెజివిలియం మ్యూజియంకు వెళ్లిన మోరిస్ అందులోని సైనిక విగ్రహాల వస్త్రధారణ, పెర్సనాలిటీ మొదలైన విషయాలపై ఎంతో పరిశోధన చేశాడు. వాటికి సంబంధించిన ఎన్నో ఫొటోలు తీసుకుని ఒక సాయుధ సైనికుడి చిత్రాన్ని ప్రాక్టీసు చేసి చివరకు సాధించగలిగాడు.

అతడు ఈ అగ్గిపుల్లల తయారీలో కుతూహలం వున్న వారికి దానిని విపులంగా విశదీకరించాడు. మొట్టమొదట అగ్గిపుల్లలకి మందు లేకుండా ఖాళీ పుల్లలతో పని ప్రారంభించాలి. నిజానికి కొన్న అగ్గిపుల్లలన్నీ ఉపయోగపడవు. అందులో విరిగిపోయినవి, మరీ సన్నగావున్న పుల్లల్లాంటివి ఏరేయాల్సి వస్తుంది.




మొట్టమొదట సైనికుడి బొమ్మ తల నిర్మాణంతో ప్రారంభమవుతుంది. ఈ భాగం పూర్తి కావడానికి చాలా సమయం పడుతుంది. ఈ నిర్మాణం సరిగ్గా రావాలంటే అగ్గిపుల్లలనన్నిటినీ వేరువేరు సైజుల్లో కట్ చేసి పెట్టుకోవాల్సి వుంది. హృదయ భాగాన్ని తయారు చేయడానికి ఓ చిన్న వైరు మెష్ లాంటిది కావాలంటాడు మోరిస్. దానిమీద టేప్ అంటించి, ఆ టేప్ మీద పుల్లలను అంటిస్తాడు. తల, హృదయ భాగం కూడా ఓ ఇనపరేకుకు ఫిక్స్ చేస్తాడు. ఈ తయారీలో ఎన్నోసార్లు వైఫల్యాలు కూడా ఎదురౌతాయి. అయినా బొమ్మ పూర్తికావాలంటే ఎంతో సహనమవసరమంటాడు మోరిస్.

మోరిస్‌కు విసుగు, కోపం కూడా చాలా ఎక్కువ. బొమ్మలో ఏ కాలు భాగమో, చెయ్యి భాగమో కొంచెం వంకర అనిపిస్తే మొత్తం బొమ్మనే నాశనం చేసి పునః నిర్మించడం ప్రారంభిస్తాడు. అప్పుడప్పుడు ఈ పని ఎందుకు ప్రారంభించాన్రా దేముడా అని మోరిస్ విచారించిన రోజులు కూడా వున్నాయి. అప్పుడప్పుడు కొన్నాళ్లపాటు ఆ బొమ్మ సంగతే మర్చిపోయి మళ్లీ పని ప్రారంభించేవాడు. కొన్ని చిన్నచిన్న జాయింట్లలో పుల్లలను అమర్చడానికి వీలులేని చోట్ల ఒక ప్రత్యేకమైన మట్టిని వాడేవాడు. విగ్రహంలో పైభాగ నిర్మాణం పూర్తయ్యాక ఓ చిన్న చెక్క ప్లాట్‌ఫారాన్ని నిర్మించి దానిమీద కాళ్ల తయారీని ప్రారంభించేవాడు.

కాళ్ల తయారీ ఇంకా కష్టమంటాడు మోరిస్. ఒక్కొక్క కాలు ఆరు ప్రయత్నాల తరువాత సరిగా కుదిరేది అంటాడు. కాళ్లలో

పలి భాగంలో నిలుచోటానికి అనువుగా ఇనుపరాడ్స్‌ని ఉపయోగించడంతో అగ్గిపుల్లల సైనికుడు వంగిపోయే ప్రమాదం లేదంటాడ తను. ఈ ఇనుప రాడ్స్ వగైరా వస్తువుల మూలంగా దీని బరువు పెరుగుతుంది. ఖర్చు మాత్రం 2000 అవుతుంది.

ఈ బొమ్మకి వస్త్రధారణ ముఖ్యమయిన విషయమంటాడు మోరిస్. అంతేకాదు దీనికి కనుబొమ్మల నతికించడం కూడా శ్రమతో కూడిన విషయమే. కనుబొమ్మలు, గెడ్డం కూడా మరీ సహజంగా వుండాలనుకునే మోరిస్ తన గడ్డాన్ని, కనుబొమ్మలని పీకి బొమ్మకి అంటించానంటాడు. బొమ్మ నడుం భాగానికి ఓ నల్లటి బెల్టు కూడా అమర్చాడు మోరిస్.

మార్కెట్‌కి వెళ్లనఖ్ఖరలేకుండానే ఇంట్లో వుండే చిన్నచిన్న వస్తువులనే అతడు బొమ్మకి అందంగా అమరుస్తాడు. గార్డెన్‌లో దొరికే చిన్నచిన్న ఈకలను తెచ్చి బొమ్మకు అతుకుదామంటే ఒక్కటీ దొరకలేదని వాపోతాడు మోరిస్. అప్పుడు అతడి తల్లి ఓ పక్షుల అంగడికి వెళ్లి డబ్బులిచ్చి రకరకాల ఈకలను తెచ్చి బొమ్మ టోపీకి అమర్చింది. ఇంతకీ రెండేళ్ల సమయం పట్టిన ఈ సిపాయి నిర్మాణంలో నేనెంత నష్టపోయానో, సమయాన్ని వృధా చేశానో తెలియదుగానీ, ఆ సిపాయి అంటే మాత్రం పంచప్రాణాలు అంటాడు మోరిస్.

## చైనాలో పిల్లల టీవీ

ఇప్పుడు టీ.వీ. కార్యక్రమాలు ఎంత విస్తృతమయ్యాయంటే పగలూ, రాత్రీ లేకుండా ఎప్పుడుపడితే అప్పుడు మనకి నచ్చిన ఛానల్‌ని ఆన్ చేసుకుని నచ్చిన కార్యక్రమాన్ని తిలకించగలుగుతున్నాం. పిల్లలు, నడివయస్కులు, పెద్దలు, వృద్ధులు ఇలా ఎవరికి తగ్గ కార్యక్రమాలు వాళ్లకి లభిస్తున్నాయి. అయితే... నిజానికి ఇలా అందరూ ఒకే టైములో తమ తమ అభిరుచులకనుగుణంగా టి.వి. చూడాలంటే కుటుంబంలో ప్రతి వ్యక్తికీ ఒక్కొక్క టీ.వీ. ఉండాల్సిందే. చైనాలో ఎక్కువ దూరదర్శిని కార్యక్రమాలు పిల్లలకి సంబంధించి ఉంటాయి. అక్కడ 15 సంవత్సరాల వయసులోపు పిల్లల సంఖ్య సుమారు 30 కోట్లు ఉంది.

చైనాలో దాదాపు అన్ని కుటుంబాల్లోనూ స్త్రీ పురుషులిద్దరూ పనిచేస్తారు. 16 పెద్ద నగరాలను పరిశీలిస్తే తేలిందేమంటే సుమారు 70 శాతం పిల్లలు నర్సరీలలో ఉంటారు. చైనా ముఖ్య పట్టణమైన బీజింగ్‌లో 2,334 కిండర్‌గార్డెన్ నర్సరీలున్నాయి. ఇవన్నీ కలిపి మూడేళ్లలోపు వయసుగల ఒక లక్షా ఎనభై ఏడు వేలమంది పిల్లలను తమవద్ద ఉంచుకుంటున్నారు. ఈ సంస్థలలో పిల్లలకు ఐక్యత, సంఘీభావం మొదలయినవన్నీ నేర్పుతారు. కానీ తల్లితండ్రులకన్న ఎక్కువగా ఎవరూ పిల్లలకి సంస్కారాన్ని, విద్యాబుద్ధులను నేర్పలేరని ఆయా నర్సరీల హెడ్లులే చెబుతూవుంటారు. ఆ వయసు పిల్లలకు అక్కడ గాలి, నీరు, తుపాను, ఉరుము మొదలైనవి చెబుతూ విజ్ఞాన శాస్త్రానికి సంబంధించిన ప్రాథమిక విద్యను నేర్పుతారు. అలాగే గణితానికి చెందిన ప్రాథమిక విద్యను కూడా అందిస్తారు. ప్రతిరోజు పిల్లలు 'నా దేశాన్ని, దేశ ప్రజల్ని, నా పనిని, ప్రభుత్వాన్ని గౌరవిస్తాను' అని ప్రతిజ్ఞచేస్తారు నర్సరీలలో. అయితే చైనాలో పిల్లల విషయంలో మరో కొత్త పద్ధతి కూడా ఉంది. చాలామంది పిల్లలకి 3, 4 సంవత్సరాల వయసుదాకా ప్రభుత్వమే వారి విద్యాబాధ్యతను స్వీకరిస్తుంది. పిల్లలు ఇంట్లోనే కూర్చుని టీ.వీలద్వారానో రేడియోల ద్వారానో ప్రాథమిక విద్య పొందేలాగ క్యాసెట్లు వగైరా-పరికరాలను ప్రభుత్వం ఇంటికే సప్లయ్ చేస్తుంది.

1982వ సంవత్సరంలో ప్రత్యేకంగా పిల్లలకోసం, వారికి సంబంధించిన సినిమాలు తియ్యాలన్న విప్లవం వచ్చింది. అయిదేళ్ల క్రితం బీజింగ్‌లో పిల్లలకోసం చిత్రాలను తియ్యడానికి ఓ స్టూడియో నిర్మించారు. ఇప్పుడు చైనా టీ.వీ. చూస్తే సుమారు రోజుకి 27 దాకా పిల్లల కార్యక్రమాలు ప్రసారమవుతున్నాయి. మామూలు పెద్దల కార్యక్రమాల కన్న పిల్లల కార్యక్రమాలకు కేటాయించే సమయం ఎక్కువ అంటారు దూరదర్శన్‌వాళ్లు.




1981లో పిల్లలకు సంబంధించిన సాహిత్యం కూడా అభివృద్ధి దిశగా పయనించడం ప్రారంభించింది చైనాలో ప్రభుత్వం స్పాన్సర్ చేసిన 5గురు పబ్లిషర్స్ కేవలం పిల్లల సాహిత్యంమీద పుస్తకాలను ప్రచురించారు. ఇవన్నీ సీరియల్స్‌గా ప్రచురించబడ్డాయి. ఇవి దాదాపు 70 దాకా ఉన్నాయి. ఇవి కాక పిల్లల పత్రికలు, పేపర్లు వగైరా చాలానే ఉన్నాయక్కడ.

13 దినపత్రికలు, 60 వారపత్రికలు కేవలం పిల్లలకోసం ఉన్నాయి చైనాలో బాల సాహిత్యంలో 30 ఏళ్లక్రితం ప్రారంభమైన ఓ పత్రిక అత్యధిక అమ్మకాలతో... అంటే నెలకి ఒక కోటీ పదిలక్షల సర్క్యులేషన్‌తో ఇప్పటికీ నడుస్తోంది.

ప్రతి సంవత్సరం జూన్ 1వ తేదీన 'ఇంటర్నేషనల్ చిల్డ్రన్ ఇయర్'ను జరుపుకుంటారు చైనాలో. 34 సంవత్సరాలక్రితం షాన్‌గాయ్‌లో చిల్డ్రన్ ప్యాలెస్ నిర్మించబడింది. ఇది 'చైనీస్ సెంట్రల్ సోషల్ వెల్‌ఫేర్ బోర్డ్' వారి ఆధ్వర్యంలో ఉంది. ఇందులో ఏటా 30 వేలమంది పిల్లలు అనేక వినోద కార్యక్రమాలు జరుపుకుంటున్నారు. 6 నుంచి 16 సంవత్సరాల వయసు వరకు పిల్లలకు బిస్కట్లు, పాలు, బొమ్మలు వగైరాలు ఉచితంగా అందించబడతాయి. పిల్లలు తమ తమ హోమ్‌వర్క్‌లు ముగించాక ఈ ప్యాలెస్‌కు వస్తారు. ఇక్కడ అనేకరకాల ఆటలు, ఇతర కార్యక్రమాలు ఉంటాయి. ఇవికాక ఎక్కడపడితే అక్కడ పిల్లల గేమ్స్ సెంటర్లుంటాయి. అందుల్లో కంప్యూటర్‌గేమ్స్ ఆడుతూ వుంటారు పిల్లలు. 1981లో 'చైనీస్ చిల్డ్రన్ ఫండ్' ప్రారంభించబడింది. దీని నిధులను పిల్లల ఆటలకు, వైజ్ఞానిక అవసరాలకు ఉపయోగిస్తారు.

అక్కడి పిల్లలు ఎక్కువగా ఇష్టపడే ఆటలు టెన్నిస్, బాక్సింగ్, బాస్కెట్‌బాల్, బేస్‌బాల్, వాలీబాల్, కరాటే వగైరాలు. ఆడపిల్లలకి కూడా ఐస్‌హాకీ, అల్పాయిన్ స్కేయింగ్ లాంటి ఎన్నో ఆటలు ఉన్నాయక్కడ.

# బందూక్‌పై -చతుర సమీక్షలు

జూలై 'చతుర'లో ప్రచురితమైన కందిమళ్ల ప్రతాపరెడ్డి రచన 'బందూక్'పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## 'ఆసక్తికర కథనం'

*(ప్రథమ బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

**చా**రిత్రక అంశాల ఆధారంగా రాయబడిన నవలలకు చదివించేశక్తి చాలా తక్కువ. ఈనాటి పాఠకుల అభిరుచికి సరిపడే మలుపులు, మషాలాలు, సెంటిమెంట్లు మొదలైనవి అందులో లోపించి పఠనాసక్తిని తగ్గించివేస్తాయి. ఏదో వ్యాస పరంపర చదువుతున్నట్లుగానో, డాక్యుమెంటరీ ఫిలిం చూస్తున్నట్లుగానో అనిపించడం సహజం.

అయితే ఈ అభిప్రాయానికి భిన్నంగా జూలై నెల చతుర నవల 'బందూక్' అత్యంత ఆసక్తికరంగా, ఉత్కంఠభరితంగా, ఉద్వేగపూరితంగా కొనసాగి ఎంతగానో ఆకట్టుకుంది. రచయిత శ్రీకందిమళ్ల ప్రతాపరెడ్డి తన రచనా ప్రతిభతో నవలను ఆద్యంతం రక్తికట్టించారు. యాభై సంవత్సరాలనాటి చరిత్రను పాఠకుల కళ్లకు కట్టినట్లు చిత్రించారు. పాత్రలు, సన్నివేశ చిత్రీకరణ, శైలి తదితర విషయాలలో రచయిత ప్రదర్శించిన పరిణితి ఈ విజయానికి దోహదం చేసింది.

నిజాం ప్రభువుల పాలనలో దొరల అకృత్యాలు, ఆగడాలు, రజాకార్ల దురాగతాలు గురించి యిదివరకు చదివివున్నా, వాటిని ఆధారంగా చేసుకొని రచయిత సృష్టించిన ఈ నవల మంచి ప్రయోగం. ఎందరో త్యాగధనుల ప్రాణత్యాగాలు, దేశభక్తి ఫలితంగా స్వరాజ్యసిద్ధి లభించింది. ఆ పోరాటంలో ఎందరో అసువులు బాసినా చరిత్ర పుటలకి ఎక్కలేకపోయారు. అలాంటివారి గురించి ఈ నవలలో తెలుసుకోగలిగాము.

పాత్రల సృష్టి విషయంలో రచయిత ఎంతో శ్రద్ధను, సహజత్వాన్ని పాటించారు. దొర పాత్రను ప్రవేశపెట్టిన తీరు, అతని వర్ణన, అతని నోటి వెంట వచ్చే పలుకులు అన్నీ కలసి ఆ పాత్రను పాఠకుల కళ్లముందు నిలబెట్టాయి. ప్రజలకోసం కుటుంబాన్ని, ప్రేయసిని త్యాగం చేసి దళంలోచేరి పోరాటం సాగించిన రవి పాత్ర ఎంతో ఉత్తేజకరంగా వుంది. అలాగే శకుంతల పాత్ర కూడ. రవి త్వరలో చనిపోతాడని తెలిసి కూడా అతని చేత తాళికట్టించుకొని అతని ఆశయాల బాటలో నడిచిన ఆ స్త్రీ పాత్ర మహోన్నతం.

'మంచి నవలలకు సరైన చిరునామా చతుర' అనే అభిప్రాయాన్ని మరింతగా పెంచిన నవల 'బందూక్' అని చెప్పటం అతిశయోక్తి ఎంతమాత్రం కాదు.

-ఇ.టి.రామారావు
తిరువనంతపురం-695 022

# మరో ధర్మయుద్ధం కోసం

*(ద్వితీయ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)*

ఒకప్పటి నిజాం నిరంకుశపాలనలో పడరాని పాట్లు పడ్డ తెలంగాణా ప్రజల వ్యధాపూరిత చరిత్రను చక్కగా చిత్రించిన నవల 'బందూక్'.

ఇక్కడ అమాయక జీవుల దారుణ చిత్ర హింసలుకాదు చరిత్ర... తిరుగబడి, తనవారిని దరిజేర్చిన రవిలాంటి రత్నాలది చరిత్ర.

పాపిరెడ్డి లాంటి మంత్రుల్ని పబ్లిక్‌లో ఉతికేసిన శకుంతల లాంటి సాహస నారీమణులది చరిత్ర.

తెలంగాణా స్వాతంత్ర్య సమరగాధ చాలా మందికి తెలిసిందే,

కథకాదు కొత్త, ఇక్కడ కథ చెప్పిన తీరుకొత్త.

విప్లవం అనేది పాతదే కానీ ఈ విప్లవం నడిచిన దారేకొత్త.

రెండో ప్రపంచయుద్ధకాలంలో నాజీలు యూదులను హతమార్చినట్లు, నిజాం పాలనలో ప్రజల నోరులేని తనాన్ని దొరతనం ఎలా దోచుకుందో న్యాయానికి దౌర్జన్యం ఎలా సంకెళ్లు వేసిందో వివరించిన కథనం నవలకు వన్నె తెచ్చింది.

రచయిత కందిమళ్ల ప్రతాపరెడ్డిగారి భాష మొత్తం మీద బాగానే ఉన్నా అక్కడక్కడ కాస్తంత ఇబ్బందిగా ఉందనే అనాలి. తెలంగాణా తెలుగునీ, మాండలికాన్నీ రాసుకొచ్చిన తీరు బాగుంది. మొదటినుంచీ చివరదాకా ఏకబిగిన చదివించే సుగుణం నవలలో ఉంది.

పాఠకుల్ని ఉత్తేజపరిచే పాత్రలలో నిజానికి హీరో రవికంటే కూడా శకుంతలకే ఎక్కువ మార్కులు పడతాయి. నిరాక్షేపణీయమైన నిర్ణయాలతో కడదాకా నిలబడి, ప్రజాద్రోహులకి గుండెలో గునపమై నవలకు వెలుగు తెచ్చిన విప్లవవనిత ఆమె.

దొరవారిపొలంలో నాట్లేస్తున్న లచ్చుమమ్మని కన్నబిడ్డకి పాలు కుడుపుకోడానికైనా వదలక దొప్పలోకి ఆమె పాలు పిండించిన కిరాతకుడు పాపిరెడ్డి పాపాలు, పరోక్షంగా దొరమీదపడి దొర తల తెగిపడ్డం, అందుకు కారణం కొడవలితో తల నరికిన లచ్చుమమ్మ కావడం నవలకు హైలైట్.

దొర దుర్మార్గాలకి సమాంతరంగా దొరసానులు సాగించిన రహస్య భాగోతాలు, చివరికి వాళ్లని ఎంతో హీనస్థితికి తెచ్చింది.

కష్టాలు, కన్నీళ్లతో కాలిపోతోన్న కాలంతో, అమాయకుల నిస్సహాయతలోంచి పుట్టుకొచ్చే ఆవేశం కార్చిచ్చుకంటే ప్రమాదం అని దొరలాంటి దొడ్డవారికి ఎప్పుడూ ఆలస్యంగానే తెలుస్తుంది మరి! అదే జరిగింది నవలలో.

'చెప్పింది చాలు, నోరు మూసుకో' అని పదిమందిలోనూ మంత్రిని అనగలిగిన ధైర్యం శకుంతలమ్మకు ఇచ్చింది ఆమె నైతిక బలమే! మనిషిని మనిషిగా మేల్కొలిపి జాగృతం చేయడమే ఇప్పటి సాహిత్య ప్రయోజనం. 'బందూక్' నవలలో ఆ ప్రయోజనం ఉంది.

**-దంతుర్తి చినరామచంద్రరావు**
రామచంద్రపురం-533 255

# చదివించే చరిత్ర

*(తృతీయ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

చరిత్ర పాఠాల్ని కొంతమంది స్టూడెంట్స్ మాత్రమే చదువుకుంటారని ఇప్పటివరకూ అనుకున్నాను. కాని అభిరుచి గల పాఠకులకు కూడా ఆ అవకాశం ఉందని జూలై నెల చతుర నిరూపించింది.

నిజాం నిరంకుశత్వాన్ని, పటేల్ పట్వా

రీల పాశవిక పశుత్వాన్ని ఇంతవరకూ చూచా యగా వినడం మాత్రమే జరిగింది. కాని ఒళ్లు గగుర్పొడిచే గతకాలపు వాస్తవికాంశాల ను కళ్లముందుంచిన దివ్యదర్శినిగా 'బందూక్'ని పేర్కొనవచ్చు. నిరంకుశత్వం ప్రబలినప్పుడు విప్లవతత్వం ప్రజ్వరిల్లక తప్పదని మరోసారి చాటిచెప్పిందీ నవల.

నాటి దొర (నవాబు)ల దుర్నీతికి... నేటి రాజకీయ నాయకుల స్వార్ధరీతికి మధ్య చక్కని సామీప్యాన్ని తీసుకు రాగలిగారు రచయిత. విద్య కేవలం కీర్తి ప్రతిష్టలకి, ధనార్జనకి ఎర కాకూడదనీ, సామాజిక సంర క్షణకి అదొక శక్తిమంతమైన ఆయుధమని రవి పాత్ర నిరూపించింది. అలాగే సుఖ సంతోషాలనే కాదు కష్టనష్టాలతో కూడిన ఆశయాలను కూడా పరస్పరం పంచుకోవడ మే నిజమయిన ప్రేమని తెలియజేసిన పాత్ర శకుంతల. నవలలోని పాత్రలన్నీ తమతమ విశిష్టతను చాటుకున్నాయి.

దొర స్వభావం, పాపిరెడ్డి, పెద్దొరసాని మధ్య సాగిన సరసాలు... ఇవన్నీ ఆ (అ) నాగరికుల జీవిత గమనంలోని వైకల్యాల్ని తెలియజేశాయి, బాగానే ఉంది. అయితే చదువుకున్న దానిగా, సాధు స్వభావంగల దానిగా చెప్పబడ్డ చిన్నదొరసాని ఒక పరిస్థి తిలో శంకరయ్యకు తన శరీరాన్ని అప్ప గించినట్లు చిత్రించారు రచయిత. దీనివల్ల పాఠకులకు ఏం చెప్పాలనుకున్నారో అర్థం కాలేదు. అలా కాకుండా చిన్నదొరసానిలో మంచి ఆలోచనని రగిల్చి తద్వారా ప్రజాచై తన్యానికి ఏదోవిధంగా సహాయపడేటట్లు చే సుంటే ఆ పాత్ర నిరర్థకమయ్యేుండేది కా దేమో!

సమైక్య చైతన్యంతో నాడు దొరల దౌర్జ న్యాలను మట్టుపెట్టగలిగిన ప్రజ నేటి రాజ కీయ నాయకుల వింతగారడికి డూడూ బస వన్న మాదిరిగా తలూపుతుందన్న విషయం సత్యదూరం కాదు. అప్పటి అవినీతి, అక్రమం ఊసరవెల్లిలా నేడు అవతారం మార్చుకుని పబ్బం గడుపుకుంటుంటే... నిర్వీర్యమైన ఆ ప్రజాచైతన్యం మాత్రం తిరిగి జీవం పోసుకోలేకపోతోంది. అందుకే తమ తరంలో ఉద్యమించి విజయం సాధించామనుకున్న శకుంతల అది తాత్కా లిక విజయమేనని భావించి శాశ్వత విముక్తి కోసం అప్పటి స్ఫూర్తితో కొత్త ఉద్యమానికి నాంది పలికింది. ఆ ఉద్యమాన్ని విజయ వంతం చేయాల్సిన నైతిక బాధ్యత నిస్సందే హంగా నేటి యువతరానిదే! ఆ మహో న్నత స్ఫూర్తే ఈ యదార్థగాథ యొక్క ప్రయోజనం!!

-ఎన్.భాస్కరరావు
నేలటూరు-533 308

## 'స్ఫూర్తిదాయకం'

*(నాలుగవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

**'బం**దూక్' నవల చదువుతుంటే నా బాల్య దశలో మా నాన్నగారు వివరించిన తెలంగా ణా విముక్తి ఉద్యమానికి సంబంధించిన ఒళ్లు జలదరించే సంఘటనలు గుర్తుకువచ్చి వాటిని ఇప్పుడు వాస్తవికంగా చూస్తున్న అనుభూతికి లోనయ్యాను. అందులోనూ తెలంగాణా యాసలో రాసిన నవల కనుకా, అందులోని ప్రతి పదమూ నిత్య పరిచయం వలన సులభగ్రాహ్యం కావడంవల్లా నవల ఆద్యంతమూ ఏకధాటిగా చదవటానికి దో హదం చేసింది.

200 సంవత్సరాలు పాలించిన బ్రిటిషు వారి నుండి స్వాతంత్ర్యం పొంది, భారతీయు లు స్వేచ్ఛా వాయువులు పీల్చుకొంటున్న తరుణంలో, అదే భారతీయుల్లో మరికొంద రు ఇంకా దాస్యశృంఖలాల్లోనే బంధించబ డి, దారుణ జీవితాన్ని అనుభవిస్తున్న 'తె లంగాణీయుల' వీరోచిత విముక్తి ఉద్యమం కన్నులకు కట్టినట్టుగా వివరించారు రచ

యిత.

భాస్కరరావు దొరలాంటి ఫ్యూడలిస్టులు, ఖాసిం రజ్వీలాంటి రజాకార్లు మామూలు పేద ప్రజానీకంపై జరిపిన నికృష్ట, నిర్లజ్జాకర దమనకాండ చరిత్ర పుటల్లో నిలిచిపోయిన చెరగని మచ్చ. నవలలో వివరించిన ఏ ఒక్క సంఘటన కూడ కల్పితం కాదనీ, వాస్తవంగా జరిగిన పచ్చినిజమేననీ, చదువుతున్నంతసేపూ నా హృదయం ఘోషించింది. 'బాంచన్‌దొర, నీ కాల్మొక్త' లాంటి నిత్యజీవితాల తెలంగాణ గడ్డపై సమర శంఖం పూరించి, సఫలుడై సమిధయైపోయిన రవి అతనివలెనే అసువులు బాసిన మరెందరో యువకులకు ప్రతీక. నేటి యువతరానికి స్ఫూర్తి, తత్సమానమైన త్యాగనిరతిని కల్గి, రవి అడుగుజాడల్లోనే నడిచి, ఆయనకు అర్థాంగియై శత్రువుపై అపరకాళిలా విజృంభించిన శకుంతల మహిళా జాతికే ఆదర్శప్రాయమైన మచ్చుతునక. భారతావని పూర్తి స్వాతంత్ర్యం పొందిన తర్వాత, పూర్వపు జమీందార్లు, జాగీర్దార్లు, దొరలు ప్లేటు ఫిరాయించి ఖద్దరు దుస్తులు ధరించి, టోపీలు పెట్టుకొని రాజకీయ నాయకులుగా అవతరించి, ఎంఎల్యేలుగా, ఎంపీలుగా, మంత్రులుగా నేటికీ చలామణీ అవుతూ కొత్తరకం దోపిడీకి పాల్పడుతున్నారనటానికి పాపిరెడ్డి పాత్ర చక్కని తార్కాణం.

నవల చివరిపేరాలో శకుంతలమ్మ చెప్పినట్టుగా మరో ధర్మయుద్ధం జరిగి సామాన్యుడికి సర్వత్రా న్యాయం జరిగే వ్యవస్థ రావాలి. అప్పుడే మనిషికి దొరికేది నిజమైన స్వేచ్ఛ, పరిపూర్ణమైన స్వాతంత్ర్యం. ఒక స్ఫూర్తిదాయక నవలనందించిన కందిమళ్ల ప్రతాపరెడ్డిగారికి, చతురకు ధన్యవాదాలు.

-ఎం.రవీంద్రనాథ్,
మిట్టాపల్లి-503 164

## దేశభక్తులకు తీయని జ్ఞాపకం

*(అయిదవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

తెలంగాణా ప్రాంతంలో స్వాతంత్ర్యానికి ముందు నిజాం నవాబు, అతని రజాకార్ల పరిపాలనను అమాయక ప్రజానీకంపై రుద్దిన తీరు, వారి తొత్తులైన పోలీసుల ఆగడాలనూ చిత్రించిన 'బందూక్' రచయిత కందిమళ్ల ప్రతాపరెడ్డిగారు అభినందనీయులు. నిజానికి ఈ కథా వస్తువు చాలా పెద్దది. అందువల్లనే రచయిత తనకున్న పరిధుల్లో ఇతివృత్తాన్ని కొద్దిపేజీల్లో ఇమడ్చలేక తన భావాలను పూర్తిగా చెప్పలేని నిస్సహాయతను వ్యక్తం చేసినట్లనిపిస్తుంది. మొదట్లో కథనం బిగువుగా కనిపించినా రానురాను పట్టుసడలింది. ఈ కథ ఎవరి చుట్టూ అల్లబడిందో ఆ పాత్రల స్వభావాలేమిటో పాఠకునికి సరియైన రీతిలో అందించలేకపోవడం ఒక లోపం. మొత్తం మీద ఒక రవి, ఒక శకుంతల, ఒక లక్ష్మమ్మ ఒక పాపిరెడ్డి, ఒక పెద్దొరసాని పాత్రలు చేసిన ఆగం కథలో ఆసక్తి కలిగించే అంశాలు. అయినా రచయిత సామర్థ్యం వలన నవల ఒకనాటి గౌతంఘోష్ సినిమా చూస్తున్నట్లుగా, ఒక తాతగారి జ్ఞాపకాల్ని వింటున్నట్లుగా ఆద్యంతం ఆసక్తికరంగా సాగింది. ముగింపు ఇంకాకొంచెం బలంగా చెబితే బాగుండేదే మోగానీ అటు జ్ఞాపకాలు నెమరేసుకునే పాతతరం వారికి ఇటు ఆలోచించే యువతరం వారికి ఒక తీయని జ్ఞాపకంగానూ, ఉత్తేజకర సందేశంగానూ మిగిలేలా ఈ నవల రాసిన ప్రతాపరెడ్డిగారు అభినందనీయులు.

-గడ్డంపల్లి ...లరెడ్డి
గడ్డంపల్లి- 509 385

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel: 290328 Office Address: VIPULA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 318181, 399444; Madras: 8270434, 8251044;Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur; 353942.

CHATURA Telugu Monthly Hyderabad–500 482 Regd. No. H/HD/402